శ్రీ ధన్వంతరయే నమః.

# వైద్యకల్పతరువు

ఆంధ్ర తాత్పర్యసహితము.

శ్రీ సీతారామచరణసేవాలబ్ధవైద్యవిద్యాధనుఁడును

శ్రీ వేంకటగిరిసంస్థానాస్థానవైద్యాంతర్గతుఁడు నగు

శ్రీ తిరుమల శెట్టి రామకృష్ణదాసుచే

రచింపఁబడినది.

శ్రీ కొల్లాపురసంస్థానాస్థానవిద్వాంసులు

బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివశాస్త్రులవారిచే పరిష్కృతము



శ్రీ శ్రీ వేంకటగిరిసంస్థానాధీశ్వరసహోదరులగు

రాజా శ్రీ వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్ర బహాదర్ గారి అనుమతిని

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1952

# పీఠిక

సర్వేశ్వరుండు మానవకోటికి నాయురారోగ్యాభివృద్ధికై యాయుర్వేదంబు సృజించె. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్." ధన్వంతరి మొదలగువారిచేఁ బెక్కు వైద్యగ్రంథములు రచింపబడెను. "విద్యామాయుర్వేద మధీతే వేత్తివా వైద్యః" ఆయుర్వేదవిద్యను చదివినవాడుగాని, ఎఱిఁగినవాడుగాని వైద్యుఁడగును. అట్టివానికిది కల్పతరువువలె సకలమును గలిగించునదిగాన నీగ్రంథమున కావేరెంతయు దగియున్నది. బాహటాదివైద్యగ్రంథములు పెక్కులుండగా నీచిన్నిపొత్తమేల? యని చెప్పరాదు. అవి యరణ్యంబులవలె విపులములై దురవగాహములయి సమర్థంబులుగ నున్నవి. ఆలోటును బాపుట కాగ్రంథములలోని విషయముల నేర్చి కూర్చి యిది సంఘటింపబడినది. ఇది భిషక్కులకందఱకునుహస్తగతం బుండ దగినది. ఇందలి విశేష మేమనః—

వైద్యగ్రంథములు పెక్కులున్నను రోగనిదానము సులభముగ గ్రాహ్యమగుటలేదు. మనుజునకేవ్యాధిసంక్రమించినను మొదట జ్వరముమాత్రమువచ్చు ననుట యెల్లరకు విదితమే. కాన నాజ్వరమునుబట్టి, దీనికిమూలకారణమేదియో? యనియోచించి యావ్యాధిని గనుగొనవలయును. అట్లుకనుగొను విధమును, తన్నివారణమును చక్కగ నిందు పొందు

పఱుపబడియున్నది. ఇందు 1. జ్వరకారణస్వరూప నిరూపణప్రకరణము, 2. జ్వరస్వరూపనిరూపణప్రకరణము, 3. అక్రాంత జ్వరప్రకరణము, 4. సన్నిపాతజ్వరప్రకరణము, 5. వాతాది దోషస్వరూపనిరూపణ ప్రకరణము, 6. మేహప్రకరణము అని యాఱు ప్రకరణములు గలవు.

మఱియు దేశ-కాల-వస్తు-గుణ-కార్య - తత్వ-లక్షణ-కారణ-వ్రణములు, వివిధజ్వరములు, ఔషధపథ్యాపథ్య-ఉపచారాదివైకల్యములు, సప్తధాతువులు, మరణజనక జ్వరంబులు, మానసిక జ్వరంబులు మున్నగునవి సహేతుకముగ నిరూపింపబడియున్నవి. ఇదియనుభవసిద్ధులగు గొప్పవైద్యవిద్వాంసులచే సాధారణముగ వైద్యముచేయువారికెల్లరకు నుపయుక్తము లగునట్లువ్రాయఁబడినది. ప్రతిగృహమునందు నుండదగిన యుత్కృష్టగ్రంథము. ఎల్లరు దీనినిగొని యుపయోగించి ధన్వంతరిప్రసాదమునకుఁ బాత్రులయి ఆయురారోగ్యభాగ్యములనంది సుఖింతురుగాక!

తండయార్పేట,
చెన్నపట్టణము
1952.

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# ఉపోద్ఘాతము

శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండును పృథివ్యప్తేజోవాయ్వాకాశాదిప్రపంచనిర్మాతయుసమస్తదేహేంద్రియబుద్ధ్యాదివ్యాపారప్రవర్తకుండును బరమమంగళస్వరూపుండును భవరోగభిషక్కును మృత్యుంజయుండును సచ్చిదానందరూపుండును నగు పరమేశ్వరుండు "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అని పురుషార్థముఖ్యసాధనంబగు శరీరంబు ప్రాణులకుగల్గించి తదాధారంబగుచున్న యాయురారోగ్యంబుల యభివృద్ధికై యాయుర్వేదంబు సృజించె, నట్టియాయుర్వేదవిషయంబులుగలది యీవైద్యకల్పతరువు. "విద్యామాయుర్వేదమధీతే వేత్తివావైద్యః"ఆయుర్వేదము చదువుచున్నవాడుగాని యెఱిగినవాడుగాని వైద్యుడనబడును. అట్టివానికిఁ గల్పతరువు అనగా వైద్యులలో జిజ్ఞాసువులుగా నుండువారికి స్వనిష్టాంశంబులు దెలుపుచుఁగోరిన కోర్కులగల్పించుగల్పవృక్షమువలె విలసిల్లునది యనుట.

బాహటాదివైద్యగ్రంథములు పెక్కులుండగా నీ వైద్యకల్పతరువువలనం బ్రయోజనం బేమియందురు ఆబాహటాదులు విపులంబులు సమర్థంబులు. ఈయది తెనుఁగున సులభశైలిగా వచనరూపముగా రచియింపబడి "కారణం బుద్ధ్వా కార్యం కర్తవ్యం" అనున్యాయమున జ్వరాదిరోగకారణంబుల నెఱింగినం జికిత్సజేయుట సులభంబని నాయనుభవసిద్ధంబులైన

వైద్యాంశంబులు శాస్త్రవిరుద్ధములుగా వ్రాయంబడియె. నీ గ్రంథము ౧. జ్వరకారణస్వరూపనిరూపణప్రకరణము, ౨. జ్వరస్వరూపనిరూపణప్రకరణము, ౩. ఆహికజ్వరప్రకరణము, ౪. అశ్రాంతజ్వరప్రకరణము, ౫. సన్నిపాతజ్వరప్రకరణము, ౬. వాతాదిదోషస్వరూపనిరూపణప్రకరణము, ౭. మేహప్రకరణము, అని ౭ ప్రకరణములు గలిగి యంతర్గతములైన యంశములు అనగా దేశ, కాల, వస్తు, గుణ, కార్య, తత్త్వ, లక్షణ, కారణ, వ్రణ, రోగములంబట్టి కల్గుజ్వరంబులును ద్వంద్వరోగజన్య జ్వరంబులును ఔషధ పథ్య అపథ్య ఉపచార అపచారాదివైకల్యసంభూతజ్వరంబులును సాంక్రామికజ్వరంబులును వివిధజ్వరజాయమానవివిధరోగంబులును త్వఙ్మాంసాది సప్తధాతుజ్వరంబులును మరణజనకజ్వరంబులును మానసికజ్వరంబులును మఱియు కొన్ని యితరరోగంబులును వీని కార్యకారణంబులం దెలుపునవి గలిగియున్నది. ఈగ్రంథమునకే 'జ్వరస్వరూపనిరూపణంబు' అనియు నామాంతరంబుగలదు. ఇందలియంశములు విషయసూచికయందు సవిశేషంబుగ జూడంజను.

మఱియు నీగ్రంథము రాజవైద్యులును, నితరవైద్యులును, యథోచితారోగ్యకరాంశజిజ్ఞాసువులును విలోకింపందగియున్నయది. ఏలనంటే నెల్లూరు డిస్ట్రిక్టు శ్రీవేంకటగిరిరాజధానీసప్తవింశతితమప్రభురత్నంబులై శ్రీమద్వెలుగోటివంశపయఃపారావారసుధాకరులై సంగీతసాహిత్యవైద్యాదినిఖిల

కళానిపుణులై యన్వర్థనామధేయతంబరగియున్న శ్రీసర్వజ్ఞ కుమారయాచభూపాలురు స్వకీయసంస్థానాస్థాన వైద్యులలో నొక్కరినిగా మాతండ్రిగారైన పట్టాభిరామదాసుగారిని జేపట్టి వారి యూనాని యింగ్లీషు హిందూవైద్యములం బ్రకాశిల్లం జేసి ధర్మవైద్యశాలంబెట్టి ప్రభు నాగర గ్రామ్యజనులకు నౌషధంబు లిప్పించుచుఁ దత్తదనుభవవిశేషంబుల దృఢపఱచుచు నుండి మాతండ్రిగారి యనంతరము తత్పుత్రుండును దచ్ఛిష్యుండునను నభిమానంబు బొలుండనై యున్న నాయందుంచి నన్నును స్వకీయ వైద్యకోటిలోఁ బ్రవేశపఱచి పూర్వోక్త నానావిధవైద్యంబుల సవిశేషంబుగఁగఱపి శ్రీబొబ్బిలి, శ్రీ పీఠపుర, శ్రీ కొల్లాపుర సంస్థానములకుఁ దమపుత్రుల దత్తులగాబంపుతఱి శ్రీ వార్లవెంట మమ్ములను విద్యాబుద్ధులగఱపిపంపుచు దేశభేదవేద్యాంశంబులం దెలియంజేయుచుం దీర్చుచుండిరి. అట్టిహేతువులంబట్టి యయ్యనుభవవిశేషంబులును నీగ్రంథంబునం బొందుపఱచియున్నకతన నియ్యది యెల్లవారికి నవలోకనీయంబని తలంతు. ప్రాజ్ఞులిందు భ్రమాదికదోషంబులున్న మన్నింతురని వేడుచున్నవాఁడ !

ఇట్లు

తిరుమలసెట్టి రామకృష్ణదాసు.

# విషయసూచిక



# వైద్యకల్పతరువు

## ప్రథమ ప్రకరణము



శ్రీనాథం పార్వతీనాథం వాణీనాథం సరస్వతీం,
దుర్గావటుక హేరంబం ప్రణమ్య సతతం భజే.

### ధన్వంతరిధ్యానమ్

నమామి ధన్వంతరిమాదిదైవం
సురాసురైర్వందితపాదపద్మం,
లోకే జరా రుగ్భయ మృత్యునాశం
దాతార మీశం వివిధౌషధానామ్.

### జ్వరకారణ స్వరూప నిరూపణప్రకరణము

ఆహారశ్చ విహారశ్చ యస్య దోషైస్సమో బలం,
ధాతూనాం విగుణో యస్య స్రోతసాం స ప్రదూషకః.

ఎవనియొక్క యాహారము విహారము త్రిదోష సమమగునో వాని కాయువారోగ్యబలవృద్ధికలుగును. త్రిదోషములతో న్యూనాధికగుణమాయె నేని ధాతువులకు స్రోతస్సులకు రోగోత్పాదకదుర్గుణము గల్గును.

మఱియు నాహారాతిశయమున స్రోతస్సులకు నాహారరసము మెండై దానిమార్గము స్వల్పమై రసము మిక్కుటముగ నేర్పడుటయును, తొలుత భుజించినది జీర్ణమయి కానప్పుడు తిరిగి మీదమీద భుజించిన యాహారరసము వెనుక వెంబడివెంబడిగా ద్రోయుటచేతను, నిట్టియజీర్ణము శైత్యము నుష్ణము

గలుగును.మఱియు నట్టిచెడ్డపదార్థభేదములచేత దద్రసమూర్తమునందు మిశ్రమై మందము వేగము నిలుచుటలు అగుటచేత ధాతువులు స్రోతస్సులు రోగాదుల పాలగును. ఇటులనే విహారాదులస్థితియని యెఱుంగవలయును.

## సర్వరోగకారణము

సర్వేషామపి రోగాణామజీర్ణం త్వాదికారణమ్.

సమస్తరోగములకు నజీర్ణమాదికారణముగఁ జెప్పబడియున్నది. కాబట్టి సకలదేశముల మిథ్యాహారవిహారమనోవికాసభేదముల రోగాదులకు నగ్నిమాంద్యము ముఖ్యకారణముగ నున్నది.

## ఆయుర్వృద్ధికరమైన ఆహారక్రమము

అత్యాహారా ద్భవేద్వ్యాధి ర్లఘ్వాహారా ద్బలక్షయః,
మితాహారా ద్బలం సమ్యగాయుర్వర్ధనముత్తమమ్.

అతివిశేషపదార్థసేవవలన వ్యాధ్యుత్పత్తియనియు, తనజీర్ణశక్తికి స్వల్పాహారమువలన శరీరము నశించుట యనియు, విగుణము లేక, మితపదార్థసేవనచేత నాయురారోగ్యబలవృద్ధులు గల్గును గనుక నెమ్మూఁటిలో మితాహారమే యుత్తమమనుట. మఱియు నేదేశమందు నేమనుజుఁడుగాని యిందుఁజోయున్న రోగోత్పత్తికారణపదార్థములనేగాదు వారివారిశక్తికిమించిన యాహారవిహారములును వర్జించుట శ్రేయస్కర కార్యము.

## వాతాదివేగధారణనిషిద్ధము

వేగాన్న ధారయేద్వాత విణ్మూత్ర క్షవతృట్క్షుధాం,
నిద్రాకాసశ్రమశ్వాసజృంభా సృక్ఛర్ది రేతసామ్.

వాతము మలము మూత్రము తుమ్ములు దప్పి ఆకలి నిద్ర దగ్గు శ్రమ శ్వాస ఆవలింతలు రక్తము వాంతి రేతస్సు వీనియొక్క వేగము నడ్డగింపకూడదు. మఱియు దప్పిగొన్నప్పు డుదకపానము నాకలిగొన్నప్పు డాహారసేవనమును

మలమూత్రాదులుకదలినప్పుడు వానినివర్జించుటయు వీనిచే సయ్యాకలి మొదలగునవి శాంతించొందినట్లు పైశ్లోకమునందుఁజెప్పినవి చలనమాత్రాననే విడువవలెను. వాని నాటంకపఱచుటవలన దద్రూపములు వేఱొకమార్గమునగాని మఱియొకరూపముగఁ బరిణమిల్లిగాని రోగాదులను గలిగించును.

మఱియు పైచెప్పిన మూత్రపురీషాదులు సామాన్యముగ వెడలకుండునపుడు బలవంతముగ వెడలింపఁజేయుటయు, ధారాళముగవచ్చునపుడు వాని నిగ్రహింపజేయుటయు నివి సకలరోగోత్పాదకము లగును.

## పశు పక్షి నరుల యారోగ్యభేదక్రమము

మఱియుఁ బశుపక్షిమృగాదులు మలమూత్రాదులను గదలినమాత్రంబునఁ దత్క్షణమె విసర్జించుచున్నవి. అవి యాహారముఁకొఱకు తిరిగి తిరిగి దొరకినవి భక్షించుచు నిలకడలేక సంచరించుచు దప్పిగొనునప్పు డుదకపానముఁజేయుంచు మిగుల సుఖంబుండుట గని యాహారవిహారములసమత్వముఁ వాని మలమూత్రములు కదలినమాత్రంబున విసర్జించుట, దప్పిలేకనే ఉదకపానంబులేమియు, నాకలిలేకనే యాహారంబులేమియు, వీనివలన వానిజీవితకాలము సుఖముగ నుండుట దెలియఁబడుచున్నది. అవి యాహారవిహారముల తారతమ్యములేక సమత్వములుగ మెలగుచున్నది. కాబట్టి వానికి నాహారవిహారములవలన రోగోత్పత్తిగానము. వానికి సరకు రోగమనఁబడు విషూచివంటిరోగము గలదుగాని, మనుష్యులకు ఆహారపానమువలన రోగసంభవమువలెఁ గానము. అవి రోగప్రాప్తి కాలంబున నాహారపానీయవిహారము లెంతమాత్రము గొననేరవు. అవి జీవితకాలమువఱకు నీరోగిత గలిగియుండుటను జూచుచున్నాము.

ఇంతియగాక అవి ఋతువయినదాని నెఱింగి మైథునాసక్తి దీర్చుకొని చూలయినదికని తిరిగిగభోగాసక్తి విసర్జించుచున్నవి. ఇట్టి పశుపక్షిమృగములు యావజ్జీవితకాలము సుఖజీవులుగనుండుటయు, వాని యాయుంపు దీర్ఘముగనుండుటయు, బలము వృద్ధిగ నుండుటయు, స్పష్టముగఁ దెలియవచ్చును.

మైథునము ధాతువులను పంచభూతములను సర్వేంద్రియములను ధారించు సారమైన కార్యము గావున కామాతురముచే విశేషముగ ప్రవర్తించక వానికి నష్టముగలుగనీయక మితముగఁ బ్రవర్తించుటవలన జీవితకాలమువరకు ధాతువు నష్టపడక రోగమును జెందక సుఖమును బొందుదురు.

మరియుం జనులకు నాహారవిహారముల సమత్వములేక అత్యాహారవిహారములు గావించుటయు, విహారములు పూర్ణముగలేమియుం, విహారములుండియుం నాహారములేమియుం నిట్లు న్యూనాధికములుగ మెలగుట రోగప్రవేశంబున కాధారంబయ్యె.

అదిగాక ఋతుగుణము నెఱుంగక మైథునమున వారివారియిష్టానుసారముగఁ బ్రవర్తించి శరీరదార్ఢ్యము నింద్రియములు నష్టమగునట్లు రోగములఁబొందుదురు. మరియుం నకాలఫలితమైన సంతానమును బొందుదురుం. ఇట్టి సారహీనమైన బిడ్డలబలిమికి తిరిగి యిట్టివారికి సంతానముగల బిడ్డలబలము నింద్రియపాటవము లెట్లు హీనముగ నుండునో గానవలెను.

వృక్షసస్యాదుల యకాలఫలితమున కెంతప్రయోజనమో దాని నెఱుంగుదుముగదా! గావున నాహారవిహారమైథునము వారివారిబలాబలంబుల నెఱింగి శక్త్యనుసారముగఁ బ్రవర్తించవలెను.

## వ్యాయామ గుణము

మఱియు విహారము సమస్తేంద్రియపాటవము రోగములు తొలగుటయు అవయవములబలిమియు సౌష్టవము దేహదార్ఢ్యము ధైర్యసాహసక్రమములును నాయురారోగ్యవృద్ధులు వీని కాకరముగా నున్నది. కావున వారివారి యిష్టమైనపనులతో పాలుమారక పాటుబడుట శ్రేయస్కరకార్యము.

## సంచారగుణము

వ్యాయామః కర్మసామర్థ్య స్థైర్యదోషక్షయాగ్నికృత్,
ససదా గుణమాధత్తే బలినాం స్నిగ్ధభోజినామ్.

### వ్యాయామానంతరవిధి

తం కృత్వానుసుఖం దేహం మర్దయేచ్చ సమంతతః,

వ్యాయామానంతరము శరీరమునందు పీడ గలుగకుండునటుల శరీరము నందంతట బాగుగ మర్దించికొనవలయును.

సమస్తమైన దేహపరిశ్రమకార్యములన్నిటిలో వ్యాయామ మందరికిని సులభకార్యము.

సమస్తము నెరిగినమనుష్యకోటికి పశుపక్షి మృగాదుల సంచారమును శ్రీసర్వేశ్వరుఁడు జనులకుఁ దెలియజూపించుచుండగా, నంతకన్నను మిగుల జాలివితోఁ బ్రవర్తించి సుఖజీవులయి చిరాయుర్బలవర్ధులగునట్లు నడుచుటవలన ధర్మార్థకామ మోక్షములు మనపిత్రార్జితములని యెఱుంగవలెను.

### షడ్విధరోగోత్పత్తికారణములు

అత్యంబుపానాదతి సంగమాచ్చ
దివాచ సుప్తే ర్నిశి జాగరాచ్చ,
నిరోధనా న్మూత్ర పురీషయోశ్చ
షడ్భిః ప్రకారైః ప్రభవంతి రోగాః.

అతిశయముగా నుదకపానము జేయుంట, స్త్రీసంభోగము అధికముగా జేయుంట, పగలు నిద్రించుట, రాత్రివేళ మేలుకొనుట, మలమూత్రములు బంధించుట. ఈ ౬ విధములు రోగోత్పత్తికారణములు. వాని నాటంకపరచుట వలనఁ దద్రూపములు వేరొకమార్గమునగాని, మఱియొక రూపముగఁ బరిణమిల్లి గాని, రోగాదులఁ గలిగించును.

### పథ్యాపథ్యప్రభావము

పథ్యే సతి గదార్తస్య కిమౌషధనిషేవణైః,
పథ్యేఽసతి గదార్తస్య కిమౌషధనిషేవణైః.

పథ్యముండగా రోగికి నౌషధసేవవలన నేమిప్రయోజనము పథ్యము లేకుండగా రోగికి నౌషధసేవవలన నేమిప్రయోజనము? ఔషధసేవకంటె పథ్యసేవ యెక్కువనుట.

మఱియు రోగావేశము సులభము. గాని, వచ్చినది వెంబడె దొలుగుట మహాదుస్తరముగా నెఱుంగవలెను.

## మిథ్యాహారాభ్యాసఫలితము

మఱియు మిథ్యాహారవిహారములను నభ్యాసవశముగఁ దత్కాలమునం దనుకూలముగ వృద్ధిగనుండినను, దదీయ విషముఁ గాలక్రమముగ వృద్ధిచెంది మంచిదృఢకాయుఁడును వయోవంతుఁడును నగ్నిదీప్తిమంతుఁడునైనను, రోగ మంటక మానదు. పైవానివలన సూలదేహుఁడై తరుచుగ రోగపీడగాని, జవ లాఘవము లుడుగుటగాని, తుదకు నింద్రియపాటవ ముడుగుటగానిగలిగి యొక రోగముగలవాఁడగును. దేహము మాంసములోఁ బెరుగుచుండుట రోగాదులకు నాహారముగ నున్నది.

మఱియు మనము వాసముచేయు దేశము గృహముచుట్టుప్రక్కల నశుద్ధజలములతోఁగూడిన పెరడుగుంటలు సస్యములు పెంటకుప్పలు వంట పాత్రలు పశువులకొట్టములు మొదలయినవానిని మిగుల మురికిగా వాడుకొను చున్నాము. అట్టిస్థలములు మురిగి చెడ్డవాసనగలిగి యందు శీతోష్ణవాత్రములు విరుద్ధములై క్రిములంగలుగుచుండగా రోగాదులు గల్గుట కేమిసందియము? అట్టి చెడినవానిమీదనుంచి వీచెడుగాలి దేహమునగప్పిగాని యుచ్ఛ్వాసనిశ్వాస మూలమున బహువిధసాధనములగల శరీరములోఁ బ్రవేశించిగాని సమస్తరోగ సముద్రమున మునిఁగించుచుండును; ఇట్టి యసహ్యాకరమైనవానివలన మనస్సునకుఁ గలుగు సంతాపము వానిద్వారకముగా సమస్తామయములలోఁ బెనంగొనఁ జేయును. కాఁబట్టి పైవాసస్థలములు మొదలైనవి మురికిగాక శుభ్రముగ

నుంచుకొనుటయు, వానిమీఁదిగాలియు, నిర్మల ప్రదేశమును నిమ్మాటివలన మనస్సునకుఁ గలుగుసానంద మారోగ్యమునకుఁ గారణముగ నున్నది.

## ఆహారభేదక్రమము

మఱియు సకలదేశముల నాహారభేదములు బహువిధములుగనున్నవి. అవి గోధుమలు, జొన్నలు, రాగులు, సజ్జలు, వరిబియ్యము, నులవలు మొదలైనవి. వానిలో దేశదేశమున నొక్కొక ధాన్యము నుపయోగించుకొనుచున్నారు. అన్నము, రొట్టెయు, పిండి, సంకటి, అంబలి, గంజి, ఫలాహారములైన బహువిధపక్వభేదములతో పైచెప్పిన గోధుమాదుల నారగించుచున్నారు. కాబట్టి యాహారభేదములవలన దేహదార్ఢ్యమును దారతమ్యముగఁ గలదు.

## దేశరోగభేదములు

మఱియు ప్రపంచసృష్టి కాధారమైన పృథివ్యప్తేజోవాయ్వాకాశమను పంచభూతములును సర్వత్ర యొకతీరుగనే యుండక తమతమ గుణభేదములవలనఁ గలిగిన రోగములు సమత్వములేక వృద్ధిక్షయములు గలిగియున్నవి. ఒకచోట శీతజ్వరములును, మరొకచోట తిమ్మిరిగలకాళ్లసంకటములును, నారిపుండ్లును, నేనుగుకాళ్లును, కుష్ఠరోగములును, శీతజ్వరములు మొదలైనవియు నొక్కచోట నొక్కొకవిధముగ స్వల్పాధికములుగ వ్యాపించుట గలదు. కాబట్టి యక్కడక్కడి వృక్షపర్వతోదక వాయుస్థలసంసర్గభేదతారతమ్యములవలన నొక్కొకదేశమున నొక్కొకవిధమైన రోగాదులవ్యాపకము గలిగియున్నది.

## ౧౦ సాంక్రామికరోగముల క్రమము

మఱియు నఖిలరోగోత్పత్తికి మరొకవిధముగలదు. అదేమన రజకుని మూలముగ సమస్తసాంక్రామికమైనరోగములు వ్యాపకముగ నున్నది. ప్రతివారిగృహముల మురికిబట్టల నొకటిగాఁ గలిపికొనిపోయి యావానిమురికి పోయునా

పోక నదికి బిడప గజ్జి, విషూచివంటి విషరోగముగల యింటివస్త్రముల నొకటిగాఁజేర్చి లేనిగృహములకు నానారోగములం బంచిపెట్టుదురు.

అదిగాక విషరోగముగలదేశస్థులు లేనిస్థలములకు వచ్చునపుడును, లేని స్థలమువా రున్నస్థలమునకుఁ బోవుటవలనను, విషవ్యాధిస్థలమునుంచి వస్తువులు దెచ్చుట మొదలైనవానివలన, నత్యాహారవిహారములులేకయే సంభవించును. ఇట్టి విషవ్యాధులు స్వల్పాధికవ్యాపకకాలములో బహువిధములుగా సాంక్రామికములై పరిణమిల్లును.

మఱియుఁ గొందరు భోజనముతోఁగూడ మద్యపానము స్వల్పము గసేవించి జీర్ణశక్తి ధైర్య సాహసాదుల వృద్ధి జేసికొనుచున్నారు. అవి చాల విధములు గలవు. మరికొంద రాదికాలమందు బలవృద్ధిగలుగుట గాంచి, వెండియుఁ గలుగునని యతిశయముగ పానంబుజేసి పలువిధములనష్టమునంది తద్ద్వారముగ ననేకరోగములతో శ్రమజెంది కాలగతి నొందుదురు. నానాదేశములవాడుకగల యశనభేదములను గాలానుగుణముగ రోజుకు రెండుమాఱులు, ప్రాతస్సాయంకాలములయందు కాలముమీరక మితముగ నెవ్వరైనను భుజింపవలయును. కష్టపడువారును, బాలురును, జీర్ణశక్తిమంతులును, మూడువేళల భుజింపవలెను. రోగులు సకలరోగములకుఁ జెప్పియుండువిధమున జీర్ణశక్తికొలది రోగమునకుగల గాఢ సులభత్వము లెఱింగి, యొక్కమారుగాని రెండుమారులు గాని భుజించవలెను.

## ధర్మాధర్మములవలన రోగనివృత్తి రోగప్రవృత్తి

మఱియుఁ బంచభూతైకాదశేంద్రియ పంచవాయు రజస్సత్త్వతమో గుణత్రయములతో సర్వసుఖసాధనసంపన్నంబుగ మనదేహమును గల్పించి, విధినిషేధముల నెఱింగి నడుచుటకై స్వాతంత్ర్యము నొసంగి, యారోగ్యముగ నుండునట్లు సర్వాధారుఁడైన దేవదేవోత్తముఁడు మనలసంరక్షించుచున్నాఁడని యెఱుంగుదుము. కాబట్టి మనయకృత్యములచేత యంత్రములకు మాంద్యవేగములు గలిగినట్లు మనయపథ్యముచేత మనయంగములకు రోగపీడ గలుగును.

మఱియుఁ బ్రపంచమున దేవాంశసంభూతులును, జక్రవర్తులును, క్షత్రియ సూర్యచంద్రవంశస్థులును దురుష్కులు మున్నగువారును సత్యప్రవర్తకులై ప్రభుత్వములుచేసి బలాయురారోగ్యములుగల్గి కాలక్రమమున జరాప్రాప్త్యనంతరము గతించినట్లు ప్రాచీనగ్రంథములందు కనుపడుచున్నది. దానిఁబట్టిచూడగాఁ బ్రతివిషయములో ధర్మప్రవృత్తియు నధర్మనివృత్తియు సారవంతమైనదిగాఁ గనుపట్టుచున్నది, ఇప్పుడు పైవన్నియు విపరీతములై యనగా ధర్మనివృత్తియు నధర్మప్రవృత్తియుఁగల్గి సర్వకాలసర్వావస్థలయందు దుస్స్వభావము గలిగి తమజీవితకాలమంతయు రోగపీడితులై యకాలమునం దనగా వృద్ధాప్యమందుగాక బాల్య యౌవన కౌమారావస్థలందే నానాబాధలు గలిగి మడియుచున్నారు. పూర్వకాలమునందును నకాలమరణము లుండినను నకృత్తుగా నుండెను. ఇప్పుడు సర్వసాధారణముగ నేర్పడియున్నవి. అత్యాహార విహారములవలననే రోగోత్పత్తిగాదు. అధర్మప్రవృత్తియు, ధర్మనివృత్తియు, జాడ్యోత్పత్తికి బహువిధకష్ట నష్టములకును గారణమని యెన్నవలెను.

మఱియు నకృత్యములవలన శ్రీజగన్నాథుఁడు శిక్షించుటకు రోగసముద్రములో ముంచి సుఖదుఃఖము లనుభవింపజేయుచున్నాఁడు. అట్టిసర్వశక్తిసంపన్నుండును, త్రికాలవేదియును, సృష్టిస్థితిలయకర్తయును, సర్వాంతర్యామియును, సర్వజ్ఞుఁడును, రాగరోగాదినివర్తకుఁడును నగునట్టిసర్వేశ్వరుఁడు తన్ను శరణని వేఁడినవారిని రక్షించువాఁడై యున్నాడు. అట్టివానిని వర్ణించుటకు గోచరముగాదు, అట్టి సర్వేశ్వరుఁడు ప్రాణులకు రక్షాశిక్షానిమిత్తము సుఖదుఃఖముల సృజించె. అయ్యయో! రోగాతురుఁడు పడునట్టివేదనకంటె వేరొకశిక్ష యేదైనఁగలదా? త్రిలోకనాథుఁడు గొట్టుట, తిట్టుట, యవమానించుట, మరి యేశిక్షగాని గల్గియున్నప్పటికిని జనులకు రోగబాధవంటిశిక్ష యేదియుం గాదు పాండువు, శోభవ్యాధి, కుష్ఠువు, మేహవ్యాధులు, కాస, శ్వాస, క్షయ, మొదలైన యనేకరోగములతో జీవితకాలమువరకు రోగాతురుఁడై గడుంగష్టములు పడుటగాని, అకాలమృతిజెందుటగాని, లేమింజేసి చిరాయువులై యాయుర్దా

రోగ్యబలవృద్ధివంతులై సకలసుఖములు గనుటకంటె వేఱురక్ష యేదియుగాను. జనులకు జరానుభవమైనపిదప మరణము జెందు స్వభావముండగా, వారు వారు చేయు సధర్మకృత్యముల బలిమిచే రోగపీడయు నకాలమరణము గల్గుటకంటె వేరొకశిక్షయున్నట్టులెంచవచ్చునా ప్రకృతమందు శిక్షానిమిత్తము రాగరోగాదుల సర్వకారణకారణుండైన యీశ్వరుఁడు సృజించినది చూచుచుండగా, బరోక్షమున నేమేమో శిక్షారక్ష లున్నట్టు లెంచవలసిన పనియేమి? ఈశ్వరుఁడు జీవులకు మనోబుద్ధులను గల్పించి, వానియాధారంబున వారువారుచేయుకార్యాకార్యములబట్టి కష్టసుఖముల నిచ్చుచున్నాఁడు. అంతేగాక ధర్మాధర్మప్రవృత్తినివృత్తుల ననుసరించి వారివారికి సుకృతదుష్కృతములు, నితరనీచోత్కృష్టజన్మములును, వానిలో రోగమరణములుం గలుగఁజేయుచున్నాడు. శ్రీమంతులును రిక్తులును జేయుంధర్మాధర్మములంబట్టి తారతమ్యముగా జన్మములును సుఖదుఃఖములును వానితో రాగరోగములు గలుగంజేయుచున్నాడు.

మిథ్యాహారవిహారములు రోగోత్పత్తికిఁ గారణమైనప్పటికిని రోగము సంభవిల్లి మఱల నెంతకాలమేనియుం గుదరక సర్వదా వేధించుటయు, దానితోనే మరణమును జెందుటయు, పుణ్యపాపముల సంబంధమువల్లనే యని యెంచవలెను.

పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే.

అనువాక్యమున ముందుజేసిన పాపము రోగరూపముగాఁ బీడించునని చెప్పబడియున్నది. పూర్వకాలంబున: జేసినకృత్యాకృత్యములవలన పుణ్యపాపములై, పాపమువలనరోగపీడ, పుణ్యమువలన నారోగ్యమును గల్గుననియుఁ జెప్పబడియున్నదిగాని, తనంతటగాని మఱియేరూపమునగాని నిష్కారణముగ సర్వసాక్షియైన సర్వేశ్వరుఁడు శిక్షింప లేదు. ప్రకృతమందుజేయు కార్యాకార్యాధారంబులతో బహువిధకష్టనష్టములకును రోగసంభవములకును నకాలమరణములకును, నీచోచ్చజన్మములకును, బూర్వజన్మమునజేయునట్టిది యిందు జ్ఞాపక మగుచున్నది.

మఱియు వారువారు చేయునాహారవిహారభేదములందుఁ గ్రమముదప్పక, యెవరెవరిజీవనోపాయమైన కృత్యములందు న్యాయమార్గముదప్పక, దయయుం సత్యముం గల్గి ప్రవర్తించుట ధర్మార్థకామమోక్షములను పురుషార్థములకు మార్గంబుగ నున్నయది.

### ఐహికాముష్మికదోషకారణములు

మఱియు నసత్యాహారవిహారము లనునవి యైహికదోషములుగను, మన యకృత్యములవలన ధర్మాధర్మములు పుణ్యాపాపములమూలంబుగఁ గలుగునవి యాముష్మికదోషరోగములుగా నున్నవి.

ఈయైహికాముష్మికదోషముల రెంటిలో ప్రథమమున నైహికదోషములంగలిగి పిమ్మట నాముష్మికదోషములమిశ్రమమై రోగములు బహుప్రకారములుగ వేధించుటకును మరణమునకును గారణముగ నున్నవి.

### రోగశాంతిక్రమము

తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమసురార్చనైః,

అనువాక్యప్రకారము ఔషధము దానము జపము హోమము దేవతారాధనము నివి సమస్తామయములు బోనడచుచుగావున, నైవిధమున శాంతివలన నాయురారోగ్యాభివృద్ధి శ్రీసర్వేశ్వరుఁడు గలుగజేయును.

ఇందు నొకలోకప్రసిద్ధంబగు నితిహాసంబు గలదు. శ్రీభోజరాజునకు ఒకానొకసమయమున శిరోవేదనగలిగి బాధ నొందుచుండెను. అప్పుడు తమ సంస్థానమునందుగల యాయుర్వేదంబున దక్షులయిన భిషగుత్తములు బహువిధములుగ జికిత్సచేసిరి. అప్పు డష్టాంగదక్షులైనవైద్యు లనేక చికిత్స లొసంగినను సాధ్యముగాక, మిగుల వేదనాయుక్తముగఁ జిరకాలము పీడించుచుండె. ఎందరు వైద్యులువచ్చి యేమేమి యెన్నిక్రియలు చేస్సినను నెట్టును లోబడక పోనుపోను శక్తిహీనమై మంచములోఁ జేరియుండెను; అప్పుడా మహారాజు

విసికి వేసటపడి యేమివైద్యులు, యేమిశాస్త్రములు ఇవి యన్నియు నబద్ధము లని కోపముచేసి నిరాకరించెను. ఇటుల మహాప్రభువు బహుప్రకారముల తాప యుక్తుఁడై యైహికాముష్మికకార్యములనువదలి, సర్వదా వేదనాయుక్తముగఁ గృశదేహుఁడై యుండె. అటుతర్వాత జగత్సృష్టికి మూలంబైన శ్రీ బ్రహ్మ దేవుఁడు భోజరాజున కిట్టియాపద సంభవిల్లెనని యెఱింగి శ్రీ అశ్వినీ దేవతల రావించి మీరు వెళ్లి భూలోకంబున భోజరాజునకు శిరోవేదన గలిగి కడుతాప యుక్తుఁడై శాస్త్రముల నిరాకరించుచున్నవాఁడట! అతిత్వరితముగ వెళ్లి వారికి శిరోవేదనమాన్పి హితోపదేశముల నూరడించి రండని యాజ్ఞాపించె. వారు తదాజ్ఞం గైకొని భోజరాజువద్దకు వృద్ధబ్రాహ్మణవేషధారులై రాగా, అక్కడి కావలివారు మీరెవరని విచారించగా మేము భిషగ్వరులము. రాజుగారికి చికిత్సజేయవచ్చితి మని చెప్పగా పెక్కురు నివారణచేయలేకపోయిరి. మీ రెవరో పొండుపొండని తిరస్కరించిరి. వారిలోనొక్కఁ డెవరియదృష్ట మెట్టిదో యని పోయి విన్నవించెను. శ్రీ భోజరాజుగారు కడుతామసులై యొప్పుక, పిమ్మట రావించియు నూరడించి తమకు సహింపలేని శిరోవేదన విషయమై పలికె. మంచిది మేము నివారింతుమని ధైర్యములొసంగి మైకము గలిగించునట్టి ఔషధము నిచ్చి శిరస్సునందున్న మత్స్యమునుతీసి దానినొక పాత్రయందునిచి జ్ఞానమువచ్చునటులజేసిరి. అప్పుడు ఆమహారాజు లేచి నాకు నొప్పిలేదు ఆహా యేమిఆశ్చర్యము ! యేమిచేసితిరని అడిగిరి. ఓమహా రాజా ! శిరస్సునందు నొకమత్స్యము జనించి అది పెరుగుకొలంది కడుశిరో వేదన క్రమముగా వృద్ధియగుచుండెను. ఇదిగో చూడుడని కానుపించిరి. ఆహా! యేమివిచిత్రము. శిరంబున మత్స్యంబువసించుట కేమి! దాని మీ రెరింగి నా కెంతకష్టము లేక దీసి బాధదొలిగింపజేసిన మీరు కడుపుణ్యపురుషులని మిగుల గారవించె. అప్పుడు ఓ మహారాజా ! శాస్త్రము లెప్పటికైన నబద్ధములగునా ? యాయుర్వేదంబు మిగుల శ్రేష్ఠంబు ; సమస్తమైనవానికి మూలంబైనదని యిటుల హితోపయుక్తముగ బహుప్రకారములుగ విన్నవించి ఔషధము

నిచ్చిరి. అంతట భిషగుత్తములారా! పథ్యమేమియని విచారించగా, "ధాన్యం క్లిన్నం నవం తుభ్యం క్షీరశుష్కం దధిప్లుతం, అశీత సలిలస్నానం కించిదుష్ణాన్న భోజనం. మానవానా మిదం పథ్యం" అని, యిటుల వచింపగా భోజరాజు సంశయించి మీరెవరని యడుగగా నదృశ్యులైరి. పిమ్మట భోజరాజు సమస్తము నెఱింగి శ్లోకము పూర్తినిమిత్తము కవీశ్వరులరావించి విచారించగా, నెవరేమియుఁ జెప్పక నూరకుండగా పూర్వపుకథ విన్నవించి. కాళిదాసు నడుగగా "పయఃపానం పయఃస్త్రియః" యని పూర్తిచేసెను. ఇచ్చట రోగజనక కారణమేది? రోగ మేది? వాతాదిదోషము లెక్కడ యేమని చెప్పవలయునో గమనింపుడు. మఱియొక డుదకపానము జేయుచుండగా గోడబరుకుచుండిన బల్లి యొక్కఛాయ యుదకమునందు బారి అది గర్భములోకిపోయినట్టు చిత్త వైకల్యము బొందెను. తత్కారణముచే రోగముగ నేర్పడి నానాబాధలుచెంది కృశదేహియై మరణకాలము సమీపించియుండె. ఎందరు వైద్యవరులు గూడి యనేకౌషధములును తంత్రములును జేసినను సాధ్యపడదయ్యె. ఒక యుక్తిగల భిషజుండు ఇదియెంత కార్యమనిచెప్పి యాబల్లి పేగును బట్టినదని యూరడించి బల్లిని తెచ్చి కాళ్లువిరిచి గొట్టములో నుంచుకొని, రోగితో నేడు పడిపోవునట్లు చేసెదనని విరోచనమునకిచ్చె. ౧-౨ మార్లు అయినవరకు నూరకుండి సమయము జూచి రోగికి తెలియనియ్యక గొట్టములోనిబల్లిని మలములోవిడిచెను. దానిని రోగికిఁ జెల్పగా లేవలేనిస్థితిలోనుండువాఁడు లేచిచూచి కడుహర్షమొంది సౌఖ్యము వడసె.

మఱియు మామిడిటెంక పాదమాయొక్క వేలికి తగులుకొన్నమాత్రంబున సర్పంబు కరిచెనని ప్రాణంబువిడిచె. ఇచ్చట నాహారవిహారకారణము లేవి! రోగమేది? వాతాదిదోషము లెచ్చట? పరులు నీరోగమ్మున మరణమునొందిరి. నాకు నదే సంభవించె నని విచారము పెట్టుకొన్నయెడల మరణముకల్గును.

బహుశ్రమపరచునట్టి తెగులునుగురించి నేజీవింపనని పలుకుటయును, నిటుల నధైర్యమును జెందక "తచ్ఛాంతిరోషధైర్దానైః" అనువాక్యప్రకారము

కావలసినకార్యము లొనర్చుచు సాధించుటయే పురుషధర్మము అటుగాదేని మనుష్యయత్నమునకు మీరినదైనను పరలోకసుఖంబు పడయుటకు శ్రీపరమేశ్వరధ్యానము గావించుటయె శ్రేయస్కరంబు.

వైద్యకల్పతరువునందు జ్వరకారణస్వరూపనిరూపణప్రకరణము సంపూర్ణము

---

## ద్వితీయప్రకరణము

### జ్వరస్వరూప నిరూపణ ప్రకరణ ప్రారంభము

ప్రాణాః ప్రాణభృతామన్నం తదయుక్తం నిహంత్యసూన్,
విషం ప్రాణాన్ హరేత్తచ్చ యుక్తియుక్తం రసాయనమ్.

తా. సర్వప్రాణులయొక్క ప్రాణ మన్నాశ్రయంబైయుండుటచే నన్నమే శరీరముల రక్షించుచున్నది. అయినను దానిని ప్రమాణాతీతముగ భుజించిన ప్రాణముల నశింపజేయును. విషము ప్రాణములను నశింపజేయునదైనను దానిని యథాశాస్త్రముగ సేవించిన నది రసాయనతుల్యంబై శరీరధారణఁజేయుచుండు ననుట.

శ్రీజగదీశ్వరుఁడు మితాహారవిహారములవలన నాయురారోగ్యబలములను జెందునట్లును, మిథ్యాహారవిహారమువలన సకలరోగసముద్రములోబడి కడుబాధలఁ జెందునట్లును, బ్రాణికోట్లను సృజించె.మిథ్యాహారమనగా నజీర్ణమగునట్లు మీదమీద భుజించుటయు, నతిజడము నత్యుష్ణము నతిశీతలమునగు పదార్థభేదముల యధికసేవయు, దేశకాలకర్మప్రకృతిభేదవికారముల నొందుటయు, దేశకాలవిరుద్ధములగుసస్యఫలాన్నపానీయాదులను జెడిన నానావిధవస్తువులను షడ్రసాదులను సకలపదార్థములయం దతిశయముగఁ గలిపి భుజించుటయు, నాహారభేదములలో నపక్వమైనవి భుజించుటయు, రుచియని చాలభుజించు

టయు, ఋతుదోషము అనగా, న్యూనాధికఋతుధర్మములను గా లాతిక్రమణ భోజనము స్నేహవత్త్వాది భేదపదార్థముల భుజించుటయును శరీరమునకు గాని వస్తువుల భుజించుటయు, నతిమద్యపానము అనగా, క్రిమికీటాదిసంస్పృష్ట పదార్థ స్వీకారదోషమును నతిశీతలోష్ణోదకపానమును శరీరమును సర్వదా తడిచేసి కొనుటయు, ఋతువు దేశము బాల్యాదిధర్మములు మార్పుగుటయు, ఆహార పానీయములలో దేనినైనను దనశక్తికొలదికాక మిక్కుటముగగాని పలుమాఱు గాని సేవించుటయు, నీ మొదలయినవి. ఈలాటి మిథ్యాహారసేవనములు రోగ కరములగునవిగా నెఱుంగవలయును.

### మిథ్యాహారకృత్యములు

హితాహారవిహారాణాం సదాచారనిషేవిణాం,
లోకద్వయముపేక్షాణాం జీవితం త్వమృతాయతే.
విదుషా తచ్ఛరీరస్థా న్నిత్యం సన్నిహితానరీన్,
జిత్వా వర్జ్యాని వర్జ్యాని చిరంజీవితుమిచ్ఛతా.

హితమైనయాహారములు విహారములు శాస్త్రీయమైన ఆచారములు ఇహాపరలోకాపేక్ష యివిగలవారియొక్క జీవితకాలము అమృతతుల్యముగ నుండును. అనగా దీర్ఘాయుష్మంతుఁడుగ నుండును. చిరకాలము జీవించుటకు నిచ్ఛగల బుద్ధిమంతుఁడు తనశరీరమందు నిత్యముగ వసించెడి ప్రబలశత్రువులగు కామక్రోధాద్యరిషడ్వర్గములను జయించి వర్జింపదగిన పాపకృత్యములు వర్జించవలెను.

అత్యాహారములవలన వాతాదులమూలంబుగ రోగసంభవమేగాక, మిథ్యావిహారములవలనగూడ రోగసంభవముగలదు. మిథ్యావిహారమనగా తన శక్తికిమించిన కార్యములుసేయుట. అవి సాము, పరుగులిడుటయు, దాటుట, దుముకుట, వ్యాయామము, వేటాడుటయు, నాటలాడుటయు, సేవ్యమును, దమతమజీవనోపాయమైన కృత్యములును, నతిమైథునము, బగటినిద్రయు,

రాత్రి జాగరణమును, శరీరాయాసమును గలుగం జేయునట్టి యభిఘాతపుపనులు, దనబలముకంటె నతిశయముగ బనులుసేయుటయు, మోయుటయు మొద లైనవి వానివలన నలియుటయు, సొక్కి బలహీనమగుటయు, నొప్పులువట్టు టయు, గర్భాశయములు పొరలుటయు, నరములు స్థానములు సడలుటయు, సంధులువదలుటయు, గాయములగుటయు నివిమొదలగునవి గలుగును. కావున మిథ్యావిహారములు నవయవములను వైకల్యమును జెందించి రోగప్రవేశమున కాధారంబగును.

మఱియు నభ్యాసముకొలకని యావిహారము క్రమక్రమముగ నధి కముచేయుటమాని ప్రథమములోనే విశేషముగజేయబూనుటయు, ఆహారవిహార ములు విషమముగ గ్రహించుటయు, దినక్రమముగగాని తత్క్షణమేగాని రోగము గలిగించును.

## మనోరోగము

ఆహారవిహారముల వ్యత్యయములవలన రోగోత్పత్తియన్నట్టులే, మనో విచారములవలనను సకలరోగోత్పత్తియుంగలుగును. ఆహారవిహారమ్ము లాయుఃకారోగ్యాభివృద్ధిం గలిగించునట్టులే, మనోల్లాసములును గలిగించును సమస్త మైన మంచిచెడుగులకు మనోబుద్ధిచిత్త అహంకారవ్యాపారములే హేతువు లుగా నున్నవి. సర్వదా చదువుచుండుట, భయము, ఉల్లాసము, కార్యలోప ములు, రాగాదులు నిట్టిమనోవిచారములవలన శిరస్సు హృదయాద్యంగములు దోషమునంటి బహుప్రకారములయిన రోగములు గలుగును. ఇట్టి మానసిక కారణములచేత నైజాగంతుకరోగములు గలుగుచున్నయవి.

మఱియు విద్యాభ్యాసము పిల్లలకు క్రమముగ నభ్యసింపవలెను. వార లకు నుల్లాసము వృద్ధియగునట్లు మాటలను పనులను జెప్పుచు విద్యాభివృద్ధిజేయ వలెను. వారలను విశేషముగ శిక్షించుట, లిట్టుటచేత మనోలోపమై యారో గ్యమునకు గీడు సంభవించును. పెద్దవారికైనను మనఃపరిశ్రమము నాలోచ

నయు భయము అవమానత సంతోషము కామక్రోధాదులు హెచ్చైనయెడల దౌర్బల్యమును రోగము నింద్రియాదిపాటవలోపమును బొసంగును.

మనోబల మెంతవిశేషముగ నుండువారికైనను వారివారిశక్తికిమించిన దానిపక్షమున వివిధలోపములు గలుగును.

ఇట్టి మనోవిచారములబలిమివలన నిద్రాహారములు లేమియుంగలిగి సర్వదా ఆలోచనచేత నాయురారోగ్యములకును నష్టముగలుగును.

మఱియు నైజరోగములకు నాహారదోషములును, ఆగంతుకరోగములకు విహారదోషములును, మనోరోగములకు రాగాదిదోషములును కారణములైయుండును. దేశకాలభేదములచే వారువారుచేయునట్టి యకృత్యభేదములు లెక్కలేనివై యున్నవి. అవి వారివారికే యనుభవసిద్ధము. ఈమూటియం దన్యోన్యసంసర్గములచే గారణములు పలువిధములైనను నైజరోగముగానే పరిణమిల్లును. అదియునుంగాక వైత్రివిధములలో నొక్కొక్కదానియందు రోగోత్పత్తికారణములు రోగములు లక్షణములు పెక్కుతెఱగులైనను శీతోష్ణవాతములకంటె వేఱులేవు. ఇవియే సమస్తరోగములలో గూడియుండు వాతాదిదోషములు. అవి ఏక, ద్వి, త్రి దోషరూపములుగా నఖిలరోగములయందు సామాన్యతీక్ష్ణవిషమములుగా వెలయుచుండును. రోగోత్పత్తికి వారువారుచేయునట్టి యకృత్యములుంబోలె రోగములును వానిలక్షణములును భిన్నములై వెలయుచుండు. 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అన్నట్లు సమస్తరోగోత్పత్తికి మనస్సు ప్రధానంబైయుండును. సమస్తమునైన వారికి ప్రేరకము మనస్సు గావున, దుర్వ్యాపారములవలన రోగోత్పత్తియును, సద్వ్యాపారములవలన నాయురారోగ్యసుఖాభివృద్ధియు గలుగును.

మఱియు మనోబుద్ధులు మంచివగుటకు విద్య మూలంబయియుండును. అదియే సుఖమును, నాయువును, పదవియును గలిగించును. విద్య యెట్టి యజ్ఞానికిని జ్ఞానముగలిగించును. సమస్తమైన ఇహపరవిషయములన్నియం

జెలియం జేయుంవదిగావున సర్వకార్యములకు శ్రేష్ఠము. అదియే యైహికాముష్మిక సుఖముల నిచ్చును.

మఱియు సత్యాహారవిహారములవలన రోగస్పష్టత దెలియునట్లు మనో విచారమువలన బైటికి దెలియరాకుండినను ఆయురారోగ్యతకును దీర్ఘాయువు నకును గీడుసంభవించుట స్పష్టము.

## వాయువిచారము

ప్రపంచమున శీతోష్ణవర్షాకాలంబులవాయువున్ను, గట్లు, చేరులు, అడవులు, నుద్యానవనములు, మరుభూమియు, మన్నెపుభూములు, నోషధులు, రస గంధక పాషాణవిషాదులు, చెడిననానావిధములైనపదార్థములు, మంచు, ఎండయు, చలియు, వెన్నెల నీ మొదలైనవానిమీది శీతోష్ణములతో ఋతు వుల కనుగుణముగ సాధారణతీక్ష్ణ విషమాంసప్రసారములతోడిగాలియు సకల రోగోత్పత్తి కాధారంబయ్యెను.

మఱియు నట్టివాయువు కన్నుల కగుపడకుండినను, త్వగింద్రియ జ్ఞానమువలన దెలిసికొనుచున్నాము. అటులనే రోగము శీఘ్రానరావున్నను మనయం దావేశించునపుడు ఇట్టిదని దెలిసికొనుచున్నాము. అది నలుదిక్కుల ఋతువుల కనుగుణముగ మారుచుం బగటివేళనుష్ణముగాను, రాత్రివేళ శీల్లగాను నుండును.

మఱియు నక్కడక్కడిస్థలవిశేషములను గురించి వాతమునందు న్యూనా ధికములుగ శీతోష్ణములు వెలయుచుండును.

అటులనే కాలము ఋతువు కనుగుణముగ శీతోష్ణములు మిశ్రమమై యుండును గావున, దేశకాలభేదముల వాతము స్థలమహిమ కనుగుణముగ గలిగి యుండును. కాలవైపరీత్యముచేత వాతమునందు శీతోష్ణములు విషసదృశ ములై జనులకు రోగముల సంఘటించును.

మఱియు ప్రపంచమంతయు వాతము ఒకేతీరుగ ప్రసరించుచుండినను, దేశకాలభేదముల నక్కడక్కడి స్థలవిశేషముల కనుగుణముగ వేఱుగనుండును. కావున మన్నెము నక్కడక్కడివస్తుసంయోగానుగుణముగ రుగ్మతలస్వల్పాధిక్యములును గలిగియుండును.

అదియునుంగాక దేశత్రరముగా రోగములు గూడియుండును. ఏనుఁగు కాళ్లు, బుడ్డలు, సారిపుండ్లు, శీతజ్వరములు మొదలగునవి అక్కడక్కడిస్థల విశేషానుగుణముగ స్వాభావికములుగా గలవు. రుజములు కాలనియమము లేక యెల్లపుడును న్యూనాధికములుగా వ్యాపించుచుండును. అవి శీతోష్ణకాలానుగుణముగ స్వల్పాధికములుగా వెలయుచుండును. వాయువు సమస్తజంతుకోటికి జీవనాధారముగను జననమునకును సుఖమునకుచు ఆయురారోగ్యవృద్ధిగాను వెలయుచుండును.

మఱియు నుచ్ఛ్వాసనిశ్వాసమూలముగ మనయందుండు చెడుగాలిని బయిటికి వెడలించుటచే నిర్మలమైనగాలిని లోగొనుటచే నారోగ్యమును గలదు. ఇవియే ప్రాణమునకు జీవములు. మనము నిద్రించునపుడు సర్వేంద్రియవ్యాపారములు లేకున్నను, ఉచ్ఛ్వాసనిశ్వాసములు మాత్రము జరుగుచుండును, ప్రాణముపోవుటకు మన యుచ్ఛ్వాసనిశ్వాసములు నిలుచుటయే మరణముగా నెంచవలెను. ఉచ్ఛ్వాసనిశ్వాసమువలననే భుజించెడు నాహారపానంబులు జీర్ణించుటయు, ।నవయవములకు నెత్తురుపంపకము మనోబుద్ధివ్యాపారములు సాగుచుండునుగావున స్వచ్ఛమైన వాతమునం బ్రవర్తించుచుండవలెను.

## ఉదకవిచారము

ప్రపంచమున సకలదేశములందును ననఁగా బర్వతములు, నదులు, కొలకులు, తటాకములు, నేఱులు, కాలువలు, నూతులు, సముద్రము, విపినము మొదలైనవానియందలి యుదకమునందు రుచి భిన్నభిన్నముగా గలదు. వర్షోదకము సర్వత్ర యొకేవిధమయినదిగా నుండినను భూగుణవిశేషమువలన రుచి రూపభేదములుగలిగినటుల గుణమ్మును బహువిధములుగా నుండును.

మఱియుం భూమి సకలవస్తుమయమైనదియును, సర్వాధారమయమయిన దియును గావున నక్కడక్కడస్థలవిశేషములను అనగా పర్వతములు, నదులు, వనములు, వనౌషధములు, సముద్రప్రాంతములును, రస గంధక విష పాషాణములు, సున్నము, లోహశౌషధులు వీనితోఁ గూడిన చోటులను గలిసియుండుటబట్టి అచ్చటిగుణభేదమ్ము లనేకములు గావున నచ్చటచ్చటిజలవిశేషములచే రోగభేదమ్ము లనేకములుగా నుండును.

పానీయం ప్రాణినాం ప్రాణా విశ్వమేవచ తన్మయమ్.

ఉదకము ప్రపంచమునందు సమస్తమైనజీవములకు ప్రాణాధారముగ నున్నది. వానిలో ప్రాణాధారమయమైన వాతము గలిగియుండును. అన్నపానాదులలో నుదకమే శ్రేష్ఠముగ నుండును. శీతోష్ణకాలంబు లనుగుణముగ మారుచుండును. అప్పటప్పటి కాలవిద్యమానమునుబట్టి రోగము, ఆరోగ్యముగ నుండును. ఉప్పుగ మంచిగ చెడుగ నీరు అచ్చటచ్చటి భూసారమునుబట్టి గుణము గలిగియుండును. అట్టిశీతోష్ణములనువవియే వాతమందును, ఉదకమునందును, దేశకాలభేదముల సామాన్యతీక్ష్ణవిషమములుగా రోగభేదములుగలిగించును. దేశకాలభేదముల నక్కడక్కడి ఉదకవిశేషముల కనుగుణముగ స్వాభావికమైన రుజములుగలిగి యుండును. ప్రాణాధారముగా సర్వదా నిర్మలమైన ఉదకముపానము జేయవలెను.

న పిబేత్పంకశైవాల తృణపర్ణావిలాస్తృతం,
సూర్యేందుపవనాదృష్ట మభివృష్టం ఘనంగురు.
ఫేనిలం జంతుమత్తప్తం దంతగ్రాహ్యాతిశైత్యతః,

తా. బురద, ప్రాచి, గడ్డి, ఆకులు మొదలగువానిచే గప్పబడినదియు, కలకబారినదియు, సూర్యచంద్రకిరణ వాతసంబంధములేనిదియును, తత్క్షణమున (అప్పుడు) వర్షించినదియును, నైర్మల్యము జెందకుండునదియును, గురుత్వము గలదియును, నురుగుతోఁగూడినదియును, పురుగులు మొదలగువానిచే వ్యాప్తి

లైనదియును, ఉష్ణమయినదియును, అతిశైత్యమువలన దంతములు గిట్టికొనునట్టుల జేయునదియును నైనజలమును పానము చేయంజనదు. మఱియు వర్షించి మూడుదినములయినపిదప నిర్మలోదకము అమృతతుల్యముగాను, అప్పుడే వర్షించి భూసంబంధమును జెందిన యుదకము అపవిత్రముగాను గ్రహింపవలయును. సర్వకాలసర్వావస్థలయందు కూపోదకమే మిగుల శ్రేష్ఠంబుగ నుండును.

## జ్వరసంప్రాప్తి

మిథ్యాహారవిహారాభ్యాం దోషాహ్యమాశయాశ్రయాః,
బహిర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్యూరసానుగాః,

తా. దేశకాలప్రకృతులకు విరుద్ధములయిన యాహారవిహారములవలన వాతపిత్తశ్లేష్మములు జాఠరాగ్నికిమాంద్యమును గలుగజేసి రసధాతువు ననుసరించి జ్వరమును జనింపంజేయును.

మఱియుం కర్మానుసరణమున బుద్ధిప్రేరణతో నకృత్యములను జేయుట, ఆహారవిహారవిశేషములవలన శరీరసుఖముచెడి బహుశ్రమపడజేయును. అట్టి బుద్ధిప్రేరణకారణములగు కొన్నివిషములు గర్భాశయమం దాశ్రయించి వాతపైత్యశ్లేష్మదోషములను న్యూనాధికములుగ జేయును. అట్లు న్యూనాధికములగు వాతాదులు జీర్ణాశయమునకు మందాగ్ని గలుగంజేయును. అట్టి జీర్ణాశయమందుండు నుష్ణము సిరాదిమూలమున రక్తము నాశ్రయించి బహిర్గత మగును. అట్టి యుష్ణమే జ్వరమని పెద్దలు చెప్పుచున్నారు.

క. ఉదరంబున నగుపహ్నియు, పొదలుచు నావాతపైత్యపుంజము వెడలక
గదిమినవెలువడి చర్మము, పొదిగొన్ననుజూచి జ్వరము పొడిమెనటందుర్.

గీ. చర్మగతమైన దానిపైజ్వరమటండ్రు, దానివిడిచిన నంతర్గతం బటండ్రు
పోయిపోంకను నాయగ్నిపోయియున్న,జ్వరమునిశ్శేషమనియండ్రుశాస్త్రవిదులు.

జ్వరమనగా శరీరమును దహింపజేయు రోగము. ఆజ్వరము సకలవ్యాధుల కధిపతియై ప్రథమకారణమై యనేక లక్షణప్రవాహస్వరూపమై బహువిధ కారణసహాయములతో బ్రకోపించునదియై శత్రుప్రాయమై యాయురారోగ్యములు హరించి యెల్లతెవుళ్లకంటె వివిధవేదనలచే విశేషముగా బ్రాణులను దఱచుగా బాధించుచున్నది.

మఱియు నిది వాతపిత్తశ్లేష్మదోషవికారజనితసకలజాడ్యములయందు మిశ్రమమై, వానివృద్ధిక్షయములుచేయు స్వభావముగలదియును బ్రత్యేకముగఁ బ్రజ్వలించునదియునుగా నున్నది. ఇది రోగరాట్టనుట కే ప్రాణిగాని యిదిరాక మరణంబు నొందక పోవుటయె దృష్టాంతము.

ఇందుకునుదాహరణము

వ్యాయామాదులవలన నలసటబడుసమయమందు రక్తసంచారము వేగముగాను, నాడియు గుండెయొక్క రక్తపంపకము వేగముగాను గల్గియుండునట్లు, జ్వరమందును రక్తసంచారవేగాదులైన గుర్తులు గలిగియుండును.

మఱియు విహారాదికృతములబట్టి గుండెబట్టుట మొదలగునంగవైకల్యము బహువిధముగా గలిగినట్లు, జ్వరమునందును బహువిధకారణములనుబట్టి గుండెపట్టుట మొదలగునవి గలుగుచున్నవి.

ఇట్టి బహువిధములైన మిథ్యాహారవిహారములవలన శరీరారోగ్యమునకు విరుద్ధమైన కడుబాధలఁ జెందజేయునట్టిది జ్వరముకంటె వేరొకటి లేదు. జీవితకాలమువరకు నాబాల్యవార్ధక్యమునను బహుపర్యాయములు సంభవించును. ఇదిగాక రోగములు అటుల గలుగకుండును.

ప్రపంచమంతయు నిండిన యీజ్వరమును సర్వత్ర జీవితకాలమువరకు బొందనివానిజూడ గానరాదు. బహుపర్యాయములు సంభవించును. అటుల నొక రోగము అందరికి గలుగుటలేదు. రోగము సర్వత్ర పరిపరివిధములుగ నుండును. కావున నిట్టి రోగశ్రేష్ఠము దేశకాల కారణ తత్త్వాదిభేదములు కలిగియుండి

సను, జ్వరములో ననేకలక్షణములుగా గూడియుండినను, నాజ్వరము వక్ష్యమాణ త్రివిధజ్వరములందు దేనిలో జేరియుండునో యెఱుంగవలెను.

### ౼ జ్వరసామాన్యలక్షణములు ౼

జీర్ణాశయము బలహీనతను జెంది యాకలిలేకయుండుట, శరీరారోగ్యములేకయుండుట, శక్తిహీనత, శ్రమ, వైవర్ణ్యము, కన్నులనీరుగారుట, యావలింతలు, నోడలువిరుచుట, యరుచి, గగుర్పొడుచుట, శరీరముబరువుగనుండుట, నేమియు దోచకుండుట, దేనియందు నిష్టములేకుండుట, విరసత్వముగనుండుట, సంతోషములేకయుండుట, విట్బంధమైయుండుట. జలుబు, దగ్గు, గొంతునొప్పి, తుమ్ముట, కరపాదములు నొచ్చుట ఈమొదలైనవి జ్వరప్రవేశమునకు సాధారమైనవిగా నున్నవి. పైలక్షణములనుబట్టి జ్వరమని దృఢముగాఁ దెలియబడుచున్నది.

శరీరమునకు బ్రతికూలమైన కార్యములవలన కోష్ఠాగ్నియందుండునుష్ణము రసాదిధాతువులయందు గలసి బహువిధలక్షణసహాయయుక్తమై జ్వరముగా బరిణమించును. రసాదిధాతువులు ప్రత్యేకజ్వరములుగానుండినను, మరి పెక్కుజ్వరములుగలవని చెప్పబడియుండినను అవియన్నియు. ౧ ఆహికము. ౨ అశ్రాంతము. ౩ సన్నిపాతము అని మూడువిధములలోనే చేరుచున్నవి. ౧ విడిచి విడిచి వంతులప్రకారమువచ్చునది యాహికమనియు, ౨. బహిరంతర్గత భేదము లేర్పడక సంతతముండునది యశ్రాంతమనియు, ౩ బహురోగాశ్రితమై మనోజ్ఞానాదులవికలింపజేసి విషమించునది సన్నిపాతమనియు నెఱుంగునది. ఈమూడును సూక్ష్మగాఢ కారణభేదములవలన సామాన్యముగాగాని తీక్ష్ణముగాగాని వ్యాపించుటయుం గలదు. సకలదేశకాలభేదములతో శరీరప్రతికూలకారణములును, ఋతుదోషములును, దత్తద్బలాధిక్యములతో శరీరస్వభావగుణములంబట్టి ప్రాణులం బీడించుచుండును.

మఱియు జాంగలానూపసాధారణదేశములందు పైత్రివిధజ్వరములలో నశ్రాంతాహికములు సర్వసాధారణముగ నుండును. అవి యానూస్థలముల

గుణమునుబట్టి సంభవిల్లుచుండును. అనగా నొకదేశమున ఆహ్నికజ్వరములుగాను, మఱియొక ప్రదేశమున అశ్రాంత జ్వరములుగాను గలుగును.

అదిగాక సకలదేశముల నానావిధములైన వాడుకరోగములు, జ్వరములును, కాలానుగుణముగా దత్తత్కారణాధారముల ననుసరించి తారతమ్యములుగా సర్వదా గలిగియుండును. అవి కాలవైపరీత్యమువలన విషములై లేనివి సంభవింపజేసి బహువిధాయాసములంబెట్టి తుదకు బరలోకగతులం జేయుచున్నవి.

సన్నిపాతజ్వరము సకృత్తుగా వ్యాపించగలదు. అది సంభవించిన వారు జీవించుట దుర్లభము. అది యొకానొకప్పుడు దుష్టకాలమున దఱచుగా గలిగి నష్టపరుచును. మఱియు స్వభావమయిన వ్యాధులు శరీరమున బురాణముగ నాటుకొనియుండి విపరీతకాలమున వానిలో దరుణవ్యాధులుగాని, లేక సన్నిపాతజ్వరములుగాని చేరి యపాయము గలుగును.

## జ్వరకారణవిశేష స్వరూపము

మఱియుం శీతోష్ణాజీర్ణాదికారణములవలననేకాదు; వ్రణము గాయము మశూచకము సుఖసంకటములు నేత్ర - కర్ణ - ప్రసూతి - శిరోవ్యాధులు మొదలయినవానివలనను, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులు నిట్టి పలువిధములయిన రాగరోగములవలనను పైత్రివిధజ్వరములు గలుగును. ఏరోగారంభమునగాని జ్వరమురాక మానదు. లేదా పురాణమునందేని గలయుండును. రాకపోవుట యరుదు. శరీరమునకుగలిగిన యేవిధవిరోధమును జ్వరములో చేరుట సహజము.

మఱియు అహితాహారాచారాద్యపథ్యసేవనవలననే రోగోత్పత్తియనికాదు. చల్లగాలి యెండ వెన్నెల మంచు మొదలుగాగలవి సోకినమాత్రమునసే వానిదోషములు రోమకూపముల గుండగాని యుచ్ఛ్వాసనిశ్వాసముల వలనగాని, మనశరీరమున నాటుకొని రోగోత్పత్తి యగును.

## ఆహికాశ్రాంతజ్వరముల భేదవివరము

విడచివిడచి వంతులప్రకారమువచ్చునది ఆహికజ్వర మనబడును. అది విడిచి తిరిగివచ్చువరకు నేమియు లేక యారోగ్యముగలవానివలె రోగి సంతోషముగ నుండును. అనగా వ్యాపకకాలమున పులకాదిలక్షణములు విముక్త్యుత్తరకాలమున లేక శరీరము నిర్మలముగనుండుట, మరియు బహిర్గతాంతర్గత భేదములచేఁ బట్టువిడుపులుగా నేర్పడి నియతముగ వచ్చుచుండుట, అశ్రాంతజ్వరమునందువలె విడుపుకాలములో నసౌఖ్య మీయాహికజ్వరమందుండక సుఖముగనుండుట ఈమొదలయినవానివలన నశ్రాంతజ్వరమునకు నాహికజ్వరమునకు వ్యత్యస్తము విశదముగాఁ దెలియవలెను.

## త్రివిధదేశవిచారము

జాంగలం వాతభూయిష్ఠ మనూపంతు కఫోల్బణం,
సాధారణం సమమలం త్రిధా భూదేశ మాదిశేత్,

జాంగలదేశమునందు వాతము ప్రచురముగాను, అనూపదేశమునందు కఫము ప్రచురముగాను, సాధారణదేశమునందు సమదోషముగలదిగ నుండును.

దేశః ప్రచురపానీయో బహువృక్షసమాకులః,
బహువాత కఫవ్యాధి రనూప ఇతి కథ్యతే.

తా. ఏదేశమునందు విస్తారముగ నుదకము వృక్షములుగలవో యాదేశము అనూప మనబడును. అందులో వాతశ్లేష్మసంబంధవ్యాధులు విస్తరించియుండును.

స్వల్పోదక స్స్వల్పవృక్షో బహుపిత్తాసృగామయః,
కథ్యతే జాంగలో దేశస్తాభ్యాం సాధారణః పరః.

తా. ఏదేశమునందు ఉదకవృక్షములు కొద్దిగా నుండునో అది జాంగలదేశ మనబడును. అందులో రక్తపిత్తరోగములు విస్తరించియుండును. ఈరెండు

దేశములకంటె ఉదకము వృక్షములు యథోచితముగ గలది సాధారణదేశ మనబడును

ప్రపంచమంతయు జాంగలానూపసాధారణదేశములను మూడువిధములుగ విభజింపబడియున్నది. విశేషముగా పర్వతములు అడవులు తోపులు మహానదులు గుట్టలు మలినస్థలములు సముద్రప్రాంతదేశములు చరులు మన్నెము మొదలయినదేశములచే న్యూనాధికములై సామాన్యము నతిశయము విషమము నగుస్థలవిశేషములంబట్టి రోగములు సామాన్యముగగాని, గాఢముగగాని గలుగుచున్నవి. అట్టిదేశములందు కాలము కర్మము నీకారణాంశములంబట్టి త్రివిధజ్వరములు సంభవిల్లును. మరికొన్నిజ్వరములు మన్నెపుదేశముల తారతమ్యముగా నెప్పుడు గలిగియుండును. అక్కడ నప్పటప్పటికాలవిద్యమానస్థితులనుబట్టి త్రివిధజ్వరములు బహురోగా శ్రితమ్ములుగాఁ బరిణమించుచుండును.

## జ్వరోత్పత్తికాలము

మఱియు నానాదేశములలో వర్షాకాలము గడచినతోడనే వ్యాపించుచుండును. కొన్నిమన్నెపుస్థలములలో వసంతఋతువునందును గలిగియుండును.

ముఖ్యముగా దీనియందు శీతలము కారణముగనున్నది. ఏకారణముచే జ్వరోత్పత్తి అయినదో దాని కనుగుణమైన లక్షణము లేర్పడి యుండును. త్రిదోషములలో దేని కనుగుణమైనకారణమో దాని ననుసరించిన పలు తెఱంగులలక్షణములు గలిగియుండును. కాబట్టి కారణములను విచారించి వాతాదులకు సంబంధపఱచుకొనవలయును.

ఇదిగాక కొండలు వనములు మన్నెపుస్థలాదులు వీనియందు వసించువారికి గాఢజ్వరములు సంభవిల్లి బహుకష్టములంబెట్టి యంతమున ప్లీహము మొదలైనరోగములు గలిగించును. మన్నెపుభూమి దేశకాలగుణబలాబలములంబట్టి రోగములు సామాన్యగాఢ విషమములుగా జనులను బాధించును.

ఈజ్వరములు ముఖ్యముగా మనయకృత్యములవలన వాతాదులు దుష్టంబులై కోష్ఠమునంజేరి జీర్ణాశయములకు దౌర్బల్యముగలిగించి యుండుండు.

నుడుకు నణచి తజ్జ్వాలలూర్ధ్వముఖలై శరీరమాద్యంతముగ వ్యాపించి రక్తాది ధాతువుల శోషింపజేసి వానిలక్షణసహాయములతో శరీరస్వభావముతోఁగలిసి వచ్చెడునవిగా నున్నవి వాతశీతోష్ణాజీర్ణాదికారణములవలన నుత్పత్తియై యితర రోగాదిమిశ్రమమై వానివానిగుణలక్షణసహాయములతోఁ బ్రకోపించునవిగా నూహింపవలయును.

అదిగాక వాతాదులకును కారణములకును బరస్పరసంబంధము లెట్టుఁగాఁగలవో జ్వరములలోఁగలిగెడు త్రివిధమార్గములకు నేది యనుకూలమో యది ప్రబలముగ నుండును.

అనగా చలి యుష్ణము స్వేదము లను త్రివిధమార్గములలో నేకారణసంబంధమో యది ప్రబలముగ శ్రమపరచును. మఱియు త్రిదోషములయందేది రోగోత్పత్తికిఁ గారణమగునో యాదోషమే తక్కినవానినిఁ బ్రకోపింపఁజేయుటకును, నానావిధరోగసహాయములకును, నందులో కడవరకుఁ గలుగునట్టి దానిమార్పులకును, నన్నిటికిని నాయాదికారణదోషమె హేతువుగాఁ దెలియవలయును. ఆదోషమెంతదుర్బలముగా లేక బలవత్తరముగా నాశ్రయించినదో, యంత జ్వరముస్వల్పాధికములుగా చిరకాలము పీడించునదిగా నున్నది.

ఆదికారణదోషము తాను నశించువరకు నాహి కాశ్రాంతజ్వరములుగా వ్యాపించుచుండును.

## జ్వరత్రిభాగస్వరూపము

జ్వరము త్రిదోషాత్మకమైనను దానియంతర్భాగములు మూడు విధములుగా నేర్పడియున్నవి. అవి చలియు, నుష్ణము, స్వేదము ననంబడును. వాతపైత్యశ్లేష్మదోషములు మూడును ప్రత్యేకము త్రివిధములుగా గలిగి వేధించుచున్నవి. పైమూడువిధములనుబట్టి వాతాదులస్వరూపము ప్రత్యక్షముగాఁ దెలియబడుచున్నది. అవి ౧ ప్రారంభమున చలిగలుగుట. ౨ రూక్షఁగలిగి శరీరోష్ణము వృద్ధియై లక్షణములతో వేధించుట. 3 స్వేదముగలిగి జ్వరోష్ణము

మొదలైనవి నశించుట. ఈమూఁడువిధములలో నొకటివిడిచి యొకటి వేరు వేరుగా వ్యాపకమగును.

## చలిగుణము

నాభి స్థానమయి బాహ్యమున వీపు మూలి మొదలయిన స్థలముల యందు ప్రారంభించి శరీరము నాద్యంతముగ వ్యాపించి కంపము ప్రబలముగఁ గలుగును. ఇది గాఢమునందు శరీరమును గంపింపఁజేయుచు నెగురనెగుర వేయు చుండును. ఇది మస్తిష్కస్థలమునందు ప్రబలముగా నుండును.

మఱియు కొన్నిస్థలములయందు దత్వభేదముల హెచ్చుతక్కువలను బట్టి కంపము న్యూనాధికములుగా గలదు. ఇది కొంతకాల మనుభవమయిన పిదప చలి స్వేదము లేకుండును; లేక స్వల్పముగా నుండును. ఇది జ్వరము విడుచుటయందు నాహికజ్వరమని తెలిసికొనవలయును.

పైకంపమునకు పైనదుప్పట్లు చెవాలీలు బూర్ణీసులు కప్పి మనుజుఁడు బలముగాఁబట్టినను, తీరక గర్భములోనున్న యాశయములు పొరలివచ్చినట్లు తెరతెరలుగా చలి పైకొనివచ్చుచుండును. అదిగాక మంటవేసికొని కాచు కొన్నను సముద్రపుటలలు పొంగివచ్చునటుల చలివచ్చును. అప్పుడుఁ గలుగు లక్షణములు అశక్తి, నాడి తెలియరాకయుండుట, జ్వరము తెలియకుండుట, లేక హీనముగా గనబడుట, యాయాసముండుట, మూత్రము తెల్లగా మాటి మాటికి వెడలుట, యావలింతలు శ్రమ వైవర్ణ్యము నేమియు రోచకయుం డుట, గగుర్పొడుచుట, తంద్ర గలుగుట, శరీరము చల్లగనుండుట, స్వేదము రాకుండుట, దేహము బరువుగనుండుట ఈమొదలైన గుణములు శీతమెంత ప్రబలముగనుండునో యంతవృద్ధిగా గలిగియుండును.

## రూక్షగుణము

కంపము తక్కువగ నుండునపుడు జ్వరము ప్రబలముగాను, జ్వరము తక్కువగా నుండునపుడు కంపము ప్రబలముగా పైకంప మెట్లుగా నుపశ

మిల్లునో యట్లుగా నుష్ణమెక్కుచుఁ గ్రమముగా జ్వరము ప్రబలమగుట; ఉష్ణ మెక్కుటలోనున్న నాభిస్థానమై మూతి మెడ వీనియందు బ్రారంభించి యాపాదమస్తకము క్రమముగా దనువెల్లను వ్యాపించును. అప్పుడు జ్వర తాపముచే వేసటబడుట, నిట్టూర్పువిడుచుట పైత్యప్రకోపమున నానావికారములుగలుగుట దేహము దిరుగుట, పచ్చనిపిత్తపుపసరు వాంతియగుట, విదాహముగలుగుట, శరీరము పులకరించుట, సంతాపముగలుగుట, కడుపులోఁ ద్రిప్పుచుండుట లేక మంటగానుండుట, జీర్ణకోశములో బరువుగనుండుట, కరపాదములు మండుట, శరీరోష్ణము తీవ్రముగనుండుట, అభిఘాతస్థునివలె నలసటబడుట, నాడివేగముగలిగియుండుట, గుండెకొట్టుకొనుట యొకలు నొచ్చుట కండెముబట్టినట్లుండుట, ముఖము పొంగియుండుట, నాలుకమీదగోధుమరంగువలె జిడ్డుగలిగియుండుట; థర్మామిటర్లో ౧౦౫ మొదలుగా ౧౦౬ డిగ్రీలకు పైన జ్వరము తీవ్రముగనుండుట. మనస్సు వేసటబడుట; అపథ్యములం దిచ్ఛ గలుగుట, కాళ్లు వీపు మెడ నడుము నొప్పిగలుగుట, దేనియం దిచ్ఛలేకపరుండుట యివికలుగును. ఈజ్వరమున శిరోవ్యథ బహుతీవ్రముగనుండుట సహజముగా గలదు. కొందరియందు సకృత్తుగా లేకుండును. ఈమొదలుగాఁగలలక్షణము లాహికజ్వరమందు సర్వసాధారణముగా గలిగియుండును.

ఈలక్షణము లందఱియందు నొకేవిధముగ నుండజాలవు. ఒకరోగికి నన్నిగుణము లుండుటలేదు. కొన్ని యుండి కొన్నిలేమియుం గలదు. ఇందులో లేనిలక్షణములు ఒకానొకనికి గలుగును. ఒకానొకప్పుడు దేశకాలతత్వములు విపరీతములై లక్షణములు వేరుగాఁ గలుగుచుండును.

అదిగాక శైత్యోష్ణవాతాభిఘాతాదికారణము లనేకములుగా నున్నవి. అవి స్థూలకారణ సూక్ష్మకారణముల ననుసరించి స్వల్పాధికములై జ్వరములు నితరరోగములు పుట్టుచుండును. అట్టికారణసహాయములతోనున్న దేశకాల ధర్మమునుబట్టి యొకప్పుడు లక్షణములు భిన్నరూపములుగ మారుచుండును.

మఱికొందఱియందు గుండెయు పార్శ్వము కడుపువేదన గలుగును. ఇది జ్వరములో కష్టసాధ్యగుణము.

మఱియుం నెమిడికలవలన గడుపునొప్పి మాంద్యము మొదలైన లక్షణములు గలిగియుండును.

ఒకనికి నప్పుడప్పుడు జ్వరమువచ్చు కాలములో నొకపరియుండునట్లు రెండవపరి యాలక్షణములతో గూడియుండుటలేదు. కావున నకృత్తుగా నిందులోనున్న లక్షణములకు భిన్నముగా నుండును.

జ్వరములు ఇతరరోగములు సర్వకాలసర్వావస్థలయందు నొకేవిధముగ నుండినను ముఖ్యముగ దేశకాల తత్త్వకర్మములచేతను నప్పటప్పటి కారణములు మొదలైనవానిమార్పుచేతను లక్షణములును వానిలో సాంక్రామికమైనరోగములును భిన్నభిన్నములుగా గలిగి యుండును.



స్వేదగుణము

జ్వరముక్తేతు సర్వాంగే మలముక్తే లలాటకే,
ప్రాణముక్తేచ కంఠేచ సన్నిపాతే ముహుర్ముహుః.

జ్వరము విడుచునపుడు సర్వాంగములయందుఁ జెమటగలుగును. మలము విడుచునపుడు లలాటమునఁ జెమటగలుగును. ప్రాణము విడుచునపుడు కంఠమునఁ జెమట గలుగును. సన్నిపాతమున పలుమారు చెమట స్రవించుచుండును.

మఱియును దేహపరిశ్రమపడినవారికి స్వేదముగలిగినట్లు, లక్షణసహాయ తీక్ష్ణజ్వరముతో మిగుల శ్రమజెంది తన్నివారణార్థమై స్వేదముత్పన్నమగును.

మూత్రి మొగము మెడ వీపు వీనియందు బ్రథమమున గనుపడి, పిమ్మట నాపాదమస్తకము ఘర్మస్రావము గలుగుటచే జ్వరోష్ణము వానితోఁ జేరిన లక్షణములు మొదలైనవి నశించి జాడ్యములేనివానివలె నేర్పడుచున్నవి.

మఱియును రోగిగానుండువానియందు మధ్యకాలపు విరోధక్రియలు రోగము హెచ్చుటకును, నూతనరోగములుగలుగుటకును, కారణములుగా

నున్నవి. ఉష్ణాతిశయమునం దావిరినీరు స్రవించినట్లు జ్వరోష్ణముచే స్వేద స్రావముగలఁగుట జ్వరవిముక్తి స్వభావముగా దెలియవలయు.

అప్పుడు పులకరమునందుగల లక్షణములు లేక యారోగ్యముగ నుం డుట, శరీరమున మోపైన బరువువిడనాడినవానికివలెఁ దేలికగానుండుట, దీప్తి గలుగుట, బలహీనముగనుండుట, యుత్సాహముగలుగుట, నిద్రగలుగుట యీ ప్రకారము నీరోగిగా గొంతకాలముండి యాకస్మికముగాఁ దిరిగి పూర్వమువలె మూఁడువిధముల పులకర మారంభమగు చున్నది. ఇటుల గర్భస్థదోషము హరించు నంతవరకు గలుగుచుండును.

## ఆహికజ్వరలక్షణము

అథోత్తరం ప్రవక్ష్యామి ఆహికజ్వర లక్షణం,
సశీతపులకం కాసో దాహస్సల్లాపదృగ్రుజా.
శిరోరుజాంగవైకల్యం కుక్షిపార్శ్వంచ శూలకృత్,
అపథ్యవాంఛా తంద్రాచ పాదహ్రస్ముఖశోభితా.
గాత్రంపాండురవర్ణంచ పీతవర్ణేచ లోచనే,
నఖాంతం రక్తహీన మతిసారంచ జాడ్యతామ్.
కరపాదవిదాహంచ ఆహిరజ్వరలక్షణం,

చలిబెట్టుట, శరీరము గగుర్పొడుచుట, దగ్గుగలుగుట, దాహము గొనుట, వదరుట, కన్నులునొచ్చుట, శిరస్సునొచ్చుట, యొడలు కడుపు ప్రక్క లు నొచ్చుట, యపథ్యవాంఛ, యధికనిద్ర, కాళ్లు కడుపు మొగము వాచుట, యొడలు తెల్లవారుట, కన్నులు పచ్చనగుట, గోళ్లయందును రెప్పలయందును నెత్తురులేకయుండుట, కదుపుపారుట, వేసినకాళ్లు వేసినచేతులు వేసినట్టే యుండుట, యరికాళ్లు నరచేతులు మండుట యివి యాహికజ్వర లక్షణములని యెఱుంగునది. పైలక్షణము లాహికజ్వరభేదములందన్నిటిలో తరుణపురాణకాలములలో వచ్చుచుండును.

## దీనియం దంతర్భూతములయిన జ్వరములు

ఏకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికంచ చతుర్థికం,
పంచాహికం చార్ధరాత్రం పాక్షికం మాసికం తథా.
షాణ్మాసికం వాత్సరిక మాహికం తత్ర కథ్యతే,
వాతపిత్తశ్లేష్మకంచ విజానీయా ద్భిషగ్వరైః.

వాతపిత్తశ్లేష్మములే జ్వరస్వరూపమై కాలభేదముచేత నేకాహికము, ద్వ్యాహికము, త్ర్యాహికము, చాతుర్థికము, పంచాహికము, అర్ధరాత్రము, పాక్షికము, మాసికము, షాణ్మాసికము, సాంవత్సరికము ననియాహికమందు భేదములు కనుపట్టుచున్నవి.

## ఏకాహికజ్వరలక్షణము

ఏకాహికంచ పూర్వాహ్ణే జ్వరం వేగాతివేగతః,
శిరశ్శూలంచ శీతంచ ఏకాహజ్వరలక్షణమ్.

ఉదయపువేళ మొదటిజామున వచ్చునది: అనగా ౭౮ గంటల కొక తూరి వచ్చునది ఏకాహికమనుట; జ్వరము తీక్ష్ణముగ గాయుట, శిరోవేదన, శీతలముగనుండుట యివిగలచో నేకాహికజ్వరమని యెఱుంగవలయును.
గ్రంథాంతరే:—

జ్వరోతిదారుణశ్చైవ దాహో మోహశ్శిరోవ్యథా,
ప్రలాపో బహుదుర్భాషా హ్యుద్గారో వమనం సదా.
హిధ్మాశ్వాస శ్శిరోభ్రంశ స్సత్వహానిఃపిపాసు తా,
ఏకరాత్ర మతిక్రమ్య జ్వరశ్శీతో మహాద్భుతః.

దారుణమగుజ్వరము దాహము మోహము తలనొప్పి పడుటట విశేష దుర్భాషలాడుట యొకిరింత వమనము హిధ్మ శ్వాస తలదిరుగుట బలహీనత దప్పికలిగి యొకరాత్రి యతిక్రమించిన యద్భుతమగుజ్వర మేకాహికజ్వర మనంబడును.

## త్ర్యాహికజ్వరలక్షణము

తత్ త్ర్యాహికంచ మధ్యాహ్నే జ్వరస్తీవ్రతరస్తథా.
హస్తపాదశిరశ్శూల త్ర్యాహికజ్వరలక్షణమ్.

ఒకదినము అతిక్రమించి మధ్యాహ్నమున మూఁడవరోజు రెండవ జామునవచ్చునది అనగా ౪౮ గంటల కొకతూరివచ్చుట, జ్వరము తీవ్రముగ గాయుట, కరపాదములు శిరస్సు నొప్పిగలుగుట యివి త్ర్యాహికజ్వరలక్షణము లని యెరుంగవలయును. గ్రంథాంతరే.—

జ్వరో రౌద్రో మహాశీత మతిక్రమ్య ద్విరాత్రకం,
దాహో మోహశ్శిరోభారః పిపాసాస్వేదఉత్కటః.
ఉద్గారో వమనం హిక్కా హ్యక్ష్ణోశ్చ భ్రమవేదనం,
సన్తాపః కరపాదేచ సుప్తిహాని ర్బలక్షయః,
నిష్ఠ్యూతిః ఫేనయుక్తాచ కరపాదంచ శీతలమ్.

రెండురాత్రుల నతిక్రమించి రౌద్రమగు జ్వరమువచ్చుట మిగుల శీతము దాహము మోహము తలబరువు దప్పి మిగుల చెమట యెక్కిరింత వాంతి హిక్క కన్నులుదిరుగుట నొప్పియు కరములు పాదములు వీనియందు సంతాపము నిద్రలేకయుండుట బలహీనత నురుగుతోడ నుమియుట కరపాద శీతలము నిట్టిలక్షణములుగలది త్ర్యాహికజ్వరము.

## చాతుర్థికజ్వరలక్షణము

సాయంకాలే జ్వరంఛర్ది శ్శీతదాహం శిరోవ్యథా,
శరీరే హిమవచ్ఛైత్యం చతురాహికలక్షణమ్.

మధ్య రెండురోజులువిడిచి మూడవజామున లేక సాయంకాలమున వచ్చునది అనగా ౭౨ గంటల కొకతూరివచ్చుట, వాంతిగలుగుట, చల్లని యందకమందు నపేక్షయు, శిరస్సు నొప్పియుండుట, శరీరము చల్లగనుండుట యిట్టిలక్షణములుగలది చాతుర్థికజ్వరమని తెలిసికొనవలయును.

మతాంతరే—

జ్వరో ఘోరో మహాశీత మతిక్రమ్య త్రిరాత్రికం,
రోదనం కంపితం చాంగం దాహో మోహశ్శ్రమ స్తథా.
నిస్సత్వం శుష్కతాంగానాం నేత్రతోయస్రవ స్సదా,
అరుచిశ్చాగ్నిమాంద్యంచ జడత్వంసర్వసంధిషు.
అజీర్ణారుచివిష్టంభ మన్నద్వేష స్తథైవచ,
శ్వాసః కఫో మహాశోషః పూర్వపాపానుసారతః.

మూఁడురాత్రులు గడచినపిదప భయంకరమగు గొప్పశీతజ్వరము రోదనము శరీరమువణకు దాహము మోహము శ్రమ నిస్సత్వము అవయవములు శుష్కించుట కన్నులయందెల్లపుడు నీరుకారుట యరుచి యగ్ని మాంద్యము సర్వసంధులయందు జడత్వము అజీర్ణము ఇష్టము లేకుండట విష్టంభము అనఁగా మలమూత్రబాధరోగము అన్నద్వేషము శ్వాస కఫము మిక్కిలి శుష్కించుట యిట్టిలక్షణములు గలది చతుర్థాహికజ్వరముగా నెఱుఁగ వలయును.

పై ముత్తెఱగుజ్వరములు సామాన్యముగ వ్యాపించుటఁ గలదు. వానిలోఁ బ్రతిరోజు వచ్చెడునైకాహికజ్వరము మిగులఁ దఱచుగానున్నది.

మఱియుం పాక్షిక, మాసిక, సాంవత్సరిక, జ్వరములుం, ఆహికజ్వరములలోఁ జేరునవిగా నెఱుఁగవలెను.

ఈయాహికజ్వరములు మన్నెపుదేశములయందు సర్వసాధారణముగా మిగుల దట్టముగాను వ్యాపించియుండును. అవి మిగుల వ్యాపకకాలంబున మొదటిరోజు వచ్చినకాలములోనే నిలిచియుండుటలేదు.

కాలనియమములేక ముందువెనుకగా ఒకానొకనియందుఁ గలుగుచుండును. అనగా నైకాహికము ద్వ్యాహికముగాను, ద్వ్యాహిక మేకాహికముగాను, నిష్కర్ష లేక కలయదిరుగుచు రాకడపోకడలుగానుండును. మఱియుం మొదటిజాము రెండవజాము మూఁడవజాము జ్వరములనిగాని, పగటిజ్వరమనిగాని.

రాత్రిజ్వరమనిగాని కాదు. పైజ్వరములకుఁ గాలవిళంబ మొకదానికొకటి హెచ్చుగా నుండుటనుగురించియు, నవి దినముల పేరిట జ్వరము లేర్పడి నామములుండుటయేగాని, యవియన్నియు నొకవిధమయిన యాహికజ్వరములుగాఁ దెలియవలయును.

## ద్వ్యాహికజ్వరము

ఒకరోజు చిన్నజ్వరమని ఒకరోజు పెద్దజ్వరమని కలదు. అనగా నొకనాఁడు మధ్యాహ్నముమీఁదుగా స్వల్పజ్వరముగా ప్రారంభించి, మరునాఁ డుదయకాలమునకు పూర్ణముగ విడువక దానిమీదనే జ్వరము వృద్ధియై తీక్ష్ణముగ నేర్పడి పిదప స్వేదముగలిగి జ్వరము విడుచును. దీనిలో జ్వరవ్యాపకకాల మధికముగాను, లేనికాలము తక్కువగాను నుండును. దీనినే ద్వ్యాహికజ్వరమని చెప్పుచున్నారు.

ఈయాహికజ్వరము లన్నిటిలో ద్వ్యాహికము గాఢమైనదిగాఁ దెలియవలయును.

ఇదియునుగాక పాక్షిక మాసిక సాంవత్సరిక జ్వరములందును, నేకాహికాదులందును, లక్షణము లొకేవిధముగ నుండును గావునఁ బ్రతిజ్వరమునకు వేరువేరుగా వ్రాయలేదు.

ఈజ్వరములు ప్రథమంబున నిశివేళఁ గానంబడును. అటుతర్వాత నుదయమునందు వదలి తిరిగి మధ్యాహ్నమునఁ గానంబడి రాత్రివేళ వదలుచుండును.

అటుగాక ప్రథమదినంబున గనుపడినవేళకుఁ బ్రతిరోజు కొంచె మించు మించుగా నదేవేళకు వచ్చుచుండుటయుఁ గలదు.

ఈప్రకారము గర్భస్థమైన దోషము హరించునంతవరకుఁ బట్టువిడుపులతో వ్యాపించుచుండును.

ఈయాహికజ్వరములు ఋతువుల కనుగుణముగ నప్పటప్పటి శీతోష్ణకాలదౌర్బల్యప్రాబల్యములనుబట్టి తదనుగుణముగనే గాఢవిషసామాన్యములుగా వేధించును.

మఱియు శరీరస్వభావస్థితికిని గాలస్థితికిని సంబంధముగలదు. కావునఁ గాలస్థిత్యనుగుణముగాను గర్మాధీనముగాను రోగము సంభవించి సామాన్యవిష గాఢములుగానై వేధించుచుండును.

ఈయాహికజ్వరము లెంతతీక్ష్ణముగఁ బ్రాణుల శ్రమపెట్టినను, జ్వర వ్యాపక కాలము తక్కువగాను, జ్వరములేనికాల మెక్కువగాను నుండుటం బట్టియుం జ్వరముపూర్ణముగా విడుచుటంబట్టియుం జీవుల కెంతకష్టమైనను గొంతసేపు శ్రమతీర్చుకొనుటకు వీలుండినందున సాధ్యమైనవిగానున్నవి.

ఈజ్వరములు సామాన్యముగ నపాయము గలిగింపవు. ఆహికజ్వరాదులుం సాంక్రామిక వ్యాధులతో సంబంధించియున్నవి. అవి దేశకాలవైపరీత్యములచే సర్వసామాన్యముగ సంభవించును. అవి మిథ్యాహారవిహారములవలన నేకాదుం ఒకరి కొకరికి సాంక్రామికమైన వ్యాపకము గలవిగా నెంచవలెను. అవి వ్యాపించినస్థలములకుఁ గ్రొత్తగాఁ బ్రవేశించువారియం దావేశించును.తద్వ్యా పక కాలమున నపథ్యాదిదోషములు సేయుగ నాహారపానీయవిహారములలో తమ తమ శరీరస్వభావముల నెఱిఁగి దేహసంరక్షణాదిసమస్తవిషయములలో మిగుల జాగరూకులై యుండవలయును.

## ⸺ జ్వరమునందలి కార్యాకార్యములు ⸺

ఆహికజ్వరాదులవ్యాపక కాలమున నౌషధసహాయములేక జ్వరములతో శ్రమపడుచు, జ్వరములేనప్పుడు పనులుపంటలు మొదలైనవిచేసికొనుచు, మిథ్యాహారవిహారములుసలుపక పథ్యపానీయము లమర్చుకొనుచు, దానివ్యాపక కాలము కడవరకు తుదముట్టించి తర్వాత సుఖజీవులుగనుండుట జూచు చున్నాము. మఱికొన్నిమన్నెపుస్థలములలో లెన్నగాజనులబీడించి పురాణమునఁ బ్లీహము అనగా జ్వరపుబల్లగా సంభవించి హస్తపాదములు నూదపడి కడుపు పెరిగి వికారశరీరులై తదనంతరము సౌఖ్యముచు బడయుచున్నారుగాని, మరణములంతగాఁ గలుగుటలేదు. సాధ్యమునకువచ్చునపుడు మధ్యవిరోధక్రియలను జేయవలదు.

మఱియుం పిత్తోద్రేకగుణములను నెఱుగక, గాలియుం, భూతాదులచేష్ట యని నానావిధములైనకార్యముల నొసంగుదురు. అదిగాక యిటులనే చేతబడి జేసిరని దలంచి, వీరువారని పెక్కు ప్రతిహతకార్యములచేసినను తుదముట్టక నాపదసముద్రములో మునుగుచుందురు. బలువైనతెగుళ్లనుగురించి అనేకౌషధ చికిత్సలు జేసినను సాధ్యపడక కడుకష్టములఁ బరపుచుండుట యుండగా వ్యర్థముగ మనోభ్రమనుజెంది రోగమును రోగముగాదని భ్రమసి, యితరకార్యములనేకములుగ సలుపుచుందురు. గాలిచేష్టయుం, చేతఁబడియనియుఁ, నిజముగ నుండుపక్షమునకు వానిగుఱించి తదనుగుణమైనచికిత్స చేయుట సహజకార్యము.

శ్రీసర్వేశ్వరుఁ డనుగ్రహించినమనోబుద్ధులను మంచికార్యములందు ధైర్యసాహసములతో మెలపక వ్యర్థముగా క్షుద్రవిషయములం బ్రవేశపెట్టి నానాశ్రమల పడయుందురు.

మఱియు మన్నెపుస్థలవాసులు కొందఱు మిగుల మొరటుచికిత్సలు చేయుచున్నారు. ఈజ్వరాదులలో శిరోబాధ మిక్కుటముగఁ గలిగియుండుట సహజముగ నున్నది. అట్టివానికి జీడిచమురుగాని వెల్లుల్లియావాలుగాని నూరి తలనొప్పికి వేయుచుందురు. వానితీక్ష్ణతచేత నా స్థలమున పుండగుటయే గాక నేత్రములఁబొంగి పూర్వముకంటె మిగుల బాధ నొందుదురు.

ఇదియునుంగాక రోగి కలవరించుట, నోరెండుట, తీవ్రజ్వరము పిత్తవికారములు గలిగియుండగా దోషాస్పదమైనదని నేత్రములలో బఱిణమందు వేయుట, కుంకుడుకాయచాదివేయుట ఇట్టి తీవ్రమైనచికిత్సచేయుటవలన బాధ రోగికే తెలియుఁటఁగాక నేత్రము లుడికి యెఱ్ఱనై నీరుకారి చూపు భేదమగును. మఱియు నిక వారు పుచ్చుకొనుమందు లెట్టివనగా జిల్లేడువేరుచెక్క, చిత్రమూలము, జుట్టుపువేరు మొదలైనతీక్ష్ణవస్తువులుగొని రసములుతీసి యందు విశేషదారుణమైన విషౌషధములను గలిపి యిచ్చుదురు.

ఇట్టి దుశ్చికిత్సలు పలువిధములుగాఁ జేసినదానివలనఁ గలుగునట్టి దుర్లక్షణము లెవియనగా:—— జ్వరము పూర్వముకంటె మిక్కుటమగును; ఆవేదనగల్గి

రొమ్మణచుకొనుచు; రొమ్మునొప్పిఁ గలుగును; వికారము తలనొప్పి మొదలైన బహువిధచిహ్నములుగలిగి మిగుల కష్టములు గలుగును; అదియునుంగాక యెంత మొఱపెట్టుకొన్న నుదకమునహితమీయకలంఘనము బెట్టి కంఠగత ప్రాణజీవులనుగాఁ జేయుచున్నారు. తద్రోగిపడునట్టి రోగబాధకంటె వైదుల్చి కిత్సలచే బహువిధకష్టములుగలిగి తుదకు నష్టము సంభవిల్లును. ఇట్టి నానావిధ ఘోరకార్యములనుబట్టి యవి దుష్కార్యములనియు దుర్మరణకారులనియు గ్రహింపవలయును.

మఱియు కొందరు బుద్ధిపూర్వముగ నాహికజ్వరసముద్రములోమును గుచుఁ దేలుచున్నవారు ఆజ్వరవ్యాపకకాలంబున శీతలపదార్థములను భుజించు టయు, శీతలంబునకైఁ దటాకము నూతులు గుంటలు వీనియందుజలకమాఁడు టయు, నెప్పుడు తడిలో మంచులో నుండుటయు, దప్పిలేకనే పలుమారు చల్లనియుదకము త్రాగుటయు, నాకలిలేకనే తలచినప్పుడంతయు బలుమారు మిథ్యాహారములుసేవించుటయు, మిథ్యావిహారములు సలుపుటయు, నకాలము నకు నిద్రాహారములు లేకుండుటయు, మొదలైన విరుద్ధకార్యములవలన జ్వర శత్రువునకుఁ జిక్కి సకలబాధలం జెందుదురు.

మఱియు జ్వరాదులకాలమున వైదుష్కార్యములను జేయువారికి రోగ సంభవము గలుగుచుండగా, రోగియయినవారు వైయపథ్యాదికృత్యములసలుపు వారికి దద్రోగము విషమగుటకు సంశయములేదని యెఱుంగవలెను;

## జ్వరమునందు విరుద్ధకార్యములు

అదియునుంగాక మంచిజీర్ణశక్తియు మనోబలమును దృఢగాత్రమును గల యెట్టి మహానీయుఁడును రోగశత్రువుచేఁ జిక్కక మానఁడు. రోగోత్పత్తికి మిథ్యాహారవిహారంబులు మూలంబుగ నున్నవి. ఇట్టి కార్యకారణములకుఁ బ్రవృత్తిగల్గుట కాలమహిమగా నున్నది. షడ్రసములను మిక్కుటముగ భుజించుట అభిఘాతాదు లొనర్చుట తిరుగుట స్త్రీసంభోగం బొనర్చుట

త్రోవనడుచుట సాముజేయుట చెమట గలుగునటుల సేపనిగాని సేయుట జాగరణము సేయుట అభ్యంగనము గావించుట యుపవాసము గావించుట శీతోష్ణోదకాదులను పానం బొనర్చుట విహరించుట ఇత్యాది కార్యములు గావించుట వలన రోగకరములుగను రోగికి పైక్రియలవలన రోగము విషముగ నేర్పడి మరణము జెందజేయును.

రోగములను నరులకు శిక్షనిమిత్తము శ్రీజగదీశ్వరుడు సృజించి యుండగాఁ, బథ్యమాచరించుట కేమని విచారింతురు. అయినను రోగనివర్తక కార్యములన్నిటిలో శ్రీజగన్నాథుడు పథ్యము నౌషధమును ముఖ్యమయినవిగాఁ గల్పించెను.

## రోగనివృత్తిక్రమము

సమస్తమైనవానిలో యథాశక్తిగా శుచిగానుండుట, యారోగ్యదాయకము. అశీతోదకస్నానంబును నిత్యము బట్టలు విడుచుటయుఁ జల్లగాలి మంచు లేక శీతోష్ణములు సోకకుండునట్లుండుట వానికి తగినయుడుపులు వేసికొని యుండుట, సదా తడిజేసికొనకుండుట, యాహారపానీయములు మంచివిగాగొనుట, యాహారవిహారవిషయములలో శక్తిమీరక మితముగఁ బ్రవర్తించుట, కాలాతీతముకాకుండ సకాలమునకు మితముగఁ బ్రవర్తించుట, గృహము శుభ్రముగ నుంచుకొనుట, మంచములమీద శయనించుట, మలమూత్రములు చలనమాత్రంబున విసర్జించుట, ఉపవాసాదికృత్యములు సేయకుండుట, జాగరణము సేయకుండుట, మిద్దెలమీద మేడలమీద నివసించుట, మంచు శీతకాలమునందు మంట కుంపటి నుంచుకొనుట.

## అసాధ్యలక్షణములు

ఈజ్వరములు ప్రారంభమున తీవ్రముగనుండి బహువిధలక్షణములతో నొకదానివెంబడి నొకటిగా వేధించుచుఁ బురాణమున లోజ్వరమై యగ్నిమాంద్యముగలిగించి యకృత్, ప్లీహము, శోభాతిసారరోగములుగలిగించి మృతుం జేయును. మఱియు, బ్రారంభమున జ్వర మల్పముగనుండి పోనుపోను

జ్వరము వృద్ధియైనఁగాని రోగములను సంఘటింపఁజేసికొని, శరీరము శోషింపఁజేసి, యింద్రియాదులను క్షీణింపఁజేసి తుదన శ్వాసగలిగించి యమాలయంబునఁ జేగించును.

ఆహికజ్వరము లక్షాంతజ్వరములందుఁగాని సన్నిపాతజ్వరములందుఁగాని చేరునప్పుడసాధ్యములగును.

మఱియు సాహికజ్వరాదులలో సాదిమధ్యాంతములు దెలియకుండు నప్పుడును, లేవలేనంత బలక్షీణమైనప్పుడును, ప్రసూతిసమయమందును వ్రణములందును, కాలనిర్ణయములేక జ్వరమువచ్చుచుఁ బోవుచు నుండునప్పుడును, జ్వరముకన్నను లక్షణము లుపద్రవముగ నుండునప్పుడును, పగలురెండుమాఱులును రాత్రి రెండుమాఱులును జ్వరస్వభావ మొకవిధములేక మొదటితరగతిలో ననఁగా నేకాహికాదులలోఁ దిరుగునప్పుడును, జీవప్రధానస్థానములయిన గర్భాశయాంగములు అనఁగా కడుపు రొమ్మునొప్పి వీనిలో లేక మంట అరోచకము పెద్దశ్వాసము విషదాహము అతిసారము మొదలయినగుర్తులుగల జ్వరము మరణకారకముగ గ్రహించవలెను.

అదియునుంగాక యేకాహిక త్ర్యాహిక చాతుర్థిక జ్వరములు మొదటి తరగతిగను, సాప్తిక పాక్షిక మాసిక సాంవత్సరికములు రెండవతరగతిగను గ్రహించవలెను.

ప్రథమంబున ద్ర్యాహికచాతుర్థికములందుండి యేకాహికాక్రాంతములకు దిగివచ్చునట్టిదియు, నీక్రమంబుగ ౧ ౨ తరగతులంగలదియు, నక్రాంతవిష జ్వరములకు దిగివచ్చినదియు నసాధ్యము.

మఱియు నిద్రాహారములు సమస్తమైన జీవరాశికి శరీరారోగ్య బలకరములైనవిగ నున్నయవి. ఏరోగియందు దారెండులేకుండునో యదియును నసాధ్యముగా నెఱుంగవలెను.

## సాధ్యలక్షణములు

ప్రథమంబున నేకాహికముగనుండి విముక్తికాలమున ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికముగా నెడమై కాలాతీతముగ నేర్పడునది సాధ్యముగ నెఱుంగందగును.

ఈజ్వరము పురాణమగుచోఁ దొలగించుట దుస్తరముగావున తరుణ కాలమున హరింపఁజేయుట యుత్తమకార్యము. అవి సామాన్యముగ నపాయము లేకుండిన నుపేక్షింపక తొలుతనే నివర్తిఁ జేయవలయును.

జ్వరమును దెలుపునట్టి యింగ్లీషువారు చూచుచున్నట్టి క్లినికల్ థర్మామీటర్ అను సాధనము భిషగుత్తములకు నదిలేక నాడీజ్ఞానమువలన గ్రహించుటకంటె, సులభముగ జ్వరము కలిమి లేములు దెలియుటేగాక జ్వరోష్ణముయొక్క హెచ్చుతక్కువలును, సాధ్యాసాధ్యములును, సులభముగాఁ దెలియవచ్చుచున్నవి. అట్లు నాడీజ్ఞానమువలన నింతసులభముగాఁ దెలియరాదు. ఈ యేకాహికజ్వరాదులలో ౧౦౬ డిగ్రీలుండినను భయములేదు ౧౦౫ డిగ్రీలుండి సాధ్యమునకు వచ్చునపుడు ౧౦౪ రెండవనాడు ౧౦౨ గా దిగివచ్చుచుఁ గాలాతీతముగ నేర్పడి పూర్ణముగ హరించునది సాధ్యముగా నెఱుంగవలయును.

మఱియు జ్వరవిముక్తకాలంబునఁ గలుగు శుభలక్షణములు. ఆకలి క్రమముగావృద్ధియగుట, బలముగలుగుట, ఉల్లాసముగనుండుట, శరీరమునకు ముఖమునకు వర్ణముగలుగుట, తలనవగొనుట, తీటఁ గలుగుట, నిద్రబట్టుట, తుమ్ములు జలుబుగలుగుట, చెమటబెట్టుట, శరీరబలము క్షయింపకుండుట, ప్రథమంబున నుగ్రముగ ప్రకోపించినది దినక్రమముగ దిగివచ్చుచుండుట మొదలైనవి సాధ్యలక్షణములు.

జ్వరములో వాతాదిదోషములయందు దేనిలోఁ జేరియుండునది యెఱింగి తదనుగుణముగ చికిత్స నొసంగవలెను.

ఈయేకాహిక జ్వరములకు పశావార్డన్ సల్ఫేటాఫ్ క్వాయినా యనునది పరమౌషధముగా నెంచవలెను.

అది మిగుల సాయాసముగ సాహిక జ్వరముల బోనడుచునట్టియమృత రసాయన మనబరగును. అట్టి దివ్యౌషధసహాయముచే జికిత్సకార్పులు పెక్కువిధంబులుగఁ గల్పించి బహువిధరోగములకుఁ బ్రయోగించుచున్నారు.

హిందువులు తాళకము, సవీరము, పాషాణము, మణిశిల మొదలయిన వానిని బహువస్తువులతో మిశ్రముచేసి యిచ్చుచున్నారు.

ఇది జ్వరస్వరూపనిరూపణప్రకరణము

## తృ తీ య ప్ర క ర ణ ము

### అశ్రాంతజ్వరప్రకరప్రారంభము

జలదోషాన్మనుష్యాణా మామవృద్ధిః ప్రజాయతే,
ఆమాధిక్యేన మందాగ్నిః మందేనాజీర్ణసంభవః.
అజీర్ణేన జ్వరోత్పత్తి ర్జ్వరాంతే ధాతునష్టకం,
ధాతునష్టేసర్వరోగాః జన్యంతే చోత్తరోత్తరమ్.
ఆమాశయేనాహతాగ్నిః సామం మార్గం విధాయచ,
విదధాతి జ్వరాందోషాం తస్మాత్కుర్వీత లంఘనమ్.

తా. ఉదకదోషమువలన జనులకు ఆమవృద్ధిఁగలుగుట, ఆఆమాతిశయమున మందాగ్నిగలుగుట, అట్టిమందాగ్నివలన నజీర్ణముసంభవించుట, ఆయజీర్ణమువలన జ్వరము వచ్చుట, తజ్జ్వరమువలన ధాతువులు నశించుట, ధాతునాశమువలన సమస్తరోగముల కారకమైయుండుట, ఆమకోశమందు ఆమము చేరి అగ్ని నశించి జ్వరములను దోషములనుగాఁజేయును. కాబట్టి లంఘనము చేయునది.

శరీరమం దేమితప్పినను జ్వరము రాకమానదు. జలుబు మొదలైన నానావిధరోగములందును జ్వరము గలుగును. ఎప్పుడు తత్వము, స్వభావధర్మమునువదలి ప్రతికూలముగ నుండునపుడు అది జ్వరపూర్వభాగచిహ్నముగా నెంచవలెను.

ప్రారంభమున నేవిధజ్వరముగ నెఱుగుట మహాదుస్తరము. మూఁడువిధములైన మశూచికాజ్వరములనియు, సాహికాశ్రాంతసన్నిపాతములనియు, గాఢసామాన్యజ్వరములనియు నెఱుంగుట దుర్లభము. ఏపట్టణమున నేకాలంబున నేవిధముగ వ్యాపకమైనదియో, తెలిసినతర్వాత అదిగా నెంచవచ్చునుగాని, ఆదియందే తెలిసికొనుటకు సాధ్యముగాకుండును. కొన్నిగుర్తులువ్రాసినను నొకప్పుడు తెలియకపోవును.

### జ్వరవిభాగములు

ఒకదినముగడచి నాటలమ్మగాదనియు, మూఁడురోజులు గడచిన తట్టమ్మవారుగాదనియు, అయిదుదివసములుగడచిన పెద్దమ్మవారు కాదనియుఁ దెలియవలయును.

మఱియు రెండురోజులు గడచిన సాహికజ్వరముగాదనియు, మూఁడవదినముగడచిన సామాన్యజ్వరముగాదనియు, అటుపిమ్మట అశ్రాంతజ్వరమనియు, రెండవవారము అనగా ౧౪ దివసములుగడచిన సన్నిపాతముగాదనియు, మూఁడువారములుగడచిన పురాణజ్వరమనియు నెఱుంగవలయును.

ఫలానాజ్వరమని గుర్తెఱుఁగువరకు పైవిధములుగ గమనించుచుండవలెను. ఫలానిదని తెలిసినపిమ్మట అది సామాన్యతీక్ష్ణములుగా నీ త్రివిధజ్వరములం దేనిలో వ్యాపించుచుండునదియు నెఱుంగవలయును.

### జ్వరస్వరూపము

జ్వరస్త్వేవం త్రిదోషజః.

వాతాదిదోషత్రయైకీభావమే జ్వరమనబడును. అది కారణతత్వభేదములు రోగములననుసరించి తత్తద్బలాతిశయములతో సంక్రమించి పలుతెఱగులలక్షణములచే సాహికాశ్రాంతసన్నిపాత త్రివిధరూపములుగాఁ బరిణమిల్లును.

## అశ్రాంతాహికజ్వరములకు భేదములు

ఎల్లపుడు విడువకుండునది యశ్రాంతజ్వరమని పెద్దలు చెప్పుచున్నారు.
ఉదయమున జ్వరము తగ్గుస్వభావమునందును నసౌఖ్యముగనుండుట, అనగా
జ్వరమువదలినను గొంతజ్వరము లక్షణసహితముగ నిలబడియుండుట, బహి
ర్వ్యాపకకాలంబులందువలె నంతర్వ్యాపకకాలంబున లక్షణవిశేషములు లేకు
న్నను దానికితగినట్టు లక్షణము వెంబడించి యశక్తతతో నాయాసముతో
నుండుట, జ్వరమువిడిచి తిరిగివచ్చువరకు సాహికజ్వరమునందువలె విడనాడక
నెమ్మదిలేకయుండుట, బహిర్గతాంతర్గతభేదములతోఁ గూడకయుండుట, అహో
రాత్రింబగళ్లు బొత్తిగా విడువదనిగాదు స్వేదస్రావాస్రావములచే బహిర్గత
జ్వరము అందు లక్షణములు పరిష్కారములుగా విముక్తమునై తిరిగి పైకి
వ్యాపించువరకు సాహికజ్వరమునందువలె నారోగ్యముగ నుండునట్టు లీయ
శ్రాంతజ్వరమందు లేకయుండుట, అశ్రాంతజ్వరవ్యాపకకాలమునిడివిగాను విడుపు
కాలము తక్కువగాను నుండును. మఱియు సాహికజ్వరమునందువలె నాది
మధ్యాంతావస్థలయందలి గుణభేదములు దెలియరాకయుండుట ఇవియే
యశ్రాంతజ్వరమునకు సాహికజ్వరమునకుఁ గలభేదములుగా నెంచవలెను. దీని
యం దంతర్భూతములయినజ్వరములు వ్రాయబడుచున్నవి.

## సామాన్యజ్వరము

ఈసామాన్యజ్వరము త్రివిధజ్వరప్రారంభవేళలందుగలిగి తర్వాతఁ దీక్ష్ణ
విషములలోఁ జేరును. సామాన్యజ్వరము వచ్చినవేళకు విడుచును. అనగా ఎనిమి
దవయామము మొదలుకొని మూఁడురోజులలో నివర్తియగును. ఎంతస్వల్పజ్వర
మైనను లక్షణవిహీనముగ నుండజాలదు. అది ప్రారంభమున కొద్దిచలితో నుం
డుట, శిరోవేదన, నిస్త్రాణగానుండుట, మెడయు నవయవములునొచ్చుట,
యాకలిలేకుండుట, నాడీవేగము, చర్మము నుడుకు, జలుబు, నావలింతలు,
నోడలు విఱుపు మఱుపులుగనుండుట ఈమొదలైనగుర్తులు జ్వరము లక్షి

టిలో సహజముగఁ గలిగి యుండును. మిగులం జలి తగులుటవలనను, దడివలనను సూర్యకాంతి తీక్ష్ణప్రసారము వలనను జనించును. ౧౦౨ డిగ్రీలకు మించకుండును. వచ్చినజ్వరము విడిచిన తిరిగి వచ్చుట లేదు. కొందఱకుఁ బ్రథమదినమున హెచ్చుగవచ్చినయెడల, ద్వితీయదినమున దానిలో నర్ధజ్వరము వచ్చును. తృతీయమున నంతకంటె స్వల్పముగ వచ్చినను వచ్చును లేక రాక పోయినను బోవును. ఇది జ్వరము విగుక్రమము. జ్వరము నివృత్తమయినను దత్కారణమయినఁ ద్రివిధములయిన మలరోచకములు: శీతలము దగ్గు జలుబు నిలిచియుండి దినక్రమముగ హరించును. అట్టులే చెవిక్రింది గాలిబిళ్లలు లేక, నెదురుకుత్తుక వాపు గొంతుపుండు నీమొదలైనవి జనించి జ్వరవిముక్తమైనను శేషించి, తర్వాత దినక్రమముగ హరించును. ఈసామాన్యజ్వరమునఁ ద్రివిధములైన మలరోచికలు మిశ్రితములై జ్వరవిముక్తితోనె గుర్తులుగా గానవచ్చును. ఈసామాన్యజ్వరము తటస్థమైనతోడనే పనిమాని యూరకుండి మలబద్ధకమును వదలించి క్రమమయిన పథ్యపానములఁగనుండి స్వల్పౌషధమును సేవించిన'ట్లైన యాజ్వరము నివృత్తమగును.

మూఁడుదినములు మీరగానే యసాధారణజ్వరముగా నెంచవలెను. అది యేఁడవరోజువరకుగాని ౯, ౧౪ రోజులవరకుగాని కాయును. అంతవరకు జ్వరలోపము గలుగనియెడల నందు రోగములుసంక్రమించియుండుటచేగాని, గర్భస్థదోష మెంత గాఢముయినందువలనగాని, పురాణమై గాలాతీతముగఁ గడపును. కాలానుగుణముగ నుదయకాలమున తగ్గుగనుండునట్లు కొంతసేపుండును గాని, వెంబడిగనే భానుం డెక్కివచ్చినట్టుగా జ్వరము క్రమముగా నెక్కుచుండును. మొదటివారాంతమున ౧౦౪ నుండి ౧౦౫ డిగ్రీలవరకు టెంపరేచరుడును. జ్వరము దిగుటలో ౧౦౨ డిగ్రీలకుండును. ఈప్రకారము జ్వరము మధ్యాహ్నమునకువచ్చుట, నుదయకాలమున వదలుట ఒకనాఁడు యథాస్థితిగాను నొకనాఁడు తక్కువగాను గాయుచుండును. గర్భస్థదోషము తానెంత సులభవిషముగ నాశ్రయించియుండునో, యంత సులభతీక్ష్ణజ్వరములుగా నేర్పడి తత్త్వ

భేదానుగుణలక్షణసహాయములతో దినములంగడవునుగాని, యిన్ని దినముల జ్వర మని నిర్ధారణగ నుండజాలదు. ఇట్లు వ్యాపించుటకు జీర్ణాశయము వికలమగుట-వలనను వాతాదులయొక్క బలాబలములచే జీర్ణాశయము శక్తిహీనమై దిన క్రమముగఁ జెడుటవలలనను జీర్ణింపఁజేయుశక్తి యుష్ణమందేగాని శైత్యమందు లేదు. అట్టిదోషము హరించుదనుక వేధించును. వాతాదిదోషముల బలిమి లేనప్పుడు సాధారణజ్వరముగాను, వాతాదులు మిశ్రమైనప్పుడశ్రాంతజ్వరము గాఢముగాను, విషమముగనుండునపుడు సన్నిపాతజ్వరముగాను సంభవించును.

## జ్వరవార క్రమము

అతఃపరం ప్రవక్ష్యామి జ్వరవార ప్రమాణకం,
సప్తరాత్రం వాతకేచ షడ్రాత్రం పైత్తికే జ్వరే.
నవరాత్రం కఫేచైవ ద్వంద్వజే దశరాత్రకం,
జ్వరపాకో భవేదత్ర హ్యత ఊర్ధ్వం జ్వరం హరేత్.

వాతజ్వరమునకు ౭ దివసములు, పైత్యజ్వరమునకు ౬ దివసములు, శ్లేష్మజ్వరమునకు ౯ దివసములు, ద్వంద్వజ్వరమునకు ౧౦ దివసములు ఈ ప్రమాణము చొప్పున జ్వరము పక్వమై విడుచును. ఈకాలము నతిక్రమించి జ్వరమువిడువకుండిన పురాణజ్వరచికిత్సఁ జేయవలెను. జ్వరములోఁగలుగు లక్షణములంబట్టి ఆయానామంబుల వచించెదరు.

## అశ్రాంతజ్వరప్రారంభలక్షణము

జ్వరములన్నియు నతిశీతోష్ణమువలనఁ గలుగును. తొలుత చలితో ప్రారంభించును. ఆహికజ్వరప్రారంభదశయందుగల చలివలె నుండుటలేదు. దీనియందు గప్పుకొనవలసినంత చల్లగానుండును. అప్పుడు కన్నులనీరుగారుట, ఆవలింతలు, నొడలువిరుచుట, ప్రాలుమాలిక, వైవర్ణ్యము, నొండయందిష్టము, శిరోవేదన యివి చలిగానరాకున్నను పైలక్షణములు మాత్రము గలిగియుండును.

నాడియందు బలహీనముగనుండును. ప్రారంభకాలంబున సులభమార్గముగఁ గన పడును. రెండవకాలంబున అనఁగా జ్వరోష్ణకాలంబునం గడుసంతాపయుక్త ముగ నుండును.

## అశ్రాంతజ్వరోష్ణస్వరూపలక్షణములు

ఉష్ణము, మిగుల తలనొప్పి, చర్మము నుదుకెక్కువగుట, నాడీవేగము సంతాపముగనుండుట, నాలుకగోధుమరంగువలెఁ దెల్లగానుండుట, పెదవులెండుట, అవి పుండ్లగుట, దప్పి గలుగుట, కడునీరసముగ నుండుట, యేమియుఁ దోచకుండుట, ఆకలి లేకుండుట, గుండెగొట్టుకొనుట, నోరుచేదుగనుండుట లేక నోరెండుట, నోరారుచ్చుకొని యెంగిలిరాక గట్టిపడివచ్చుట, మలబద్ధకము, విరోచనములగుట, ముఖ మెఱ్ఱగానుండుట, సరియైననిద్ర లేకుండుట, కలవరించుట, నాలుక తెల్లనై బీట్లుపడియుండుట, కడుపునొప్పికలుగుట, ఏలిక పాములుగలుగుట, పచ్చని పసరు వాంతియగుట, వమనమగుట, మూలుగుట, తనంతట తిరుగులాడుటకు శక్తిహీనముగనుండుట, జనాభుజెప్పుటకు సహించక యుండుట, యొడలు తిరుగుట, తలదిరుగుట, క్రమముగ నాకలి తగ్గుచుండుట, క్రమముగ శక్తిహీనమగుట, ముఖము తెలుపువారుట, నాలుక నీలవర్ణమగుట, నాలుకపగలుట సాధ్యజ్వరములందు ౧౦౫ డిగ్రీలకు మీదపోజాలదు. నాడి మీట్లు ౧౨౦ పైగానుండదు. ఈజ్వర మేడుదివసములకు దగ్గునట్లు గలుగును. రెండవవారము ప్రారంభములో నరచేతులందు గడుపునందు రొమ్మునందు మచ్చలుగలుగును. ఉదయకాలంబున జ్వరము విడుచుట, మధ్యాహ్నకాలంబున హెచ్చికొని వచ్చుచుండుట సాధ్యజ్వరము. తీక్ష్ణముగ తిరుగునపుడు జ్వరమెక్కుట, యుదయమున నధిక మగుట, యసాధ్యలక్షణ సహాయములు మిశ్రమగుట, యివి యసాధ్యజ్వర లక్షణములు. సాధ్యాసాధ్యలక్షణములం జూడఁగ నివి స్పష్టముగ దెలియగలవు.

మఱియు జ్వరప్రకోపకాలంబున నాడిస్థూలమై వేగమయిన గతి గలిగియుండుట, జ్వరము తగ్గుసమయమున నాడి సూక్ష్మమై వేగగతిగలిగి

యుండును. అదిగాక ఒకనిమిషమునకు ౭౦ మొట్లు గలిగియుండుట, నారోగ్యముగ నుండువారికంటె వేగగతిఁ గలిగియుండుట, జ్వరముగాను, తగ్గియుండుట బలహీనమయిన వాతరోగముగాను గ్రహించవలెను. ఈజ్వరము కొంతకాలమైనపిదప అనగా పదిరెండుదినములమీద నపాయకరమైన గుర్తులు గనుబడును. లేక సన్నిపాతజ్వరములోఁ జేరును.

## దుర్గుణములు

త్రివిధజ్వరములందు నాలుక నలుపుగలుగుట, పగులుట, ఉబ్బసము గలుగుట, మలమూత్రములు బంధించుట, కడుహృదయవేదన, అణచుకొనుట, మంటగలుగుట, కడుపునొప్పి, విరేచములగుట, కడుపుబ్బరము, పూర్తిగా నిద్రాహారములు లేకుండుట, తీవ్రజ్వరము, దీర్ఘశ్వాసము ఈలక్షణము నొక్కొక్కటిగలదైనను దుర్గుణముగలదిగా నెంచవలెను.

మఱియు నిట్లుదహరించిన లక్షణములన్నియు నొకేసమయమున నుండుననిగాని, యిందులో నున్నగుణములేగాని వేరుండవనిగాని లేదు. అవి దేశకాలతత్వస్వభావభేదముల ననుసరించి వేరుగుణములుగా నుండును.

మఱియు నంతర్గతజ్వరమనియు బహిర్గతజ్వరమనియుఁ, రెండువిధముల నుండును. జ్వరలక్షణములు సూక్ష్మముగ లేక, సులభముగ నుండునపుడు అంతర్గతజ్వరమనియుఁ; జ్వరప్రతాపలక్షణయుక్తముగను వేదనయుక్తముగ నుండునపుడు బహిర్వ్యాపకజ్వరమనియు, నెఱుంగవలయును. ఈబహిరంతర్గతములు గర్భస్థదోషము హరించునంతవరకు రాకపోకలుగా దినములం గడపును.

జ్వరములు వాతపైత్యశ్లేష్మదోషైకజనితములై ద్వంద్వసన్నిపాతభేదలక్షణములచే భిన్నస్వరూపులుగా నేర్పడియుండును. దాని జ్వరముగా గ్రహించవలెను. దేశకాలతత్వభేదముల లక్షణము లనేకములైనను జ్వరభేదము లీమూంటికంటె వేరులేవు.

వైద్యకల్ప—

## స్వేదగుణము

స్వేదము చేలి రెండును స్పష్టముగ గానరాక యంతర్భూతములై యుండును. అంతేగాని యాహికజ్వరమునందువలె జ్వరాదియందు చలిగలుగుట, అంతమున స్వేదముగలుగుట, యీయశ్రాంతజ్వరమున కవి గానకుండును.

## బాలజ్వరలక్షణములు

ఈ అశ్రాంతజ్వరము చిన్నపిల్లలయందు సర్వసాధారణముగవ్యాపించుట గలదు. ఆహికజ్వరము లంతగా చిన్నపిల్లలయందుఁ గలుగకుండును. శిశువులకు స్తన్యదోషమువలన రోగములు గలుగును. అటుగాక తల్లియొక్క గర్భస్థదోషములవలన కడుగాఢముగ రోగముగలిగి పలువిధములుగ రోగపుమార్పులు గలుగును. ముఖ్యముగ జలుబు, దగ్గు, నుబ్బసము, నాలుక తెలుపు, మలబద్ధము, జ్వరము ఇవిగలుగును.

వైలక్షణములు త్రివిధమశరాచికములందు గలుగును. మశరాచికము పిల్లలయందు తరుచుగాఁ గలుగును. దీర్ఘాచిరోగము వయస్సు వారికిఁ గలుగును. దీనికి వ్యతిరేకముగ హెచ్చైనవ్యాపకములో నుండును.

మఱియు నాహారాతిశయమువలన నజీర్ణమై పెక్కురోగములు గలుగుచుండును. పిల్లలకు నతిసులభముగ రోగములు గలుగుచుండును. శీతోష్ణముల స్వల్పహేతువులంబట్టి రుజములం బొందుదురు.

జ్వరము దగ్గు జలుబు నోకిరింత వమనము కఫము నుబ్బసము జడత్వము విరేచనము మలబంధనము నిద్రలేకుండుట యెమిడికలుండుట కడుపుబ్బరము అగ్నిమాంద్యము వాతముగలుగుట ఈగుణములు సర్వసాధారణముగ నుండును. వైలక్షణములు సూక్ష్మముగ నుండునది సులభముగాను, గాఢముగనుండునది ప్రబలమైనదిగాను, ఉపద్రవకరముగ నుండునది యసాధ్యరోగముగాను గ్రహించవలెను. దీనికన్నను అనేకరోగములు గలుగును. పెద్దవారికివలెనే పిల్లలకును విషగుణములును అసాధ్యగుణములుగా గ్రహించవలెను.

జ్వరము లేకుండు నేరుజమ్ముగు దినముల పేరటగాని, యప్పుడే గాని సాధ్యమగును. పై గుర్తులన్నియు నొకేతూరిగా నుండరాదు. సాధ్యాసాధ్య ములనొకటాజూడగా దెలియును. వాతపైత్యశ్లేష్మజ్వరలక్షణములలో దేని కను గుణముగ నుండునో దాని జ్వరమని నిర్ధారణఁజేయవలెను.

మఱియు నీజ్వరము దీర్ఘకాలముగాను అప్పుడు పిల్లలయందు జ్వరము దిగకయుండుటంబట్టి భేదము గానవలెను. నోరుకంపు, చాలుక తెలుపు, విదా హము ఇవిగలపిల్లలకు ముసరజ్వరమనియు దోష్మజ్వరమనియుం బచించెదరు. ఇది సామాన్యముగా నసాధ్యము గాకుండును. తరుణకాలమున గర్భాంతరాశయ ముల రోగములు సంక్రమించునపుడును, పురాణకాలమున కాసశ్వాసశోభాతి సారములు గూడునపు డసాధ్యముగ నెఱుంగవలెను.

## అక్రాంతజ్వరమునం దంతర్భూతజ్వర భేదములు

### వాతజ్వరలక్షణములు

రోమహర్షశ్చ సర్వాంగే లలాటే భ్రువి నేత్రయోః,
కఫాలకర్ణయో శ్శూలం జడత్వం వేదనం సదా,
మందాగ్నిర్మలబద్ధంచ శీతం శీతలతా రుచిః,
సన్తాపః కరపాదేచ వాతజ్వరసముద్భవే.

సర్వాంగమునందు గగుర్పాటు, నొసలు కనుబొమలు కన్నులు కపో లము చెవులు వీనియందుశూల, జడత్వము, సదావేదన, అగ్నిమాంద్యము, మల బద్ధము, చలి, జలుబు, అరుచి, కాలు సేతులందు సన్తాపము ఇట్టిలక్షణములు గలది వాతజ్వరమని యెఱుంగవలయును.

### పైత్యజ్వరలక్షణము

జ్వరో దారుణదాహశ్చ ప్రలాపో బహువేదనా,
శిరోక్షివేదనా కంపో హ్యనిద్రా సత్వహీనతా.

ఉద్గారో వమనం హిక్కా శిరోభ్రమణసారకం,
ప్రజాపీడనపాపాచ్చ పైత్యజ్వరసముద్భవః.

జ్వరము, విశేషదాహము, వదరుట, బహువేదన, శిరస్సు నేత్రములు మీనియందునొప్పి, వణకు, నిద్రలేకయుండుట, బలహీనము, నోకిరింత, వమనము, ఎక్కిళ్లు, తలవణకు, మత్తత ఇట్టిలక్షణములుగలది పైత్యజ్వరమని యెఱుంగవలయును.

## శ్లేష్మజ్వరలక్షణము

జ్వరశ్శీతం శిరోభారః కాసశ్శ్వాసకఫా స్తథా,
సర్వసంధిషు శూలంచ శీతలం మూర్ధ్ని వేదనా.
జడత్వం సర్వగాత్రాణా ముద్గారో వమనం సదా,
ఆనాహాసు ప్తిహానిశ్చ మందాగ్ని ర్మలబద్ధకమ్.
ప్రజాక్షోభమహాపాపా చ్ఛ్లేష్మజ్వరసముద్భవః,

జ్వరము, చేలి, శిరోభారము, దగ్గు, ఉబ్బసము, కఫము, సర్వసంధులయందుశూల, జలుబు, తలనొప్పి, సర్వావయవములు జడముగనుండుటయు, నోకిరింత, వమనము, మలమూత్రబంధనము, నిద్రలేకయుండుట, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము నిట్టిలక్షణములుగలది శ్లేష్మజ్వరముగా నెఱుంగవలయును.

## వాత పైత్య జ్వర లక్షణము

సర్వాంగే వేదనా కంప శ్శిరశ్శూలంచ దారుణం,
ఉద్గారో వమనం శీతం ప్రలాపో బహుభాషణమ్,
స్వేదో దాహ స్త్వనిద్రాచ జిహ్వావదనకంటకా,
శోషో మూర్ధాశ్రమశ్చైవ మందాగ్ని ర్మలబద్ధకమ్.
స్రావశ్చ నేత్రతోయస్య జానుజంఘాతివేదనా,
ప్రజాక్షోభమహాపాపా ద్వాతపైత్యజ్వరోద్భవః.

సర్వావయవములందు నొప్పి, వణకు, దారుణమగు తలపోటు, ఓకరింత, వాంతి, చలి, కలవరించుట, మిక్కిలి మాటలాడుట, చెమట, దాహము నిద్రలేకయుండుట, నాలుక నోరు ముల్లువారియుండుట, శోషము, మూర్ఛ, శ్రమ, అగ్నిమాంద్యము, మలబద్ధము, కన్నుల నీరుగారుట, మోకాళ్లు పిక్కలు నివినొచ్చుట ఇట్టిలక్షణములుగలది వాతపైత్యజ్వరముగా తెలియంగ వలయును.

### వాతశ్లేష్మజ్వరలక్షణము

సర్వాంగం శిథిలం కంప శ్శిరోక్షస్యుత్కట శూలకం,
మందాగ్ని ర్మలశోషశ్చ శ్వాసశ్లేష్మా జ్వర స్తథా.
వదనం మధురం స్వేద ఆనాహ స్సుప్తిశూన్యతా,
లలాటే భ్రువి నేత్రే చ కపాలే కర్ణయో రుజా.
ప్రలాపో బహుభాషిత్వం ప్రజాతో భసముద్భవం
వాతశ్లేష్మజ్వరం ప్రాహు స్తరుణాం త్రిదినం భవేత్.

సర్వావయవములు వదలుగనుండుట, వణకు, శిరస్సు కన్నులు వీని యందు విశేషశూల, అగ్నిమాంద్యము, మలము శుష్కించుట, శ్వాస శ్లేష్మము జ్వరము, నోరుతియ్యగనుండుట, చెమట, కడుపుబ్బరము, నిద్రలేక యుండుట, లలాటము కనుబొమలు కన్నులు కపాలముచెవులు వీనియందలి పోట్లు, కలవరించుట, విశేషముగ మాటలాడుట ఇట్టిలక్షణములుగలది వాత శ్లేష్మజ్వరముగా తెలియంగవలయును.

### పైత్యశ్లేష్మజ్వరలక్షణము

జ్వరో దాహణ ఉద్గారో వమనం శోషమూర్ఛితం,
దాహః కంటకజిహ్వాత్వ మనిద్రా శ్వాసకాసకాః.
కఫోద్ధృతి స్తథాధ్మానం శిరస్స్వేద స్తథాతిః

తోయం ప్రవతి శీతంచ శీతలం స్వేద ఉత్కటః.
ప్రజాతోభ మహాపాపాత్ పైత్యశ్లేష్మజ్వరోద్భవః.

భయంకరమగు జ్వరము ఓకిరింత వాంతి శోష మూర్ఛ దాహము నాలుక ముల్లుబారియుండుట నిద్రలేకయుండుట ఉబ్బసము దగ్గు మిక్కిలి కఫము కడుపుబ్బరము శిరోవేదన కన్నులనీరుగారుట శీతలము జలుబు మిక్కిలిచెమట యిట్టిలక్షణములుగలది పైత్యశ్లేష్మజ్వరముగా తెలియంగవలెను.

వాతపైత్యశ్లేష్మజ్వర లక్షణము

సర్వాంగం శిథిలం కంప శ్శిరోరుగ్వేదనాక్షిణీ,
హిధ్మాహిక్క శిరః కంప స్తంద్రాశోషః ప్రలాపకః.
హీనస్వర శ్చాతిసార ఉద్గారో వమనం సదా,
శ్వాస మూర్ఛాకఫాలేచ కర్ణే నాద శ్శ్రమస్సదా.
కరపాదద్వయో స్తత్యం స్వేదః కంఠే పిపాసుతా,
జిహ్వాకంటకశోషౌ చ పూర్వజన్మకృతా త్తథా.
ప్రజాతోభమహాపాపా ద్వాతపైత్యకఫా స్తథా,

సర్వాంగశైథిల్యము కంపము తలనొప్పి కన్నులనొప్పి హిధ్మ ఎక్కిళ్ళ తలవణకు తంద్ర శోష వదరుట హీనస్వరము అతిసారము ఓకిరింత వాంతి శ్వాస మూర్ఛ కఫాలము చెవులు వీనియందు నాదము, శ్రమ, కరములు పాదములు కంఠము వీనియందు సర్వదా చెమట, దప్పి నాలుకముల్లుబారి యుండుట ఇట్టిలక్షణములుగలది వాతపైత్యశ్లేష్మజ్వరముగా తెలియంగవలయును.

జ్వరాదులభేద వివరము

జ్వరము త్రిదోషస్వరూపమైనను వాతాధిక్యముచే వాతజ్వరమనియు, పిత్తాధిక్యముచే పిత్తజ్వరమనియు, శ్లేష్మాధిక్యముచే శ్లేష్మజ్వరమనియు, వాతపైత్యము వాతశ్లేష్మము పైత్యశ్లేష్మము నొకటి కొకటి మిశ్రమైనది ద్వంద్వ

దోషమనియు, మూఁడునుగూడినది త్రిదోషమనియు వ్యవహరింపఁబడును. వాత పైత్యశ్లేష్మదోషములు ఏక ద్వి త్రిదోషములుగా నాయాలక్షణాశ్రితములై వాని నామంబునఁ బరగుచుండును.

మఱియు వాతాదులు సెట్లు సులభగాఢములుగ గర్భము నాశ్రయించి యుండునో యట్లు జ్వరముయొక్క సమవిషమతీక్ష్ణత్వములు వానియందలి లక్షణములును అంతరాశయమునందుఁ గలుగునట్టిరోగముల బలాబలముల ననుస రించి ప్రకోపించుచుండునట్టివానిని సాధ్యాసాధ్యకష్టసాధ్యము లివియని నిరూ పించవలెను. అవి యెన్నిధ్యైనను నీత్రివిధజ్వరములలోఁ జేరినవిగా నెంచవలెను.

## తత్వవిషయము

వాతతత్వము పైత్యతత్వము శ్లేష్మతత్వము వాతపైత్యతత్వము వాతశ్లేష్మ తత్వము పైత్యశ్లేష్మతత్వము వాతపైత్యశ్లేష్మతత్వము అని యిటుల నేడుతత్వ ములుగాఁ జెప్పుదురు.

మఱియుఁ బైత్యతత్వముగలవారికి వాతజ్వరముగాను, వాతతత్వముగల వారికిఁ బైత్యజ్వరముగాను, శ్లేష్మతత్వముగలవారికి వాతజ్వరముగాను గాయు నపుడు జ్వరదోష మొకమార్గముగాను, వానిలో రోగదోషము వేరుమార్గము గాను నుండును. వానిని ద్వంద్వమార్గముగ నెఱుంగవలయును.

అదిగాక పైత్యశరీరముగలవారికి బైత్యజ్వరముగాను, వాతతత్వముగల వారికి వాతజ్వరముగాను, శ్లేష్మతత్వముగలవారికి శ్లేష్మజ్వరముగాను, వానిలో గలుగుగుర్తులు రోగాదులు తదనుగుణ్యముగాను సంధిల్లువాని నేకజనితముగా నెఱుంగవలయును.

తత్వస్వభావము మేహజాతిగాని మరియేజాతిగాని యుండుచో నాజాతి కనుగుణములుగానే వాతాదిదోషస్వరూపములయిన జ్వరములును రోగములును పరిణమించును.

బాల్యముమొదలుగ ఉబ్బసము వ్రణము కాసము లోనగురోగములచే పీడితుడైనవాని రక్తాదిధాతువులు హీనముగానుండును. అట్టితత్వము వానికి గాఢమైనరోగము వ్రణము సంభవించినచో నసాధ్యముగా నెఱుంగునది.

### గ్రంథస్థజ్వరవిచారము

మఱియుం జ్వరము ౬౪ విధములు. మహాజ్వరములును, త్రయోదశసన్నిపాతములును, సప్తవిధదోషములును మఱిపలుజాతులు గలవనియుఁ జెప్పియున్నారు. జ్వరములో గలుగునట్టి నానావిధములైన గుణాతిశయములంబట్టి నామములుంచిరేగాని జ్వరభేదము లుండునట్లు లేదు. అట్టిలక్షణయుక్తములయిన జ్వరములన్నియు నిందుజెప్పిన త్రివిధజ్వరములలోఁ జేరినవిగాఁ దెలియవలయును.

అటుగాక ప్రతిమనుజునికి దేశదేశమునకు నొక్కొకవిధమగుజ్వరమని చెప్పవలసివచ్చును. అటుగాదేని కారణమునుబట్టి యనగా, పెరుగన్నము భుజించినవానికి దధిజ్వరమన్నట్లు, ఏవస్తువుభుజించిన వానిజ్వరమును నానామంబున గదా! బేర్కొనవలెను లేక జ్వరములో గలుగునట్టి లక్షణము లనగా తలనొప్పి, కుక్షివేదన గలదానిని శిరోవేధజ్వరమనియైనను జెప్పవలెను. జ్వరోత్పత్తికారణములును వానిలోగలుగులక్షణములును జ్వరములయ్యెడుపక్షమునకు లెక్కలేనివిగా నుండవలెను. లక్షణయుక్తములతో జ్వరభేదము గలిగియుండుట సరియే గాని, శుద్ధకారణములు శుద్ధలక్షణములు నెట్లు జ్వరాదులగును.

లక్షణములనుబట్టి జ్వరములనిచెప్పుట జ్వరవిముక్తికాలాంతమువరకు ఆలక్షణ ముండుటలేదు. కావున బహులక్షణాశ్రితములుగల జ్వరము సామాన్యగాఢవిషభేదముల నెంచి, సాధ్యాసాధ్యకష్టసాధ్యముల గుర్తులతో గ్రహించవలెను.

### జ్వరలక్షణాంశములు

ఈజ్వరప్రారంభమున నొకవిధముగాను, బురాణమున మఱియొకవిధముగాను నుండును. అప్పుడు నూతనములయిన గుణములు గలుగుటయును, మధ్య

మధ్యజ్వరము వృద్ధియగుటకును, నపథ్యాదికృత్యములచేత తరుణజ్వరము పురాణజ్వరముగాను పురాణము తరుణముగాను మాఱును. ఇట్లు జ్వరమునందుఁ గల గాఢము ననుసరించి గలుగుచుండును. మఱియు ప్రథమంబునగలిగిన స్థానంబున కనుగుణ్యములైనగుణములతో ధాతువులలో నొకధాతువునుంచి, యొకదానికి సంక్రమించునపుడు లక్షణములు ఉత్తరోత్తరముగా నూతనలక్షణములుం గలుగుటగాని, పూర్వపుగుణము లాధిక్యమగుచు, సులభగాఢవిషమత్వములను వరుసగాఁ గొని వ్యాపించుచుండును. ఎల్లతెగుళ్ళను జ్వరములు భూతములుం ధాతువులను జెఱచుటకై యఖిలబాధలను బొందజేయును. దానిని రోగముగా నెంచవలెను. శరీరబాహ్యాంతరాశయముల నొప్పిగలుగుట, రోగముగలుగుట, యాయాశయముల కేదో వైకల్యముగలిగినట్టు సూచించుచున్నది. ప్రపంచ బాహ్యాన్యాపారములును జ్ఞానేంద్రియద్వారములుగా నాత్మకుఁదెలియునట్లు, మనకుఁగలిగిననొప్పి మెఱుపుతీగెలవంటిజ్ఞాననాడులద్వారములుగ తెలియవచ్చుచున్నవి. తద్రోగమున కాకరమైన వాతాదిదోషప్రకోపములవలన నవయవములందు నొప్పి వాపు నీరు ఉష్ణము గలుగును. తద్వారముగ నంగము వికలత్వము నెంది పైనాలుగువిధములు నఖిలరోగభేదములం గలుగును. వాతాదిజ్వరములందుగలలక్షణములు బాహ్యాంతరాశయ సంబంధములై స్థూలసూక్ష్మములతో వానివానిపని మందవేగముల జవలాఘవములుడిగి శిథిలపరచెడునవిగా నెఱుంగవలయును.

మఱియు సర్వేంద్రియ సర్వావయవముల రక్తవ్యాపకా టంకాభిఘాతాదులవలనగాని, వాతాదులవలనగాని, యేయంగమునందు సంక్రమించునో యది రోగమును బొందును. తద్విషమ్మును అలస్యానాలస్యములుగా తత్స్థానమును జెఱుపును. జ్వరమను నింగలమునకు గారణమను ననిలంబు సహాయముతో ప్రజ్వలమై నానావిధలక్షణములతోఁ దరుణపురాణకాలములం దపింపజేయును.

## బాహ్యాంతరాశయముల విచారము

మఱియుం గర్భమునం దాశయములు చెడుటవలన జ్వరములకు నఖిల వ్యాధులకు నుత్పత్తిస్థానములు వైయంతరాశయముల సంబంధములంబట్టి బాహ్యాదికాంగములు రోగపీడితమగును.

గర్భస్థమైన దోషము తత్స్థానము వికారముజెంది బాహ్యమున ధాతువులు సిరలు కండరములు భూతములు రోగపీడితమై, కడుభంగులం గానంబడును. అదిగాక బాహ్యవ్యాపారంబున నొకయంగము గాయమైనప్పుడు గాని వాతాదులచేఁ బీడితమైనప్పుడుగాని విపరీతకాలంబునఁ దత్స్థానముచెడి తద్విషము తను వెల్లనిండి తుదకు నంతరాశయములకు బోవును. అది ధాతువులద్వారా వరుసగా వ్యాపించునపు డసాధ్యములుగా నెఱుంగవలయును.

అఖిలరోగములు ప్రతివారిశరీరధర్మమునుబట్టి వ్యాపించుట యనుభవసిద్ధముగ నున్నది. గోపిత్తస్థానమున గోరోచన ముత్పన్నమగునట్లు రోగములు మనయకృత్యముల నెదురుచూచుచుండును. తద్వారా రోగములు గలుగుచుండును.

మఱియుం గార్యకారణములు కాకరములైన యపచారాదికృత్యములును, వానిచే రోగోత్పత్తియును, దత్ప్రముఖంబులైన వాతాదులకు సకలవిధసంచారానుకూల్యమును గొని కొంతకాలము పైత్యముగాను, గొంతకాలము వాతముగాను, గొంతకాలము శ్లేష్మముగాను, మఱియు నేక ద్వి త్రి దోషయుక్తముగ బహుప్రకారములుగాను, నొకరోగియందు నొకటితో నొకటి మార్చుకొనుచు, చిరకాలము వేదనబొందజేయును.

## శారీరవిషయము

తనుశ్శరీరమిత్యాది నామ్నా మన్వర్థతా స్మృతా,
ద్విసప్తతిసహస్రాంత్ర మష్టకోటివిలోకనం,
సప్తధాతుసమాయుక్తం శరీరం పాంచభౌతికమ్.

పంచవింశతితత్త్వాఢ్యం షట్కోశం నవరంధ్రికం,
షణ్ణవత్యంగుళాయామం రోగభోగాలయం వపుః.

ఆహారముచే విస్తరింపబడునదిగావున తనువనియు, నశించునదిగావున శరీరమనియు, పేరుగలిగినదేహము ౭౨ వేల నరములు, ౧ కోట్ల వెండ్రుకలు, చర్మము మాంసము మేదస్సు రక్తము మజ్జయు స్నాయువు సెముకలు అను ౭ ధాతువులు, పృథివ్యప్తేజోవాయురాకాశరూపమైనపంచభూతములు, అవ్యక్తాది ౨౫ తత్వములు, ౬ కోశములు, నవరంధ్రములు వీనితోఁగూడి ౯౬ అంగుళములపొడవుగలిగి రోగభోగాలయంబై వెలయుచుండును.

మఱియు గడియారమనుగాలమును దెలుపునట్టిసాధనమున దగినసామగ్రిని లోపల నమర్చి వానిని జెడకుండునట్లు మీద మూతమూసియుండునటుల శరీర మనేకావయవముల స్రోవని యందఱు నెఱుంగుదురు.

శ్రీదేవదేవుడు మనలకు దిరుగులాడుటకును, కర్మేంద్రియజ్ఞానేంద్రియాంతరింద్రియవ్యాపారములకును, మనోబుద్ధులకును, జీవించుటకును, నాహారపానీయములు జీర్ణించుట మొదలైనసకలకార్యములకును, దగినసాధనముల మన గర్భములో నమర్చి, వాని కేంధమైనహానిగలుగనీయకుండ నస్థిపంజరమును అల్మారులో దాచి, వానికాపును నాపుగా మీదధాతువులగూర్చి స్నాయుసిరలమూలముగ నాహారరసము పంపకమగుచుండునట్లు సర్వాంతర్యామియైన ఈశ్వరులకెల్లం బరమేశ్వరుడగువాఁడు గాపాడుచున్నాడు.

## జ్వరవ్యాపక కాలనియమము

జ్వరము హేమంతశిశిరఋతువులందు సాధారణముగా నుత్పత్తియగును. కార్తికమార్గశీర్షంబులు హేమంతమనియు, పుష్యమాఘమాసంబులు శిశిరఋతువనియుఁ జెప్పంబడును.

సమస్తదేశములందును వర్షాకాలమువెళ్లి భూమిచేపుగలిగినప్పుడు జ్వరము సంభవించును. ఇతరఋతువులందు గలుగదనిగాదు. షడృతువులందు నించు

మించుగ సర్వదా గలిగియుండును. వర్షాకాలము వెళ్లిన తదనంతరము వసంత
ఋతువునందును మిగుల వ్యాపించును. అప్పుడు యెండినకొమ్మలుసయితము
చిగిరించుసమయము. దీర్ఘ వ్యాధులకు ప్రకోపకాలము. ఆకాలంబున నెమిడి
కలు పుట్టును. కారణాధారములచే ప్రతిఋతువున కనుగుణముగ స్వభావగుణ
ముల ననుసరించి రోగము లుత్పత్తియగును.

రోగమునకు ఋతుగుణమున కనుకూలమైన సంబంధముగలిగియున్నది.
అట్లు శరీరమునకు గాలమునకు సంబంధముగలిగియుండుటచేతనే రోగమునకు
శీతోష్ణకాలముల నాయాఋత్వనుగుణముగ శరీరస్థితి మారుచుండును. శీతోష్ణ
ములు నొకవిధముగానే యుండినను, ప్రతివానిలో గార్యభేదములవలన దత్వ
గుణభేదములతో వివిధజాతులుగలవిగా నగును. అవి ఉష్ణము శైత్యంబుగాను,
శైత్య ముష్ణంబుగాను గానబడును. ఋతువున కననుకూలముగ నేర్పడియుండు
నపుడు వ్యాధియొక్కగుర్తుగా నెంచవలెను.

మఱియు బాల్యయౌవనకౌమారవృద్ధాప్యములందు వృద్ధి క్షయ
స్వభావములును, వాతపైత్యశ్లేష్మదోషములును, దత్వస్వభావసత్వరజస్తమోగుణ
ప్రవాహములు వారివారి కర్మాధీనముగ గాలవిద్యమానస్థితినిబట్టి మారుచుండును.

## కాలభేదమైనరోగములు

జ్వరమున స్వభావకృతగుణములుగాక వానిలో వారివారితత్వలక్షణ
ములు బహువిధములుగ నుండును.

అవియేవనగా, జ్వరమున గొందరికి వమనముగలుగుట, కొందరికి
మూత్రము పలుమారు గారుట, యొడలుతిరుగుట, నడుమునొప్పి ప్రబలముగ
నుండుట, మోకాళ్లునొచ్చుట, ప్రలాపించుట, సంధులు నొచ్చుట ఇట్టిస్వభావ
గుణము లనేకములు. అది యిట్లుండగా జ్వరములును సకలామయములును
నొక్కొకసమయమున సాంక్రామికముగా సర్వత్ర యొకేవిధముగనే గలుగు
చుండును.

అవి వాతరోగములు గ్రహణిరోగము నజీర్ణము నేత్రకల్కాలుం సాహికజ్వరములు కళ్ళాయిదగ్గు మొదలగునవి సర్వత్ర బహుజనపీడకములుం గాను సాధారణముగాను నొకరినొకరికి గారణములేకనే సాంక్రామికముగాను గలుగుచుండును.

మఱియుం జ్వరములోగాని రోగములోగాని మలవిసర్జనగాకుండుటవలనను స్త్రీలు బహిష్ఠితారతమ్యతవలనను నెమిడికెలుకూడియుండుటవలనను, వాతాదులు గాఢముగ గూడియుండుటవలనను, బహువిధములుగా రోగములు సంకీర్ణమై యుండు నట్టివానిని తొలిగించగా నివారణమగుగావున కారణమునుగని పెట్టవలెను.

మఱియు నప్పటప్పటి కాలస్థితినిబట్టి సాధారణవిశేషరూపములుగా నగుచు, జ్వరములు వానిలోగలిగెడుకడుపునొప్పి గుండెనొప్పియింకను బెకుర్గుర్తులు రోగసంకీర్ణములయి, సాంక్రామికములుగా వేధించి నష్టపరచును.

## ఉపచారవిధములు

వ్యాధ్యుత్పత్తికారణము నెఱింగి దానిని వర్జింప వలెను. ఎట్లనగా శరీరమున నొకచోట త్రాటితో గట్టిపెట్టగా రక్తసంచారములేక వాపుగలుగును. పైత్రాటిని విడువగ వాపుతగ్గును. అట్లే మిథ్యాహారములచే రోగము సంభవిల్లును. దానినెఱింగి విడువగా నివృత్తి యగును. రూఢియు నెల్ల తెగుళ్లను నేకారణమువలన నుత్పన్నమై యేమిగఁ బరిణమించియున్నవో దానిని ముఖ్యముగా నెఱుంగవలయును.

మఱియు మిథ్యాహారవిహారాద్యకృత్యభేదములు వాతాదులు వీనియందు దేనింబట్టి వేదనగలిగియున్నదో దానిస్వల్పాధిక్యముల నెఱింగి దానికనుగుణ్యమైన చికిత్స నడుపవలెను.

మఱియు వాతపైత్యశ్లేష్మదోషములందు దేనిలో రూఢమిశ్రమై యుండునో యది ఏకజనితమో ద్వంద్వ త్రిదోషయుక్తమో వానిలో

సామాన్యలక్షణయుక్తమో బాహ్యాంతరాశయసంబంధలక్షణయుక్తమో బహు రోగాశ్రితమో తత్స్వస్వభావగుణజనితమో దానింగని సాధ్యాసాధ్యకష్టసాధ్యముల నిరూపించి తదనుగుణ్యామైన చికిత్స చేయవలెను.

మఱియు స్వల్పాధికవ్యాధులయొక్క సంచారమును జ్వరోత్పత్తి కారణమును, జ్వరస్వరూపమును, దర్వభేదములచే గలిగిన వానిస్వల్పాధికవిషమస్థితులును గానక స్వల్పము నధికముగాను,నధికమును స్వల్పముగాను,విషమమును సామాన్యముగాను, సామాన్యమును విషమముగాను, భ్రమించి తెలియక చికిత్స జేయుటచే సంబంధపడక కాలహరణమును నౌషధవిరుద్ధమునం గడుకష్టములును గలిగి యారోగి కాలగతి నొందును.

పైమూడువిధముల నెఱుగుట సామాన్యముగాదు. రోగియొక్క ముఖవచనములబట్టి యెఱింగిచేయుట దుస్తరము. ఇట్లుండగా బాలురును మూగవారును నెఱిగి యెఱుగనివారును వీరలలక్షణములు నెట్లు గానవలెనో తెలిసికొనుండు. ప్రత్యక్షముగ గోచరముగుదాని నెఱుగుటయే యసాధ్యముగనుండగా గర్భములో నేమిచేసినది శరీరాంతర్గతవ్యత్యయకారణముల నెట్లు గానవలెనో యోచింపుడు.

## చికిత్సాభేదములు

పూర్వోక్తస్వల్పాధికవిషమరూపజ్వర త్రివిధభేదములు వాతపైత్యశ్లేష్మదోషములలో దేనిలో జేరియున్నవో యెఱింగి తదనుగుణ్యముగ జికిత్సింపవలెను.

జ్వరప్రారంభమున నుష్ణోపచారమును, శైత్యజ్వరమునకు శైత్యోపచారమును, వాతశ్లేష్మజ్వరములకు నుష్ణోపచారమును గావింపవలెను.

శరీరము నెల్లప్పుడు నుష్ణముగా గాపాడుకొనుట యుత్తమము.

అదియునుంగాక నుష్ణజనితవ్యాధికి శీతోపచారమును, శైత్యజనితమునకును పురాణజ్వరమునకును నుష్ణోపచారమును బరిహరింపవలెను. వ్యాధిప్రారంభ

దశయందు శీతోపచారమును, మధ్యదశయందు సమశీతోష్ణోపచారమును పురాణమున శోభదు గలిగించుగావున నుష్ణోపచారమునే చేయవలెను.

రోగికి త్రికాలములయందు నుష్ణోపచారము శ్రేష్ఠమని కొందరిమతము. కొన్నిజ్వరములు గొంతకాలమైనపిదప లోబడుదానికి బైనుష్ణోపచారము గావించవలెను. ముఖ్యముగా వ్యాధిస్వరూపము శీతోష్ణములలో దేనిలో మిశ్రమైయున్నదో దానింగని తదనుగుణముగ జికిత్స జేయవలెను. ఇదిగాక దేశకాలబలాద్యనుగుణముగ జికిత్సచేయవలెను. ఎట్లనగ నుష్ణకాలమున శీతోపచారమును, శీతకాలమున నుష్ణోపచారములు జేయవలెను. అటులనే యుష్ణతత్వమువారికి శీతలోపచారము. వాతతత్వమువారికి నుష్ణోపచారమును గావించవలెను.

మఱియు నుష్ణశరీరముగలవారికి నుష్ణకాలంబున శీతలోపచారమును, వాతశరీరముగలవారికి శీతకాలంబున నుష్ణోపచారముగా నుపచరింపవలెను. ఇవి సహాజమార్గములు. ఉష్ణశరీరమును నుష్ణరోగమునుగలవారికి నుష్ణకాలమున శీతలోపచారమును జేయవలెను. వాతశరీరమును వాతరోగమునుగలవారికి శీతకాలమున నుష్ణోపచారమును జేయవలెను. శీతోష్ణదేశములయందు తద్దేశస్వభావరోగాదులందును తత్వముల నెఱింగి తదనుగుణముగ చికిత్సజేయవలెను.

శీతకాలంబున నుష్ణరోగంబును, నుష్ణకాలమున వాతరోగమును విపరీతసదృశములు.

మఱియు మేహాద్యుపద్రవములును పైత్యోపద్రవములును గల శరీరము గలవారికి మేహము పైత్యము గలుగుట సహాజము. అట్టివారికి సంభవించెడు వాతరోగములు విపరీతముగా నెంచవలెను. అట్టివారికి విషమరోగసంభవమయినను తీక్ష్ణమయినచికిత్సతో బరిహరించవలెను.

మఱియును మిథ్యాహారవిహారములబట్టియు నప్పటప్పటి కాలస్థితినిబట్టియు జికిత్సచేయవలసినది. ఋత్వనుగుణముగ రోగోత్పత్తియుంగలదు. అప్పుడు నాకలి దేహబలము నిద్ర మలశుద్ధిక్రమము నెఱింగి వానికి వ్యత్యయముగలంగ

నియ్యక, పథ్యము నౌషధము నిడవలయును. బాల్యాద్యవస్థాభేదములచే రోగా దులు వ్యాపకము అగును గావున తదనుగుణముగ చికిత్స జేయవలెను.

వ్రణసాధ్యం శస్త్రకర్మ పిత్తసాధ్యం తు రేచనం,
వమనం కఫసాధ్యంచ జ్వర సాధ్యం తు లంఘనం.

శస్త్రకర్మము వ్రణమేసాధ్యముగాగలది. పిత్తరోగము విరోచనము వలన సాధ్యముగాగలది. వమనము కఫమే సాధ్యముగాగలది. లంఘనము జ్వరమే సాధ్యముగా గలది. జ్వరములో గలిగెడు వాతపైత్యశ్లేష్మములకు వమనవిరేచనస్వేదలంఘనము మొదలయినవి పరమౌషధంబులు. వానివాని వాతాదిదోషంబుల నెఱింగి వానికనుగుణముగ జికిత్సగావించవలెను.

లంఘనము మూడువిధములు:—౧ వారువారు పుచ్చుకొనునాహార మును మార్పుగావించి లఘువుగ బుచ్చుకొనుట. ౨ ఆహారపానీయములు మాని శుష్కోపవాసముజేయుట. 3 లఘ్వాహారము జావ గంజి మొదలైనవి యప్పటిస్థితినిబట్టి పుచ్చుకొనుట.

మఱియు జ్వరములో విరేచనముల కిచ్చుటచే గ్, ౬ పర్యాయములు అగుట విషసదృశము. అవసరమనితోచునప్పుడు మలవిసర్జనముచేయించుట అమృతతుల్యముగ నుండును. ఒకచికిత్సచే క్రమముగ జ్వరము సాధ్యమగు నప్పుడు విఘ్నముగ భిన్నౌషధ మిచ్చుట ప్రతికూలముగ నుండును. దేనితో ననుకూలముగవచ్చుచున్నదో, అదే నిశ్శేష మగునంతవరకు నిప్పించవలెను. అటుగాక ప్రథమౌషధముతో గొంతగుణముగలిగి తర్వాతవ్యాధి నిలబడును. అప్పుడు దానినే యధికముగా గాని, తగ్గించిగాని యిచ్చిచూచి గుణములేక పోయిన మరియొకవిధముగ జికిత్స మార్చవలెను.

జామాతేవ శమం యాతి పిత్తం మధుర భాషణైః,
కఫో దుర్జనవత్తీక్ష్ణైః వాతం స్నేహేన మిత్రవత్.

అల్లుడు మధురభాషణములతో శాంతిజెందునట్లు, పైత్యరోగము శైత్యోపచారముచే శాంతిచెందును. దుర్మార్గుడువలె కఫరోగము ఆలిదారుణోపచారముచే శాంతిల్లును. చెలికాడువలె వాతరోగము స్నేహముచే శాంతిపడును. అనగా తైలములయుష్ణోపచారములచే శాంతిపడును.

## లక్షణాదులభేదనిరూపణము

మఱియు వాతాదు లొక్కజాతిగనే యుండినను, బహువిధకారణములచే నుత్పన్నము లగుటయుం గలదు. ఆకారణములంబట్టి వాతాదులభేదము మానిసిమానిసి కొకవిధమున గానవచ్చును.

వారువారు చేయుకారణభేదము లనేకములయినను, వాతపైత్యశ్లేష్మదోషములమూటికంటె వేరులేదు. మఱియు రోగ మొక్కటియేయైనను బుట్టినకారణములు బహుజాతులుగా గలవు. అవి యెట్లనగా, నొకనికి నారింజపండు తినుటచేగలిగిన జ్వరమును, నింకొకనికి బనసపండుతినుటచే గలిగినజ్వరమును, నొక్కవిధముగనే యుండును. నారింజపండు తిన్నవానికి జలుబు దగ్గనునలక్షణములును, పనసపండుతిన్నవానికి విరేచనములు కడుపునొప్పి వమనము ననుభిన్నలక్షణములుండును. ఇట్లు రెంటికిని నొక్కజ్వరమె యైనను, వానిలో లక్షణభేదముగలిగెను. గాబట్టి, మిథ్యాహారవిహారకారణములు పలువిధములగుటచే దేశకాలతత్త్వదోషములలక్షణము లనేకములైనను, నిందు జెప్పిన త్రివిధజ్వరములలోనే చేరియుండును.

ఒకనికివచ్చినవిధముగా రెండవవాని కవే లక్షణము లుండజాలవు. ఒకనికి నెమ్మతించిన యౌషధమే రెండవవానికి గుణమీయజాలదు. వారివారికర్మాధీనంబున జ్వరములయు రోగములయు లక్షణభేదములు గల్గుచుండును.

## జ్వరములలో లక్షణప్రకోపవిచారము

జ్వరంబులెల్ల స్వతంత్రము పరతంత్రము నని ద్వివిధంబులు. అందు సమస్తరోగములకు నాదికారణమైనజ్వరము స్వతంత్రమనియు, తదనంతరము

జనించినది పరతంత్రమనియుం, జెప్పఁబడును. నిష్కర్షయై నిదానపూర్వకమైన లక్షణములు స్వతంత్రరోగమందు గలుగును. ప్రారంభమున జ్వరము వెంబడివచ్చినలక్షణములుగాక, మధ్యతత్ప్రముఖంబులయినలక్షణములు పరతంత్రరోగములుగా గ్రహించవలెను. జ్వరముకంటె లక్షణములు లోపడి యుండుటగాని, భిన్నలక్షణము లేకుండుటగాని సహజంబు. దేశకాలవైపరీత్యముచేతగాని, వానివానియపచారముచేతగాని స్వతంత్రరోగమునకంటె పరతంత్రరోగమును జీవితాంతరాశయసంబాధములయిన రోగములును హృదయము శ్వాసకోశములు కార్జము పేగులు ప్లీహము కడుపునొప్పి శ్వాసము విరేచనము లగుట శోభయు ఊలవకాయలు వేదన మొదలయినవానిలో నాశయసంబంధములయిన రోగములు వైపరీత్యమునుగాని, మరణావస్థనుగాని దెలుపునవిగా నుండును.

జ్వరముకంటె అందులో మిశ్రమమైయుండు పైజీవితాంతరాశయసంబంధములైన పరతంత్రరోగజ్వరస్వాభావికగుణములు లేక వేరుగుణములుండుట విశేషము. అవి జ్వరముకన్నను ప్రబలముగనుండెనేని కష్టసాధ్యము. జ్వరముకంటె లక్షణములు అతిశయముగగాని, మిగుల వేదనయుక్తముగగాని యుండునేని యసాధ్యము. జ్వరములో స్వాభావికస్వతంత్రమయిన జ్వరరోగము నివృత్తిజెందినచో పరతంత్రరోగము వెంబడి నెమ్మదియగును. అటుగానిచో జ్వరములో మిగుల నుపద్రవయుక్తమయిన పరతంత్రరోగమును దక్షణమే శాంతిపరచవలెను.

జ్వరముతోగూడ హరించగలదని యుపేక్షించినచో బ్రాణంబుల హరించునని యెంచింగి, జ్వరముయొక్కస్వల్పాధిక్యములను వానిలో రోగాదుల సాధ్యాసాధ్యములగని తదనుగుణ్యమైన సామాన్యగాథవిషయములుగా జికిత్స గావింపవలయును.

## పథ్యాపథ్య విషయములు

మిథ్యాహారములవలన సకలరోగములును, లఘ్వాహారములవలన బలహీనమైనరోగములు నుత్పన్నములగును. అత్యాహారమువలన నతిస్థూలదేహా మగును. వాతశ్లేష్మరోగులకును నట్టితత్వముగలవారలకును గ్రాహ్యవ్యాగలిగి బృంహణ రోగము గలవారికి జ్వరరోగులకును, గాఢవిషమరోగులకును, శరీరబలము తగ్గ నట్లు తగినస్వల్పాహారము పథ్యముగ నొంచవలెను. మఱియు దుర్బలురకును పైత్యరోగము పైత్యశరీరముగలవారికిని, కృశదేహులకును, రక్తక్షీణులకును నీ మొదలయినవారికి శరీరబలము రక్తవృద్ధిగలుగున ట్లాహారము పథ్యముగ నొంచి పుష్టికరౌషధము నడపవలయును.

ఔషధపథ్యము - రోగపథ్యము - తత్త్వపథ్యము నని పథ్యము మూడు తెఱంగులు. వానిలో నౌషధపథ్యమనగా నౌషధమునకై పథ్యముండుట అది చేయకున్నచో గాఢ్ల ముఖము వాచును. రోగపథ్యము అనగా రోగమునకై పథ్యముండుట. అది జేయకున్నచో విషాదిరోగములు పుట్టును. తత్త్వపథ్యము అనగా తనశరీరస్వభావానుగుణముగఁ బథ్యముండుట. వారివారిశరీరమునకుగాని వస్తువులు భుజించుట రోగప్రకోపకారణమగును.

పథ్యేసతి గదార్తస్య కిమౌషధ నిషేవణైః,
అపథ్యమివ వంధ్యాస్త్రీభోగసక్తస్య దేహినః.

భోగశక్తిగల కాముకుఁడు గొడ్రాలియందు నెట్లు ఫలంబును బొందఁడో అట్లు అపథ్యము జేసెడివారికి నౌషధము మంచిదైనను ఫలమీయ దనుట.

సకలరోగములకుఁ జెప్పబడినగ్రంథములందుఁ బథ్యాపథ్యముల నెఱింగి వానికనుగుణ్యముగ జరిపించవలెను.

## ఔషధవిరోధము

అపథ్యదోషమువలన రోగప్రకోపకారణమువలెనే ఔషధవిరోధము వలనను నానారోగములం గొనివచ్చును. కావున నౌషధము పథ్యము అనుకూల ప్రతికూలతత్త్వముల నెఱింగి చికిత్స నొసంగవలెను.

పెద్దవారికి చిన్నవారికి ప్రమాణతారతమ్యములను, రోగబలవయస్తారతమ్యముల నెఱింగి చికిత్స నొసంగవలెను.

ఆహారవిహారములరోగోత్పత్తియుఁ, వాని ప్రకోపమును, మరణంబులవలననే దేశకాలతత్వభేదములను, రోగసామాన్యగాఢవిషమముల నెఱుంగక, చికిత్స నొనర్చుట నానావిధకష్టములకును, దుర్మరణమునకును, గారణముగా నెఱుంగునది. ఇచ్చట లోకప్రసిద్ధంబైన యొక యితిహాసంబు గలదు.

ఆదిశేషునకు నజీర్ణవాతమువలన గుక్షివేదనగలిగి క్షుత్తులేక రోగగ్రస్తుడైయుండెను. అప్పుడు పాలకడలియం దుత్పన్నంబైనవాఁడును, సమస్తాయుర్వేద పారీణుండును, దేవతోత్తముడైన శ్రీధన్వంతరికడకుం జని తనరోగస్థితిని విన్నవించెను. అప్పుడు అష్టాంగములు పరీక్షించి తగినచికిత్సనడపెను. క్రమముగా రుగ్మత ప్రకోపించి సంచారములేక కడురోగపీడితుడై గృహంబుననుండెను. ప్రతిరోజు వారికడకు ధన్వంతరి చని పెక్కౌషధముల మార్చి యిచ్చుచుండెను. ఒకనాడు ధన్వంతరిగృహంబున వైదికకార్యమువలన బోవనోపక నొకశిష్యునిద్వారముగా నౌషధమునిచ్చి, యాదిశేషునోట వేసిరమ్మని పంపెను. అతండు సెలవుగైకొని యాదిశేషు నింటంజొచ్చి ఆతనినోట నేర్పుగా నౌషధం బిడివచ్చెను. ఇచ్చట ధన్వంతరి యాదిశేషు రుగ్మతనుగురించి యెన్ని చేసినను సాధ్యపడకున్నదని కడుజింతించుచుండగా, నొకనాడొకభిషగుత్తముడు వృద్ధబ్రాహ్మణుండై ధన్వంతరిగృహంబునకు వేంచేసెను. అప్పుడు వారిం బూజించి యుచితాసనమునం గూర్చుండబెట్టి యాదిశేషురుగ్మతను గురించి విన్నవించెను. అప్పుడావృద్ధబ్రాహ్మణుడు సమస్తౌషధములనామముల నుచ్చరించుచు నదియిచ్చితివా యిదియిచ్చితివా యని అడిగెను. తాము సెలవిచ్చినవన్నియు నిచ్చితినని ధన్వంతరిచెప్పెను. నొప్పికి దగినవన్నియుం నిచ్చినవాడవైతివి; ఇక నేమిజేయవలె, నని దీర్ఘాలోచనజేసి మంచిది, నాగశ్రేష్ఠుడెంతటివాడైనను విషపుగోఱలుగలవాడు, వాని స్పర్శవలన నెంత దివ్యౌషధమైనను నిష్ఫలమగుచున్నది గావున, నౌషధం బాకోరలు తగులనట్లు వేయుమని

చెప్పి చనిరి. ఇది మిగుల ప్రశస్తముగ నున్నది; యెన్ని యౌషధములు వ్యర్థము లయ్యె! ఇందువలన సానుకూలమగునని నమ్మియుండెను. అమరునా డారోగ్యముగ నున్నదని ధన్వంతరికడకు కబురుపంపెను. అప్పుడు శిష్యుని రావించి శిష్యా నిన్న నీచేతనిచ్చిన యౌషధము నెట్లుపయోగించితి వనగా త్రికాలవేదివి; దేవతాప్రియుడవు; సమస్తగురూలికలును భవదాజ్ఞానుసారముగ నడచునని మీవలె నాయుర్వేదసారంబు దెలియుంగువారు వేరొక్కరుగలరే యని బహుప్రకారమ్ముల స్తుతియించి వందనము లాచరించి, దేవా తమకడ నౌషధము గొని యాదిశేషుగృహంబుజొచ్చి నే నొకటియుం దెలియక కొంతసేపు విచారించి, యిందుకు రేపు విచారించి చేయుద మని యిప్పుడు ఈనాగశ్రేష్ఠునకు విషదంష్ట్రలుగలవు; వానివలన నమృతమైనను విషమగునని దలచి కోఱలకంటకుండ నంగిట వేయింతునని నోరు తెఱపించి, యంగిట మాత్ర వేసి మీద నుదకపానము జేయించితి; దేవా పంటికంటక నౌషధము గర్భమున జొచ్చుట రోగహారముగ నెంచితి; నిట్లొనర్చుట మాగురువాజ్ఞ; యని పక్కాణించివచ్చితినని విన్నవింపగా నాధన్వంతరి యాహా! వృద్ధ బ్రాహ్మణోత్తముడు వచించినట్లే యీశిష్యుడు నొనర్చినవాడయ్యెనని వానిగౌరవించెను. కావున నెంతశాస్త్రజ్ఞుడును, సమస్తమత చికిత్సాదక్షుడును, దేవతలును, యుక్తిలేక చేయుపట్ల చికిత్స విషతుల్యముగాను సమయోచితముగా యుక్తియుక్తముగ నప్పటప్పటి దేశకాలతత్వభేదముల సామాన్యగాఢవిషముల నెఱింగి తదనుగుణముగ జేయుంపట్ల అమృతతుల్యముగాను నగునని యెఱుంగునది.

## చికిత్సా ద్వైవిధ్యము

మఱియు నఖిలభూప్రదేశములయందును బరిపరివిధములుగ జికిత్సాభేదములు పెక్కులున్నను అవియన్నియు శోధనము శమనము అని ద్వివిధములుగా నున్నవి. వాతాదిదోషసమస్తరోగములను విరేచనద్వారముగ బైటద్రోసి శమింపజేయునది శోధనచికిత్సయనియు, ప్రకోపించిన వాతాదిదోషములను

స్వస్థానమునందే హరింపజేసి వానికి సమత్వమును గలుగజేయునది శమన చికిత్స యనియు నెఱుంగునది. దేహమునం దుత్పన్నమైన వాతాదిదోషముల సమత్వముకొఱకు వమనవిరేచనవస్తి స్వేదకర్మచికిత్సలద్వారముగాఁ దద్దోషముల వెలిపుచ్చుటయు, న్యూనాధికవాతాదిదోషములను యథాస్థానంబున హరించుటయు, నీరెండు తెఱంగులచికిత్సలకన్న వేఱులేవు. మతభేదముల చేత్ర చికిత్సలు పలువిధములుగానున్నను నీశోధనశమనములంతర్గతములే యగుచున్నవి.

## జ్వరత్రికాలనియమము

మఱియు నీజ్వరములందు దరుణ మధ్యమ పురాణము లనియు మూఁడు కాలములు గలవు. నూతనమున జ్వరప్రకోపం బనేక గుణములతోఁగూడి సప్త దివసములవఱకు దరుణమనియు, ఆతరువాత జ్వరమధ్యస్థత్వమున పైతరుణకాలంబున గలలక్షణములు స్వల్పంబులై చతుర్దశదివసములవఱకు వ్యాపించునది మధ్యమమనియు, పైరెండుకాలములజ్వరప్రకోపలక్షణములులేక స్వల్పజ్వరయుక్తముగ వేదనగలుగుచు బలహీనతగలిగించి కాలనియమములేక యేర్పడియుండునది పురాణమనియు వచించెదరు.

ఇవే కాలనియమములేక రోగగాఢ సులభత్వములతో మూఁడుకాలములయందు నించుమించుగ మెలగుచుండును. మఱికొందరు తరుణపురాణములని, కాలము ద్వివిధమని చెప్పుదురు. మూఁడువారములదాక తరుణమనియు తర్వాత పురాణమనియు జెప్పుదురు.

కాలనియమములేక రోగములు వ్యాపించుచుండును. అవి సామాన్యగాఢ విషమభేదములతో ప్రకోపకాలమువరకు తరుణమనియు, అంతర్గతరోగమై శరీరమున జీర్ణమైనపుడు పురాణకాలమనియు నెఱుంగవలయును.

## మతభేదచికిత్సాస్వరూపము

మఱియు స్థావరజంగమరూపప్రపంచము నానావిధపదార్థస్వభావములు గలది మధురాదిరసముల నానాప్రభావములుగలదిగా నుండును. అందు సకల

ద్రవ్యములు సకలకార్యములకును వైద్యసహాయములకు నుపయోగమగును. అవి మృదుమధ్య తీక్ష్ణవిషభావములుగలవియై యఖిలరోగములఁ బోనడచునవిగా నున్నవి. అవి యనేకవిధములైన మూలికలను, ఖనిజములగు రసగంధకపాషాణ లోహములు మొదలైన బహువిధద్రవ్యములును సమస్త దేశములయందు భేద భేదములుగా దొరుకును. ఇంగ్లీషు-సంస్కృతము-యూనాని-తెనుగు-అరవము మొదలైన పెక్కు తెగలవారిచికిత్సలు నక్కడక్కడ దొరకునట్టివస్తుభేదముల యౌషధములును బహువిధములుగా నున్నవి. ఒకవస్తువును నానావిధములుగా వాడుకొనుచున్నారు. ఒకజ్వరమునకు మాత్రలు జూర్ణములు ద్రావకములు నుప్పులు భస్మములు కల్కకషాయలేహ్యతైలములు మలాము మొదలైనవి నానావిధపక్వభేదములచే ననేకములుగా గల్పించియున్నారు.

ఒక్కొకమతస్థులయొక్కయుపచారమును దెలుపుట కలవిగా నుండదు. ఏకమతస్థులుగానుండువారలలో నొకరుచేసినచికిత్స రెండవవారు చేయుటలేదు. ప్రపంచమున ననేకమతములు గలవు. వారియందొకమతస్థులలో భిన్నమయిన చికిత్స లెన్నిగలవో తెలియనలవిగావు. ఒకరియనుభవము రెండవవారికి నుండ జాలదు.

మఱియు శరీరమున బాహ్యాంతరాశయముల ప్రత్యవయవరోగముల నివారించుటకై వేరువస్తువులను పెద్దలు నిర్మించియున్నారు. వాతపైత్యశ్లేష్మ రోగమునఁ, హృదయము మెదడు కడుపు ధాతువృద్ధి మేహనము మొదలయిన భిన్నభిన్నావయవరోగములను బోనడచునట్టిద్రవ్యములను విరుద్ధముగ బ్రయో గించుటయు, విషసదృశములై యుండును. కాబట్టి ద్రవ్యగుణములను రోగాను గుణములయిన వానినిగా జికిత్సచేయవలెను.

వస్తుగుణనిరూపణమును, రోగస్వరూపమును, నౌషధకల్పనయు మొద లైనవాని నెఱింగి చేయువా రెంతమహనీయులని యెంచవలెను.

ఇట్టిశక్తినిచ్చెడు స్వాశ్రిత (భక్త) పరదునకు సాష్టాంగదండము లాచ రించెదను.

### సత్వగుణము

శరీరసత్వబలానుగుణములైన ప్రబలదుర్బల రోగముల విచారము. మఱియు ప్రబలరోగము దుర్బలరోగముగాను, దుర్బలరోగము ప్రబలరోగము గాను నుండును. అది బలవంతునికి జనించినది ప్రబలరోగముగనుండినప్పటికిన్ని, సత్వబలాధిక్యముగాన దుర్బలరోగముగాను, బలహీనునికి జనించినది దుర్బలరోగ ముగా నుండినప్పటికిని సత్వహీనత్వమువలన ప్రబలరోగముగా గానవచ్చును.

ఇట్టు లవయవములనంటినరోగము తత్వను విషము వృద్ధిక్షయములు వీని నెఱింగి సాధ్యాసాధ్యముల నిరూపించి చికిత్స చేయవలెను.

### అసాధ్యలక్షణములు

అశ్రాంతజ్వరము చెడుస్థితిలో జేరునపుడు గుర్తులేవనగా:— ఈ యశ్రాంతజ్వరము సకలామయజనకము గాగలదు. అసాధ్యజ్వరము ప్రథమంబున సాధారణముగ గానుపించును. ప్రారంభమునందు సామాన్యమయిన యశ్రాంత జ్వరముగానుండి క్రమముగా నందు ఘోరతరమైనరోగములు నడుమగలుగుచు, బలక్షయమును మందాగ్నియును గలిగి నిద్రలేక పిదప సన్నిపాతగుణములం దెచ్చుకొని, ప్రాణంబుల హరించును. ఈయశ్రాంతజ్వర మసాధ్య మగునపుడు పూర్వము జ్వరము వదలుచుండు కాలమునందుగూడ పూర్ణముగనిండి పట్టువిడుపు తెలియరానప్పుడు మరణావస్థసమీపించినట్టు లెఱుగవలెను.

అశ్రాంతజ్వరతరుణకాలంబునఁ బురాణలక్షణములు గలుగుటయుఁ బురాణజ్వరకాలమునఁ దరుణలక్షణములు గలుగుటయు నసాధ్యలక్షణములగును.

జ్వరప్రారంభములోనే గాఢముగనుండి పోనుపోను జ్వరము వృద్ధి యగుచు, నందులో నానావిధలక్షణములను మార్పబడుచు, నానాటికి దేహము కృశించుచున్నట్టి జ్వరం బసాధ్యముగా నుండును.

మఱియు ప్రారంభమున గాఢజ్వరలక్షణయుక్తముగ జనించి దినక్రమముగ విడుచునది సాధ్యముగ నెంచవలెను. ఈజ్వరము చిరకాలము బహువేదనలం జెందించి, బహురోగాశ్రితమై కృశదేహంబువాల్చి యంతమున ప్లీహ గుల్మ శోభ అతిసారములు గలిగి నానాబాధలుపెట్టి శైథిల్యము గావించి ప్రాణంబును గొనిపోవును.

మఱియు వాతాదులదోషము శరీరమున గాఢముగ నాశ్రయించి జ్వరము సంభవించినప్పుడును, నట్టి జ్వరప్రకోపకాలమున నపథ్యాదికృత్యములచే దోషాశ్రితమగునపుడును స్వేదముగలిగినను జ్వరము వదలకుండునప్పుడును, శరీరావయవముల జవసత్వములుడుగుటయును, మనోబుద్ధులు స్థిమితము లేక యింద్రియాదులు వికలతజెందుటయును గర్భాశయములోనుండెడుహృదయము శ్వాసకోశములు కుతికె కార్జము కడుపు పేగులు నులవకాయలు జీర్ణాశయము మూత్రాశయము మలాశయము గర్భాశయము మొదలయిన యవయవములకు నాజ్వరములో నైయాశయముల రోగము సంభవించుటయును, ఈ మొదలైనవానిలోఁ దొలుత జనించినజ్వరమునకుఁ జికిత్సాప్రతిబంధముగా మఱియొక రోగము జనించుటయే యసాధ్యము.

మఱియు జ్వరమున వాతాదులు విషమములగుటయు, నేకకాలమునం దనేకరోగములుగలుగుటయు, జ్వరమునకును వానిలోలక్షణములకును భిన్నభిన్న చికిత్సచేయ నేర్పడుటయు, జ్వరత్రికాలములు దెలియరాకుండుటయు, శరీరతత్త్వము ద్వంద్వలక్షణయుక్తముగనుండుటయు, మేహోద్యుపద్రవముల సకలరోగాశ్రితమై కడుపీడంబొంది కార్శ్యదేహమై యంతమున జ్వరప్రకోపముగలుగుటయు, నాహికాశ్రాంతసన్నిపాతములవరుసగా గొనివచ్చుటయు, గ్రహములు ప్రతికూలముగనుండుటయు, గరపాదముల గోళ్లయందును గన్నుల ఱెప్పలందును రక్తహీనమై యుండుటయు, శరీరము పాండువర్ణమైయుండుటయు, గుండె యణచుకొనుట లేక నొప్పిప్రక్కశూలించుటయు, కన్నుల చూపు వికారమగుటయు, చూపు లోతునగ్రుంగి యుండుటయు, ముఖవర్చస్సు

హీనమై పోవుటయు, ఎక్కిళ్లు విషదాహము గ్రహణ్యాతిసారము గలుగుటయు జేనియందు నిచ్ఛ లేకుండుటయు, జీర్ణము లేకుండుటయు, దినక్రమముగ బలక్షయమగుటయు, నాకలి దినక్రమముగ నశించుటయు, శరీరము వివర్ణమగుటయు, నిద్రపూర్ణముగ లేకుండుటయు సముద్రపుధ్వనివలె నొకధ్వని గుండెనుండి పుట్టి చెవులలో నూదినట్లుండుటయు, దేహాంగములు నిలువలేకయుండుటయు, బుణుకుటయు, నసంగతముగ దనకుదానే మాటలాడుటయు, నున్మత్తునివలె నానాచర్యలు సేయుచుండుటయు, శరీరతాపముఁ బొందుటయు, సత్వహీనతకారణ స్వేదస్రావముగలుగుటయు, నొడలు పణకుటయు, శిరఃకంపము గలుగుటయు, మలము నల్లగనుండుటయు, గాళ్లుచేతులు తీపులుతీయుటయు, హీనస్వరముగలుగుటయు, తంద్రగలుగుటయు, మూర్ఛగలుగుటయు, జన్నికుట్టుటయు, క్షణముజ్వరము-క్షణము శీతము గలుగుటయు, నాలుకముల్లు దాకియుండుటయు, విషదాహము రుచి దెలియకుండుటయు, వాసన దెలియకుండుటయుఁ, జ్ఞాపువికలత్వముఁ జెందుటయు, వినరాకుండుటయు, శోషించుటయు, విడువక వేధింపుచుండుజ్వరమును నీమొదలయిన లక్షణము లించుమించుగా దేశకాలతత్వానుగుణజ్వరస్వల్పాధికభావములబట్టి, యాలస్యానాలస్యములుగాఁ బ్రాణంబుల హరించును గావున, నివియు నసాధ్యంబులు.

## సద్యోమరణలక్షణములు

పైన నుదహరించిన యసాధ్యలక్షణములతో శ్రమజెంది, యంత్యావస్థయందు జ్వరము విడుచుసమయమున బైగుర్తులుడిగి, చేష్టావిహీనంబులయి, స్వస్థానమును వాడివదలి, కరపాదములు శైత్యాస్పదమై, క్రమముగా శరీరమాద్యంతమును గాఢశీతలమై, యచేతనముగ నేర్పడుటయు; మానసేంద్రియ బాహ్యేంద్రియవ్యాపారముల నడపునట్టి యేదో యొకటి అనగా జీవుడు శరీరమునుండి బయటరాగలందులకు లాగునట్లు దీర్ఘశ్వాసగల్గి, యూపిరాడక తకతకలాడి మూలస్థానమునుగుంజెడు నాసమయంబున నలసినవానికి స్వేదముగలిగి

నట్లు జోరుచెమట పుట్టుటయు, బొమ్మునొప్పిగాని యణచుకొనుటగాని మూల్గు. టయు దలవిసరుపుట్టుటయు; ముఖమువివర్ణమగుటయు, హీనస్వరమగుటయు, గొంతులోశ్లేష్మము అడ్డగించుటయు, దృష్టిమారుటయు, గాళ్లుచేతులీడ్చుటయు, ముఖమువర్చస్సుతప్పి కళాహీనమగుటయు, మాటలులేకపోవుటయు, శరీరము గుర్తెఱుంగక యుండినను నేమియుదెలియరాక రెప్పపాటులేక బిత్తఱిచూపు వికారమై కనుగ్రుడ్లుతిరుగుచు నీల్గబడి నోరుతెఱచి మానసేంద్రియవ్యాపార ములు నిలుచుటయు, సద్యోమరణంబు గలిగించునని యెఱుంగవలయు. పైం జెప్పినయసాధ్యలక్షణములన్నియు రోగాంతములందు వేధించునవిగావున, నవే పురాణలక్షణములుగా గ్రహించవలయును. మఱియు నిట్టిపురాణలక్షణములు తరుణరోగజ్వరాదులయంతమందుగలుగుట యసాధ్యమేగాక, తరుణరోగ జ్వరాదుల ప్రారంభమందును పురాణకాలమందును లక్షణములు గలుగుటయు. నసాధ్యముగా నెంచవలెను.

## సాధ్యలక్షణములు

అథ సాధ్యగుణాన్వక్ష్యే శ్రోతవ్యం భిషజోత్తమ,
ఇందీవరసమం నేత్రం ముఖం తారేశసన్నిభమ్.
సమధాతుగతి ర్నాడీ స్వరః కోకిలసన్నిభః,
క్షుతం క్షుధామూర్ధ్నికండూ రన్నవాంఛా తనుర్లఘుః,
దంతాః కుందనిభాభాసా జిహ్వా సద్రవమార్ద్రవా,
యవాగూప్రాశనే స్వేదః కర్ణయో శ్శ్రవణం సమమ్.
ఘ్రాణే గంధసమజ్ఞానే పాణిపాదతలోష్ణతా,
నఖపక్ష్మాక్షిలేఖాసు రక్తసంపూర్ణతా యదా.
జానాస్యేవమిదం సాధ్యం చికిత్సాం కురుపండిత,

ఓవైద్యోత్తముఁడా వినుము. నేత్రములు నల్లకలువరేకులవంటికాంతి గలిగియుండుట, ముఖము చంద్రునితో సమానముగనుండుట, నాడికి సమగమ

నముగలిగియుండుట, స్వరము కోకిలస్వరముతో సమానముగనుండుట, తుమ్ములు గలుగుట, ఆకలి నెత్తిజిల అన్నమందిచ్చగలుగుట, శరీరము చులకనగనుండుట దంతములు మొల్లలవంటికాంతిగలిగియుండుట, నాలుక ద్రవయుక్తమై మృదువుగనుండుట, గంజిత్రాగునపుడు చెమటగలుగుట, కర్ణములందు ఘోషము సమముగ వినిపించుట, నాసికరంధ్రములరెంటికి పరిమళద్రవ్యములవాసన సమముగ నెఱుంగవచ్చుట, కాళ్లుచేతుల కుష్ణముగలుగుట, గోళ్లు రెప్పలు నేత్రములు హస్తరేఖలు రక్తపూరితములుగ నుండుట ఈలక్షణములు సమస్తరోగములందును జ్వరములందును సాధ్యలక్షణములని యెఱింగి పండితుడు చికిత్సం జేయవలయును. ఇదియునుంగాక యాహికజ్వరమునందు జెప్పినసాధ్యములను జూడవలెను.

## జ్వరవిముక్తునికి నకర్తవ్యంబులు

వ్యాయామంచ వ్యవాయంచ స్నానం చంక్రమణం తథా,
జ్వరముక్తో న సేవేత యావన్న బలవాన్ భవేత్.

కఠినమగుపనులొనర్చుట, మైథునంబొనర్చుట, స్నానముజేయుట, తిరుగులాడుట వీనిని జ్వరవిముక్తుడు శరీరంబునకు చక్కగ బలమువచ్చువరకు వర్జింపవలెను

## జ్వరితునికి గూడనివి

నవజ్వరే దివాస్వప్న స్నానాభ్యంగాని మైథునం,
క్రోధప్రవాతవ్యాయామాన్ కషాయాంశ్చ వివర్జయేత్.

## జ్వరదోషోత్పత్తివిధము

అథ సప్తవిధా దోషాః వక్ష్యంతే శాస్త్రనిశ్చయాత్,
తరుణజ్వరమధ్యే తు అపథ్యో న పరాయతే.

తరుణజ్వరములో అపథ్యాలుసేయగాను అందువల్ల సప్తవిధదోషములు పుట్టును.

ఆమ్ల తిక్తం కటు మధు కషాయం స్వాదు భోజనం,
జలపానం చ శైత్యంచ వనితాసంగ మాగ్రహః,
వ్యాయామచిత్తరోగశ్చ మహాదోషః ప్రజాయతే.

పులుసు, కారము, చేదు, వగరు, పరిమళద్రవ్యాదులు, ఉదకపానము, శైత్యోపచారములు, స్త్రీసంగమము, దూరమునడచుట, ఏడ్చుట, కోపము చేయుట ఈచెప్పబడిన యపథ్యాలవలన తరుణజ్వరములలో మహాదోషములు పుట్టును.

కుసుమంచందనంచంద్రం తాంబూలం రక్తవాసపం,
ఆజ్య గుడంచ తిలజం సురభిద్రవ్యభోజనమ్.
తూలశయ్యా నవ్యవస్త్రం వాయుభూషణమందిరం,
నారీస్పర్శావలోకశ్చ జ్వరితః పరివర్జయేత్.

పుష్పములు శ్రీగంధము కర్పూరవిడెము ఎఱ్ఱకోక నెయ్యి బెల్లము నూనె కస్తూరి పరిమళద్రవ్యములు పాలు పెరుగులతోటిభోజనము దూదిపరుపు క్రొత్తకోక గాలివచ్చెడియిల్లు స్త్రీలనుదాకుట పలచుట జ్వరార్తుడు వర్జింపవలెను.

## అపథ్యదోషములు

తంద్రా మూర్ఛా భ్రమో దాహః ప్రలాపో హృత్ప్రివేదనం,
అపథ్యదోషా విజ్ఞేయా వైద్యవిద్యావిశారదైః.

తంద్రగలుగుట, మూర్ఛగలుగుట, భ్రమయుట, దప్పిగలుగుట, జొల్లులాడుట, రొమ్మునొచ్చుట యిది యపథ్యదోషమని యెఱుంగునది.

తరుణజ్వరమధ్యే తు యువతీసంగమేన చ,
జాయతే తరుణం దోషం అంగవైకల్యకందుతా.

పక్షాంతరే చ సంతాప ప్రలాపౌ తాపవిభ్రమౌ,
హస్తపాదాని శైత్యాని దోషస్త్రీసంగమత్రుషా.

**కేవలాసాధ్యజ్వర లక్షణములు**

ఈయశ్రాంతజ్వరమునందు ప్రత్యేకమైన యసాధ్యజ్వరములు: అవి యేవనగా:

జ్వరో నిహంతి రక్తాక్షం క్షీణాంగం హృది శూలినం,
సదా శ్వాసంచ స్వేదంచ శక్తిహీనం హతానలమ్.

నేత్రములెఱ్ఱనైనవానిని, కృశించినయంగములుగలవానిని, రొమ్ములో శూలగలవానిని, సదా శ్వాసముగలవానిని, ఎల్లప్పుడు చెమటపట్టువానిని, సత్వములేనివానిని, నాకలిలేనివానిని నీలక్షణములు గలవానిని ఈజ్వరము యమాలయంబున కంపును.

మతాంతరే:—

హేతుభిస్బహుభిర్జాతో బలవాన్బహులక్షణః,
జ్వరః ప్రాణాంతకృద్యశ్చ శీఘ్ర మింద్రియనాశనః.

అనేకకారణములతో జనించి బలక్షయమును గలుగజేసి నిరంతర స్వేదాద్యనేకదుర్లక్షణములతోగూడి శీఘ్రముగ నింద్రియశక్తిని నశింపజేయుచుండుజ్వరము ప్రాణాంతకమగును.

మాధవనిదానే:—

జ్వరః క్షీణస్య శూనస్య గంభీరో దైర్ఘ్యరాత్రికః,
అసాధ్యో బలవాన్ యశ్చ కేశసీమంతకృజ్జ్వరః.

శరీరము కృశించినవానియొక్కయు, శరీరముబ్బియుండువానియొక్కయు జ్వరమును వాతాదినాడీగమనము తెలియుగుట కశక్యముగనేని అంతర్వేగము గలదిగనేనియునుండును. జ్వరమును దీర్ఘకాలమువరకు విడువక వేధింపుచుండు

జ్వరముల్లు బలవత్తరముగ నుండుజ్వరమును, నకస్మాత్తుగా దలవెండ్రుకల పాపట దీసికొనువానియొక్క జ్వరమును, నసాధ్యంబగును.

## సంగమదోషజ్వరలక్షణములు

గ్రంథాంతరే:—

సంగదోషస్య చిహ్నాని నేత్రరోగ శ్శిరోవ్యథా,
ఊరుపీడోదరే దాహ స్సంధిబంధ స్తృషాజ్వరః.

నేత్రము లెఱ్ఱనై నీరు గారుచుండుటయు, దలతొడలు నొచ్చుటయు, గడుపులోమంటయు, సంధులు బంధించినట్లుండుట, దప్పియును జ్వరంబును నివి సంగమజ్వరలక్షణములని తెలియవలయును. దీనికి శుక్లగతజ్వరచికిత్స చేయవలయును.

## విషూచిజ్వరలక్షణము

విషూచికా జ్వరే ఛర్ది ర్నాడీ మందగతి ర్భవేత్,
అంతర్దాహో బహిశ్శీత మతిసారో జ్వర స్తథా.
తృష్ణా ప్రలాపో భ్రాంతిశ్చ విజ్ఞేయా వైద్యపారగైః,
చతుర్థే జాయ తే మృత్యుః కాలజ్ఞానేన భాషితమ్.

వమనంబును, నాడులుమందగించుటయు, లోపల విదాహముగలుగుటయు, వెలపట శీతలముగనుండుటయు, నతిసారమును, జ్వరమును, దప్పిగలుగుటయును, వదరుటయును, భ్రాంతిగలుగుటయు, నివి విషూచీజ్వరమందు లక్షణముగానాయుర్వేదవేత్తలచేఁ దెలియదగినది. ఈజ్వరముగలవాడు నాలుగుదినంబులలో జమునింటికి కేగునని కాలజ్ఞానునిచే వచింపబడియె.

## జ్వరాతిసారలక్షణము

జ్వర స్సంతాపహృచ్చూలల మరోచకవిరేచనం,
ఆమంవా శోణితంవాపి జ్వరాతీసారముచ్యతే.

జ్వరమును సంతాపమును రొమ్మునొప్పియు నరుచియు విరేచనము అమముగాని రక్తముగాని పడుటయు ఈలక్షణములుగలది జ్వరాతిసారమని తెలియవలెను.

## క్రిమిజ్వరలక్షణము

జ్వరశ్చ దారుణ శ్శూల ముఁన్నతోదర గౌరవం,
ఉద్గారశ్చ తథాశ్వాస స్వేదస్సర్వాంగశీతలమ్.
హిధ్మాహిక్కాశిరోభ్రంశోమూర్ఛాశోష శ్శ్రమోహవాః,
నిస్సత్వం వమనం నిత్యం పతతి క్రిమివింశతిః.
త్రింశచ్చైవ శతంచాపి హ్యనాహశ్చాగ్నిమాంద్యకం,
అనిద్రాశోకసంతాపాః ప్రజాపీడాసముద్భవాః.

దారుణమగుజ్వరము, శూల, కడుపుపెరుగుట, గౌరవము, ఓకరింత, శ్వాస చెమట సర్వాంగశీతము హిధ్మయు వెక్కిళ్లును దలదిరుగుటయు, మూర్ఛయు, శోషయు, మిగుల శ్రమయును, బలహీనతయు, వమనమును, నిత్యముయొమిడికలు ౨౦-౩౦-౧౦౦ ఈరీతిగ బడుటయు, గడుపుబ్బుటయు, నగ్నిమాంద్యము, నిద్రలేకపోవుటయు, శోకమును సంతాపమును నిట్టిలక్షణ ములుగలది క్రిమిజ్వరము. ఈజ్వరములు అశ్రాంతజ్వరమునం దంతర్భూత ములుగా నుండును.

మరియు నశ్రాంతజ్వరమునందువలె ఆహికజ్వరమునందు సహితము గానం బడును. ఈయశ్రాంతజ్వరము పిల్లలయందు సర్వసామాన్యముగా వ్యాపకము గలదు. ఇది యసాధ్యమునకు దిరుగునపుడు సన్నిపాతజ్వరవ్యాపకములో గలి యును. లేక ప్రత్యేకముగాని యసాధ్యజ్వరములు వ్యాపించుచుండును.

## ఔషధచికిత్సక్రమము

జ్వరప్రకోపకాలంబున పీనాసటక్ అను నౌషధము ౨ మొదలు ౫ గ్రైనులవరకు ౨ ఘంటలకొకసారి విడుచువరకు నియ్యవలయును. విడిచినది యొకటింగి కొయినా యివ్వవలయును.

లోకనాథము, బాలసూర్యోదయము, వాతవిధ్వంసి, మహావాతవిధ్వంసి, రసభూపతి, చింతామణి, సన్నిపాతభైరవి, కాలకూటము ఇవి జ్వరములో వాతాదిదోషములు జంతువులుగూడియుండినవాని కనుగుణముగ తగిన యను పానములం జేర్చి, పైయౌషధముల నొక్కొక్కటిగా నీయవలెను. గాఢత్వము జూచి రెండౌషధములు గూర్చవలెను.

ఏక మౌషధదోషఘ్నం ద్వయ మౌషధరోగకృత్,
త్రయ మౌషధతాపాని చతు రౌషధనాశనమ్.

జ్వరప్రకోపకాలంబున అన్నమిడవలదు. అప్పుడు గంజి జావ యియ్యవలెను. జ్వరము విడిచినపుడు లఘ్వాహార మిడవలెను.

అజీర్ణవాతజ్వరములకు దుంపరాష్ట్ర, అక్కలకఱ్ఱ, మిరియాలు నూరి వేడినీళ్ళతో రసముతీసి పైఔషధముల నియ్యవలెను.

పైత్యజ్వరములకు దుంపరాష్ట్ర, శొంఠిరసము తీసికొని ఆనందభైరవి, వైష్ణవీరసము, స్వర్ణమాలినీ, వసంతములలో నొకటి యియ్యవలెను.

జంతుజ్వరములకు వాయువిళంగమురసములో రసభూపతి మొదలగునవి యియ్యవలెను. ఇటుల జ్వరములోగలుగునట్టి నానాగుణముల కనుగుణముగ చికిత్స నొసంగవలెను.

ఇది వైద్యకల్పతరుగ్రంథమందు అశ్రాంతజ్వరప్రకరణము.

---

## చతుర్థ ప్రకరణము.

### సన్నిపాతజ్వరప్రకరణము

అతఃపరం ప్రవక్ష్యామి సన్నిపాతజ్వరక్రమం,
కంఠే లలాటే వక్షేచ స్వేద స్తంద్రా మతిభ్రమః.
అంగదాహ శ్శిరోరూతా దాహస్సర్వాంగనేత్రయోః,

నేత్రశోణిత పిత్తంచ మూర్ఛా భ్రాంతిప్రలాపకః.
హృచ్ఛూలం గుంభనం హిక్కా- కాసశ్వాసౌచ హర్షణం,
సన్నిపాతజ్వరే ఘోరే నిశ్చితం వైద్యపారగైః.

తా. కంఠము నొసలు రొమ్ము వానియందు చెమటగలిగియుండుట, తంద్రగలుగుట, మతిభ్రమయుట, శరీరము నొప్పిగలుగుట, శిరోవేదన, శరీరము కన్నులు మండుట, కన్నులెఱ్ఱగాని పచ్చగానియుండుట, మూర్ఛ, భ్రాంతి, కలవరించుట, హృదయశూల, కడుపులో నులిపెట్టుట, యెక్కిళ్లు, దగ్గు, శ్వాస, దప్పి, నవ్వు ఇట్టిలక్షణములు గలిగియుండిన సన్నిపాతజ్వరమని యెఱుంగవలయును.

గ్రంథాంతరే:—

జ్వరో భీషణదాహశ్చ నాడీ సూక్ష్మగతి స్తథా,
స్వేదశ్శీతంచ సర్వాంగం పిపాసా కంఠకంటకమ్.
హీనస్వరో బుద్ధిహాని ర్హాస్యం దుర్భాషణం తథా,
స్వల్పశ్రుతిః కర్ణనాద స్తంద్రా ఘోషః కపాలకే.
నిస్సత్వ మంగజడతా సర్వసంధిషు మారుతః,
రక్తాక్షికంటకాజిహ్వా మూర్ఛాశోషశ్రమ స్తథా.
పూర్వాపరానుసారాచ్చ సన్నిపాతజ్వరోద్భవః,
శిరోభ్రమణశూలంచ ప్రలాప శ్శ్వాసకాసకౌ.
తరుణం చైకరాత్రం చ చతుర్వారం దినేదినే.

జ్వరము భయంకరమగుదాహము నాడికి సూక్ష్మగమనము చెమట సర్వాంగశీతము దప్పి కంఠమునందు ముల్లుబారియుండుట హీనస్వరము బుద్ధి శూన్యత హాస్యము దుర్భాషలాడుట చెవులు మందముగ వినుట చెవులయందు ధ్వనిగలుగుట తంద్ర కపాలమునందు నాదముగలుగుట నిస్సత్వము సర్వావయవములు జడముగనుండుట సర్వసంధులయందు వాతము కన్నులెఱ్ఱగనుండుట

నాలుక ముల్లుబారి యుండుట మూర్ఛ శోష శ్రమ తలదిరుగుట శూల వదరుట ఉబ్బసము దగ్గు ఇట్టిలక్షణములుగలది సన్నిపాతజ్వరము. అది పూర్వ పాపవశమువలన సంభవించునని యెఱుంగవలయును.

### సన్నిపాతజ్వరోత్పత్తి

తతో రోగపరీతోగ్రం ప్రతాపే మృత్యుసన్నిభః,
జ్వరో దక్షాధ్వరధ్వంస రుద్రాగ్నినయనోద్భవః.

జ్వర మత్యుగ్రముగా నుండును. ప్రతాపమందు మృత్యువునకు సమానమైయుండును. ఈజ్వరము దక్షాధ్వరయుద్ధమందు నత్యుగ్రుడైన మహారుద్రుని మూడవకంటియందు తీక్ష్ణమైనచూపుచే దారుణాగ్ని గలిగి దాని నుండి జ్వర ముత్పన్నమయ్యె, అట్టిజ్వరము శ్రీమహేశ్వరునిగురించి నన్ను పుట్టించిన కారణ మేమని విన్నవించుకొనగా భూలోకంబున జనులబీడింపు మని యాజ్ఞాపించెను.

జ్వరము త్రివిధమార్గములుగ నుండినను సమష్టికి నొకేవిధముగనుండును. మఱియు నది మనోవాక్కాయకర్మవ్యాపారములనణచుటకును, పైవాని వేగప్రవర్తన ప్రకాశింపజేయుటకును గారణమగును. అఖిలరోగములందును జ్వరములందును వ్యాప్తమై ప్రకోపించుటయందును పురాణకాలమున విషగుణములంగొనివచ్చి ప్రాణంబుల హరించును.

అదిగాక జ్వరము సత్వరజస్తమోగుణముల వికలము చేయు సన్నిపాతంబుగాను సకలవిధతత్వస్వభావభేదములం బ్రకోపించునదిగాను, జ్వరోత్పత్తికి గారణములగు దోషములంగలిసి పెక్కుతెఱంగులగుణములతోఁ బ్రకోపించు రుద్రస్వరూపముగలదిగాను, దనయందలి వాతాదులు విషసదృశములై యఖిల రోగములందును వేషలందును నీడ్పువాతముగలిగి గుండెయందును తలికెయందును పట్టును. గుండెభారము నొప్పిగలుగునట్టి జన్నివికారముగలదిగాను దరుణకాలమునందు నపథ్యాద్యపచారములచే దోషాస్పదమై కైపుద్రవ్యము

లందుగల వివిధగుణములవలె మార్చిమార్చి పరిపరివిధములుగా వ్యాప్తమై చంపు నదిగాను దెలియవలయును.

వాతపైత్యశ్లేష్మదోషములనెడు దారువులచే గప్పబడిన సన్నిపాతజ్వరమనెడు ననలము మనోవాయు సహాయములతోఁ బ్రజ్వలించి పంచభూతాత్మక దేహముల దహింపఁజేయుచున్నది. మఱియు సకలరోగోత్పత్తికారణములై ప్రకోపించుటకును, నితరగుణములను గొనివచ్చుటకును, మూలాధారంబైన వాతాదులు విషప్రాయములై యేకదోషముగాను, ద్వి త్రిదోషయుక్తమై జన్ని వికారమైన పెక్కుగుర్తులతో బ్రకోపించును.

అట్టిసన్నిపాతజ్వరంబున బ్రథమకాలంబున మనశ్చాపల్యము స్వల్పముగఁ దెలిసి తెలియకయుండి, క్రమంబుగ జ్ఞానేంద్రియకర్మేంద్రియములు వికలత్వము జెంది, విశేషబహుళమై మన స్థిమితములేక యున్మత్తునివలె బలు తెఱంగుల గుణ పరంపరలుగా నాశ్చర్యచర్యాదులు గల్గును. అట్టిజ్వరము సన్నిపాతంబుగా నెఱుంగవలయును. అదియునుంగాక జ్వరము ప్రథమంబున సామాన్యముగా నుండి క్రమక్రమముగ వృద్ధియగుచు శరీరావయవములం జెఱుచునట్టి బహు రోగములం గొనివచ్చును. నానాటికి జ్వరము నాటుకొని శాఖోపశాఖలుగ గుణభేదములం జేర్చుకొనుచు, తనదేహము నెఱుగక యింద్రియమనోవ్యాపారములం జెదరించి, జ్వరముకొలది విడుచును. అట్టిస్వల్పంబు ఉదయకాలమునందును విడువక యహోరాత్రములు నొకేవిధముగ జ్వరము కాయుచు శరీర సాధనయంత్రము లవిసి క్రమంబుగఁ బూర్ణముగ జెడుపుజేయునప్పుడు సన్నిపాతముగా నెఱుంగవలయును.

### సన్నిపాతజ్వరోత్పత్తికారణము దోషోత్పత్తికాలము

హేమంతవర్షాశిశిరేషు వాయోః
పిత్తస్య తోయాంతనిదాఘయోశ్చ,
కఫస్య కోపః కుసుమాగమేషు
కుర్వీత యత్నం విహితం యదేషామ్.

హేమంతవర్ష శిశిరఋతువులయందు వాయువు ప్రకోపముగను, శరదృతు గ్రీష్మఋతువులయందుఁ బిత్తము ప్రకోపముగను, వసంతఋతువునందు శ్లేష్మము ప్రకోపముగను నుండును. కావున నక్కాలంబు నెఱింగి వాతపిత్త శ్లేష్మములకు జెప్పంబడినచికిత్సలం జేయవలయును. మిక్కుటముగ షడ్రసములతో నెల్లప్పుడు భుజించెడు నన్నపానాదిదోషములు గర్భస్థమై చిరాచిరకాలములలో రోగము సంభవిల్ల జేయును.

మఱియుం ఋతువుల కనుగుణముగ శరీరస్థితి శీతోష్ణములుగా మారియుండుట స్వభావము. అటులనే రోగవ్యాపక కాలంబునఁ దదనుగుణముగ నెవరిశరీరము దిరుగునో వారికి రోగము సంభవిల్లును. లేనివారికి గలుగుట లేదు.

మఱియుం మనకుక్షియందు నెమిషికలుపుట్టుటకు కారణము తెలియకుండుటవలెనే, రోగము సంభవించుటయుం దెలియకుండును. అదిగాక షడృతుకాలదోషములందును ఋతువిరోధకాలంబునందును ఋతుసంధికాలంబునందును, అటులనే శుక్లబహుళపక్షములసంధివేళలందును దేశము కాలము మార్పువేళలందును అప్రయుక్తవిషభయశోకములు మొదలయినవానియందును వాతాదులు న్యూనాధికములై విషమముగ సన్నిపాతజనకంబు లగుచున్నవి.

## త్రిదోషజ్వరభేదములు

అహికాక్రాంతజ్వరములందు మతిస్థిమితముగ నుండునటుల, సన్నిపాతజ్వరములో లేకుండుట; అహికాక్రాంతజ్వరములలో మరణము ఘటించునట్టి యసాధ్యమైనరోగములు మిశ్రమమైనప్పటికి మనోభ్రమవికారములుగలిగి యుండుట లేదు. అనగా చిత్తవైకల్యము, లేక సన్నిపాతజ్వరలక్షణము లేకనే అసాధ్యమైనరోగములు సంక్రమించి యాహికాక్రాంతజ్వరములు జనులకు మరణము బొందించును. అక్రాంతజ్వరమునం దంతర్భూతములయిన యసాధ్య జ్వరములు బాగా దెలియగలవు.

సన్నిపాతజ్వరమునకు ముఖ్యమైన లక్షణము లేవనగా, సన్నిపాతజ్వరమున మతిభ్రమము గలిగియుండును. పుణికిరించుటయు, నున్మత్తునివలె బహుచేష్టలు జేయుచుండుటయుఁ బంచేంద్రియవ్యాపారచాంచల్యము జిహ్వాదోషము విషదాహము తాఁజేయుకార్యములు తానెఱుగలేకుండుట, నిద్రాహారములు లేకుండుట యివి సన్నిపాతజ్వరమున ముఖ్యమైనగుర్తులు. పైగుర్తులు ఆహికాశ్రాంతజ్వరముల నుండనేరవు. ఆభేదమును అహికాశ్రాంతజ్వరభేదములందు వ్రాసినచోట జూడగాఁ దెలియగలదు.

మఱియు జ్వరములో గలుగునట్టి లక్షణభేదములుగాక అశ్రాంతజ్వరముకంటె నీజ్వరమునందు బహువిషరోగము లాశ్రయించి నిద్రాహారములు లేక నానాకష్టములం బరపుచుండును. అహోరాత్రములందు జ్వరమువిడువక కడుతీక్ష్ణముగనుండుట విడుపుకాల మత్యల్పముగనుండును. వీనిచే త్రివిధజ్వరభేదములం గ్రహించవలెను.

అదియుంగాక పైసన్నిపాతలక్షణములు ఆహికాశ్రాంతజ్వరములందుగాని, తదితరరోగములందుగాని, మిశ్రమమైనప్పుడుగాని అది విషాశ్రితమైనదిగాన నసాధ్యముగా నెంచవలెను.

మఱియుఁ నన్నవస్త్రములు గృహములు శుభ్రములేకుండుటవలనను, క్రిమిజాతులు మురికియుంగలయుదకము ద్రాగుటవలనను, మురికిస్థలములందును విశేషము నెమ్ముగలచోటులందు వాసముజేయుటవలనను, నశ్రాంతజ్వరమునందును వాతాదులయందును జెప్పినకారణములవలనను నీవిషములు గర్భస్థమైన కొంతకాలమునకు సన్నిపాతజ్వరముగా బరిణమించును.

మఱియుఁ మిథ్యాహారవిహారములు చేయునట్టిజనులకు రోగసంభవమును, మిథ్యాహారవిహారములం జేయురోగులకు విషాస్పదమును ధ్రువముగ గలుగును. అదిగాక వేసవికాలమునను శీతోష్ణసంధికాలమునను వసంతఋతువునను ఋడుచుతనమునను ఏడుసంవత్సరముల కొక్కొకసంధికాలంబునను బాల్యాది

సంధికాలంబునను ఈ మొదలైన కాలములయందు సన్నిపాతజ్వరము సంభ వించును.

సన్నిపాతజ్వరమునకు మూలాధారంబైన శీతోష్ణవాతములు పైనుద హరించిన మిథ్యాహారాది కారణాంశములతో విషముగ సంకలితమై, యన్న పానీయాషధాదుల జీర్ణింపజేయునట్టి యూష్మము బహిర్గతమై, శరీరము యొక్క బాహ్యాంతరాశయములను జెఱచునట్టిరోగములంగలిసి తరుణకాల మున వేదనంబడి మధ్యకాలంబున బహురోగాశ్రితముగ విశేషశక్తిహీనమై ప్రబలవేదనలంబడి పురాణమున తద్విషముబహుళమగుకొలది నింద్రియమనో వ్యాపారములు చెడి తనబాధ తానెఱుగక ప్రళయాగ్ని వాతాదిసంభూతమయిన రోగములంగూడి రసాసృక్ మాంస మేదోస్థిమజ్జాశుక్లములను జీవితాశయమైన కళేబరమును హరించును. కడుబాధలంబడి పిదప జీవుడు పంచభూతాదులంగలసి పోవును. ఈజ్వరమునం దసాధ్యమైనయామయములు సంక్రమించుటంబట్టి క్రూరమైనదిగా నెంచవలెను. తదనంతరమున సన్నిపాతమనగా జన్నియని యర్థము. జన్నియనగా నంగములనీడ్చుకొనునట్టి రోగము. మఱియు సన్నిపాత మనగా చేరుట.

ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః.

అనువాక్యంబున మేఘములో భాగ మంట యుదకము వాయువు నివి సన్నిపాతముగ నుండునటులనే విరుద్ధముగ జ్వరమునందును బహురోగములు గలిసియుండుటయే సన్నిపాతజ్వర మను పేరంబరగును.

మఱియు జ్వరమునందు వాతాదిదోషములు విషముగ సంక్రమించి, వాతరోగములు పిత్తరోగములు శ్లేష్మరోగములు జ్వరమునకు ద్వంద్వవికార జనితరోగములు, ప్రతికూలముగ గూడియుండుటయే,సన్నిపాతముగా నెఱుంగ వలయును.

అదియునుంగాక సన్నిపాతజ్వరము త్రిదోషాత్మకవిషస్వరూపముగల దైనను, వానిలో శ్లేష్మమునైనను పిత్తంబునైనను వాతంబునైనను ప్రధానంబుగ

గలిగియుండును. అట్టిస్థైర్యము గలిగియుండునట్టి వాతాదులం దేది ప్రబల వృద్ధిగలిగియుండునో, దానిసామంబున నొప్పుచుండును. అనగా పిత్తప్రకోప ముతో గూడియుండుదానిం బిత్తసన్నిపాతమనియు, శ్లేష్మప్రకోపముతో గూడియుండుదానిని శ్లేష్మసన్నిపాత మనియు, వాతప్రకోపముతో గూడి యుండుదానిని వాతసన్నిపాతమనియు, వ్యవహరింతురు.

మఱియుం జ్వరముయొక్క స్వభావము వాతముగాను, దానిలో గలిగి యుండు రోగము పిత్తయుక్తముగాను నుండుదానిద్వంద్వదోషమనియెదరు.

అదియెట్లనగా, వాతపైత్యము వాతశ్లేష్మము పైత్యశ్లేష్మము లనునవి ద్వంద్వదోషమనియు, వాతపైత్యశ్లేష్మములు ప్రకోపించుదానిం ద్రిదోషసన్ని పాతమనియు వ్యవహరింతురు.

అదియునుంగాక జ్వరమునందుగలరోగముల లక్షణములును బ్రత్యక్ష మైన గుర్తులనుబట్టి, యేక ద్వి త్రిదోషయుక్తములు దెలియబడును.

మఱియు నాడీజ్ఞానమువలన నేక ద్వి త్రిదోషయుక్తసన్నిపాతములను సాధ్యాసాధ్యములను భిషగుత్తములు నిర్ణయింతురు.

## వాతసన్నిపాతనిదానము

సంధ్యస్థి శిరసశ్శూలం ప్రలాపో గౌరవం భ్రమః,
వాతోల్బణే స్యాద్వ్యనుగే తృష్ణా కంఠాస్యశుష్కతా.

అస్థిసంధులయందును శిరస్సునందును బోట్లు, కలువరించుట, శరీరము బరువుగనుండుట, భ్రమ, దప్పి, కంఠము నోరు నివి యెండుట ఇట్టిలక్షణములు గలది వాతోల్బణసన్నిపాతమని వచించెదరు.

## పిత్తసన్నిపాతనిదానము

రక్త విణ్మూత్రతా దాహః స్స్వేద స్తృడ్బలసంక్షయః,
మూర్ఛాచేతి త్రిదోషేస్యా ల్లింగం పిత్తే గరీయసి.

పిత్తాధికసన్నిపాతమునందు మలము మూత్రము యెఱ్ఱగనుండుట, దాహము చెమట దప్పి బలక్షయము మూర్ఛ ఇట్టిలక్షణములు గలిగియుండును.

## శ్లేష్మసన్నిపాత నిదానము

ఆలస్యారుచిహృల్లాస దాహోవమ్య రతిభ్రమైః,
కఫోల్బణే సన్నిపాతే తంద్రాకాసేన చాదిశేత్.

కఫోల్బణసన్నిపాతమందు ఆలస్యము అరుచి ఎక్కిళ్లు దాహము వమనము దేనియందు దిష్టములేకయుండుట భ్రమ తంద్ర దగ్గు ఇట్టిలక్షణములు గలిగియుండునని తెలియవలయును.

## వాతపిత్తసన్నిపాతనిదానము

భ్రమః పిపాసా దాహశ్చ గౌరవం శిరసోగురు,
వాతపిత్తోల్బణే విద్యాల్లింగం మందకఫజ్వరే.

వాతపిత్తోల్బణసన్నిపాతమందు భ్రమ, దప్పి, శరీరతాపము, శరీరము గురువుగనుండుట, మిగుల తలనొప్పి ఇట్టిలక్షణములు గలిగియుండునని యెఱుంగవలయును.

## వాతశ్లేష్మసన్నిపాతనిదానము

శైత్యం కాసోరుచి స్తంద్రా పిపాసా దాహరుక్ తథా,
వాతశ్లేష్మోల్బణే వ్యాథా లింగం పిత్తావరే విదుః.

వాతశ్లేష్మోల్బణాల్పపిత్తసన్నిపాతమునందు శైత్యము, దగ్గు, అరుచి, తంద్ర, దప్పి, దేహతాపము, శరీరమునొప్పి ఇట్టిలక్షణములుగలిగియుండును.

## పిత్తకఫోల్బణసన్నిపాతనిదానము

ఛర్దిశ్శైత్యంముహుర్దాహ స్తృష్ణామోహోఽస్థివేదనా,
మందే వాతే వ్యవస్యంతి లింగం పిత్తకఫోల్బణే.

పిత్తకఫాధికమందవాతసన్నిపాతమునందు వాంతి, శైత్యము, మాటిమాటికిఁదాపము, దప్పి, మోహము, ఎముకలయందునొప్పి ఇట్టిలక్షణములు గలిగియుండును.

## ఏక ద్వి త్రిదోషవిచారము

వాతపిత్తశ్లేష్మదోషములలో రెండు సమముగనుండి, యొకటి వృద్ధిజెందుట ఏకదోషము. ఒకటి సమముగనుండి రెండు వృద్ధిజెందుట ద్వంద్వదోషము.

అదిగాక వాతాదులు సమత్వమునొందక యుత్తరోత్తరవృద్ధిగ నొక దానికంటె నొకటి వరుసగాఁ బ్రకోపించుట, అనగా వాతము వృద్ధముగ పిత్తము వర్ధతరముగ శ్లేష్మము వృద్ధతమముగ నుండుట ఇట్లు త్రిదోషాధిక వృద్ధిచేగలిగిన సంసర్గదోషభేదములు ౬ ను అష్టాంగహృదయసూత్రస్థానము నందు జెప్పబడినవి చూడగా దెలియనగును. మఱియు నిట్లు వాతాదులవలన లక్షణములు భేదములై యుండు న్యూనాధిక్యము లెఱుంగునది.

ఇట్లు పైదోషములు జ్వరములోనుండుగుణము లన్నిటికంటె నేది ప్రబల వృద్ధిగ దోషమున కనుగుణముగ నుండునో దాని నామంబున నొప్పుచుండును.

జ్వరమునందు వాతాదిదోషములకు ఏక ద్వి త్రిదోషయుక్తముగ బ్రకోపించుట గలదు. అవి మొదటివారమున సామాన్యముగాను, రెండవవార మున ద్విదోషయుక్తముగాను, మూడవవారమున త్రిదోషయుక్తముగాను వ్యాపించును. అది సామాన్యగాఢవిషమములని వరుసగా నెంచబడును.

ప్రథమమున విషజ్వరమని యెఱుగరాక సామాన్యముగనుండి క్రమ ముగ విషయుక్తగుణంబుల బెనంగొని గాఢమగుట యొకవిధము. ప్రథమము లోనే తీక్ష్ణజ్వరముగ నొకవారము గాచుచు మధ్యకాలంబున గుణయుక్తమై నప్పుడు జ్వరము సామాన్యముగాను జ్వరము ప్రబలముగనుండునపుడు లక్షణ ములు సామాన్యముగాను నిట్లు ద్విమార్గముగనుండుట యొకవిధము మఱియు దొలుత విషాశ్రితముగ నుండునట్టి జ్వరములోబడి గాఢముగ నేర్పడి పిదప సామాన్యముగ నేర్పడునది సాధ్యముగాను అదిగాక మొదట సామాన్యముగ నుండునట్టిజ్వరము గాఢముగనేర్పడి గాఢము విషముముగ నేర్పడుట యసాధ్యముగాను నెఱుంగందగును.

ఈప్రకారముగ అనులోమ విలోమములుగా వ్యాపించునపుడు సాధ్యా. సాధ్యముల నిరూపించవలెను. జ్వరములోబడి దినక్రమముగవచ్చుచు మధ్య కాలమున హెచ్చుచుండునది కష్టసాధ్యముగ నుండును. జ్వరములో వాత పైత్యశ్లేష్మదోషములు వారివారికర్మాధీనంబులై నానావిధచేష్టలుగా దేశకాల తత్వభేదానుగుణముగ శరీరులకు వేదన గలుగజేయును. సన్నిపాతజ్వరము సాధారణముగా పేగులచెడుపువలన సంభవించును. ప్రత్యక్షపు గాయములు తగిలి యవయవములు చెడి నష్టమగునటుల జ్వరవిషముచే బాహ్యాంతరాశయ ములుచెడి నష్టమగనటుల జ్వరవిషముచే బాహ్యాంతరాశయములు పగులుటగాని నశించుటగాని సంభవించును. జ్వరప్రారంభమున నంగవిహీనతగలిగి క్రమముగా నంగముచెడును.

## సన్నిపాతజ్వరపూర్వగుణములు

సామాన్యలక్షణములు సామాన్యమయిన చలిగలిగియుండుట తలనొప్పి. యవయవములనొప్పి యిరుపు మరుపులు నావలింతలు మెడనొప్పి మూలుగుట త్రాణలేమి యేమియు దోచకనుండుట యాకలిగాకుండుట యిట్లు సాధారణ మైన దానివలె నుండును. కొన్నిరోజులవరకు విషజ్వరమని తెలియకుండును.

జ్వరప్రారంభములో మలబద్ధకము గలిగియుండును. తరువాత కొంత యధికముగాను, దినములు గడువగడువను మలశుద్ధి యవుచున్నట్టు గనుపడి. క్రమముగా విరోచనవ్యాధి గలుగును. కొందఱికిః ప్రథమజ్వరమువదలిపోయిన ట్లుండును. ప్రథమమున జీర్ణాశయమునకు గ్రమముదప్పును. అప్పుడు వమనము నొకిరింత ఆహారాపేక్షయు గలుగును. నాడిహీనముగనుండియు నొకప్పుడు వడి గాను నొకప్పుడు స్థూలముగాను నుండును. జ్వరము తొలుత సామాన్యముగ నుండినను విడువనిదిగనుండును. కొందఱికి మొదట నాహికజ్వరమువలెనుండి పిదప విషజ్వరమునం జేరును. మఱియును గొందఱికిః దరుణకాలమున సామాన్యముగ గలుగునట్టి పైగుణముల మిగుల వేదనకరములై తీవ్రజ్వర. సహాయముతో ప్రారంభమునందే గలిగియుండును.

అదిగాక ప్రథమమునందును, మధ్యకాలమునందును, పురాణకాలము నందును, గలుగులక్షణము లవి యివియని యేర్పడి యుండును. అవి యెవరెవరి శరీరమునకు నెట్లుగా గారణము గలిగియుండునో యట్లు తరుణమధ్యపురాణ కాలముల సాధారణగాఢవిషమములుగా జ్వరములో గలుగురోగములు బహు విధములుగా గలుగుచుండును. జ్వరోష్ణమునకుఁ జర్మ మెండినట్లుండును. ఇట్లు తరుణకాలమున సామాన్యముగనుండి మొదటివారపుఁ దుదిని నడుమలేనంతశక్తి హీనమగును. ఆకలి బొత్తిగా నిలిచిపోవును. నాలుక గోధుమ రంగుగా నుం డును. మలశుద్ధి చక్కగా నగును. జ్వరము గనిపెట్టగా నక్రాంతజ్వరమువలె నుండును. అనగా సంగమకాలమునుండి జ్వర మెక్కుచుండును. ఉదయకాల మునకు దిగుచుండును. జ్వరముయొక్క పూర్వగుణముల మార్పుగలుగును. లేక అవే ప్రకోపించును.

## మధ్యమకాలలక్షణములు

రెండవవారమునఁ గడువేదనగుణములు గలుగును. మూత్రము మిగుల నెఱ్ఱగానుండును. రాత్రి నిద్రభంగమగును; కలవరించును; వదరుచుండును. చెక్కిళ్లు తెలుపువాఱి ముఖమువాడక యథాక్రమముగ కాంతితోనుండుట, నేత్రములు నిర్మలప్రకాశత గలిగియుండుట, ప్రలాపము విస్తరించుట, చిత్త భ్రమగలుగుట, కన్ను లెఱ్ఱగనుండుట, శరీరము జడముగనుండుట, యతిసార వ్యాధి ప్రారంభించుట, పచ్చి బటానారంగువలె భేదులగుట, పేగులయొక్క కుడిభాగము మీదుగాఁ జేయివేసిన ముఖముచిట్లించుట, అప్పుడు పేగుబ్బి స్థానముతోలగియుండుట, నాలుక కఠినమై ద్రవములేక ముండ్లుబారియుం డుట, తలదిరుగుట, పిత్తప్రకోపముగ నుండుట, విరోచనములం దొకప్పుడు చీముగాని నురుగుగాని పడుట ఇత్యాదులుగలుగును.

రెండవవారాంతమున జిహ్వాదోషము పర్దిల్లును; విషదాహముగలుగును. జ్వరవృద్ధియగును. ఉదయమున థర్మామిటర్‌లో ౧౦౩ డిగ్రీలకు దిగుటయు, మూడవయామమున ౧౦౫ డిగ్రీలకు జ్వరవ్యాపకముగా నుండును.

కంఠమునందును నొసటియందును ఓష్ఠమునందును స్వేదముద్రవించుచుండును. కడుపులో నులిపెట్టుట, కంఠమునందు ముల్లుబారియుండుట, సర్వసంధులయందు వాపు ఎమిడికలు అప్పుడు దాని సంబంధమైన కడుపునొప్పి మబ్బు డోకు గలిగియుండును. ఈజ్వరములో నిష్కారణముగ లక్షణములు మాఱుట. ఎట్లనగా? నొకరోజు కడుచలిగలుగును. ఒకనాడు తీవ్రజ్వరము గాచును. ఒకనాడు మూత్రము మాటిమాటికి వెడలును. రక్తము మూత్రముగాగాని కుదపలుగాగాని వెడలును. ఒకనాడు జోరుచెమట పెట్టును. ఒకనాడు కడుదాహము గలుగును. నాలుక గొంతు నెండుచు నెంతయుదకము త్రాగినను దప్పిగనుండుట, మూర్ఛ దగ్గుగలుగును. విశేషభేదులగును. కడుపులో గడుమంట గలుగును. కడుపునొచ్చును. వమనము లగును. ఒడలు మండును. కపాలము నొచ్చును. ఎక్కిళ్లు గలుగును. పులకరించును. పునుకుట చిత్తభ్రమ గలిగియుండును. ఇట్లుత్పాతములగు పలువిధములయినలక్షణము లొక్కొకరో జొక్కొకవిధముగ గలుగుచుండును.

మఱియు జ్వరమునందుగలుగురోగములు కొంతవరకు వేదనగలుగజేయునవిగాగాని, యప్పటప్పటికి గలిగిపోవునవిగాగాని యుండును. ఇట్లు రోగములు గలుగుటకుగాని, అవి నివారించుటకుగాని కారణము గానరాకుండును.

జ్వరప్రారంభమున మతిభ్రమయుంట స్వల్పముగనుండి రెండవవారములో నంతకంటె వృద్ధియగును. రెండవవారము మధ్యలో రాత్రివేళ బులకరింతలు గలుగును. గిచ్చుకొనును; బట్టలులాగుకొనును; చిత్రముగ వ్రేళ్లతో జేయ బూనును. అప్పుడు నాడిని బరీక్షించగా, జేతి నీడ్చుకొనును. తంద్ర గలిగియుండును. నాడిసూక్ష్మగతిగా నుండును. అప్పుడు ప్రపంచజ్ఞానము దెలియకుండును. అప్పుడు పలుకరించగా దెలిసికోలేక యసంగతముగ బ్రలాపించుచుండును. కొంతసేపటికి దెలివొందును.

వమనము తెమడగా బచ్చగా బసరుగాగాని నల్లగాగాని వెడలును. అది పుల్లగాగాని యుప్పగాగాని చేదుగాగాని తీపుగాగాని యుండును. జ్వరము

యొక్క విషముచే నున్మత్తునివలె బలువిధచేష్టలు సేయంబూనును. విలపించును; నవ్వును; హాస్యకరమైనపనులు పరిపరివిధములుగ జేయసాగును.

మఱియుం గొందరికి ౭ మొదలు ౧౨ దినములమధ్యలో దద్దులు రొమ్మున వీపున కడుపున గలుగును. ఈగుర్తులు యూరోపియనులలో వచ్చును. హిందువులలో దద్దులువచ్చుటయు రాకుండుటయు గలదు. ఆదద్దులు చేతితో నణచితే గనుపడక గొంతసేపుండును. సాధ్యమునకువచ్చెడురోగములలో దద్దులు లేచును.

## పురాణకాలము

మూడవవారప్రారంభమునందు సాధ్యములోకి గొనివచ్చును. అప్పుడు పూర్వపుగుణములు లేకుండును. జ్వరశేషము నిలిచియుండును. ముందటిబాధలు లేకుండును. జ్వరము స్వల్పముగా గాచుచుండును. ఆహికజ్వరమువలెనుండును. మిగుల శక్తిహీనముగ నుండును. లక్షణహీనముగ జ్వరమేర్పడియుండును. అపుడు జ్వరహరచికిత్సజేయగా నిలిచిపోవును.

మఱియుం బూర్వలక్షణయుక్తముగ జ్వరప్రకోపముగ నుండునపుడు జ్వర మొకటి నిలుచుటకుఁ జికిత్సజేసినను నిలువకయుండును. ఒకవేళ నట్టి లక్షణయుక్తజ్వరము బహిర్వ్యాపకముగానున్నను, కూడనుండినరోగములు హారించక మిగుల బ్రకోపముగ నేర్పడును. కావున మిగుల రోగములతో గూడియుండిన జ్వరముగలవానికి నుపద్రవరోగములుహారించునట్లు చికిత్స జేయవలెను. అప్పుడు కూడనుండినరోగములు హారించి జ్వరముమాత్రము నిలిచియుండును. అట్టి జ్వరమునకు వెనుక చికిత్స గావించవలెను.

## అసాధ్యములోకి గొనివచ్చువారిలక్షణము

జ్వరము కొంచెముగాను, వానిలో రోగము కడుతీవ్రముగానునుండును. కొందరికి జ్వరము తీవ్రముగాను వానిలో రోగము తక్కువగాను వేధించును.

జ్వరమునందు బహువేదనయుక్తముగ గలుగునట్టిరోగము నిలిచియుండక యనేకరోగములం గొనివచ్చుచు, నొకదానివెంబడి నొకదానిమార్పులు గలిగించుచు, గడుంగష్టపఱచు చుండును.

మఱియు జిహ్వాదోషము ప్రబలమగును. నాలుక రొండును, ఎఱ్ఱగా ననేకవిధములుగానుండి తుదకుఁ బగలును, తర్వాత నల్లటి చుక్కలుగాగాని చారలుగాగాని యుండును. దంతములమీద నలుపుచారలు వచ్చును. జ్వరమునందు రోగములు సంక్రమించుట అనగా దగ్గురోగము గలుగునపుడు దాని వెంబడి నుండవలసినగుణములు గలిసియుండును. ఇట్లు లేరోగముగాని జ్వరములో సంభవించునపుడు వానికిగల నైజగుణములు వెంబడించుచుండునని తెలియవలయును. రోగాదులు వానిలక్షణసహాయములతో జ్వరములోగలియునపుడేది ప్రబలవృద్ధిగ గలిగియుండునో దానినామంబున నొప్పుచుండును. మఱియు బహిరంతర్గతాశయముల సంబంధయుక్తములయినరోగములు జ్వరములో సంక్రమించునపుడు సులభగాఢముల ననుసరించి రోగనిరూపణము జేసి అపుడు సాధ్యాసాధ్యములను గమనించవలెను.

మఱియు రెండవవారమునందుగలగుణములు ప్రబలవృద్ధియగును. కడు శక్తి హీనమగును; కొంచెమైనను నిద్ర లేకుండును; అతిసారము విశేషమగును. ఎల్లప్పుడు చిత్తవిభ్రమము గలిగియుండును. సర్వసంధులు వదలును; నాసిక ద్వారముగా రక్తము వెడలును. మెడ కుదియబడును. మఱియు మృగతృష్ణ కైపడి నింద్రియ మనోవ్యాపారములు వికలత్వముఁ జెందును. వచ్చినవారి నెఱుఁగక మఱొకరినిగా జెప్పుదురు. నాసికకు గంధవిపర్యయము, త్వక్కునకు స్పర్శవిపర్యయము, జిహ్వకు రసవిపర్యయము, చెవికి శబ్దవిపర్యయము, కంటికి రూపవైపరీత్యమును గల్గును.

అదిగాక తానేమిచేయునదియు నెఱుఁగరాకుండును. అప్పుడు టెంపరేచరులో ఎక్కువగును. ఉష్ణము విశేషమయినపుడు చిత్తవిభ్రమముగలుగును.

విషపిత్తోద్రేకమనగా పునుకట గడ్డలుగాగుకొనుట అధికమగును. తంద్ర వృద్ధి యగును. ఇట్లు గలుగుటకుఁ బేగులు మిగులఁ జెడియున్నట్లు తెలియవలయును. ఈడ్పువాతము సంభవించును. మూర్ఛరోగమువలె నీడ్పులు వచ్చును. జ్వరము వచ్చుటపోవుటలు కాలనియమములేక వ్యత్యస్తముగ నుండును. జ్వరముకన్నను లక్షణము లతివేదనాయుక్తముగనుండును. గర్భాశయములు పూర్ణముగ జెడ్డ యునికికి వచ్చును. అప్పుడు వానివానియాశయముల చెడుపునుబట్టి రోగములు గూడియుండును.

సన్నిపాతజ్వరమునందు గలుగులక్షణములు

సంధికశ్చాంతకశ్చైవ రుగ్దాహశ్చిత్తవిభ్రమః,
శీతాఙ్గస్తాంద్రికశ్చైవ కంఠకుబ్జశ్చ కర్ణికః.
భుగ్ననేత్రశ్చ రక్తోష్ఠః ప్రలాపో జిహ్వకస్తథా,
అభిన్యాస ఇతి ప్రోక్తా సన్నిపాతా స్త్రయోదశ.
షట్సాధ్యా స్సప్తచాసాధ్యా విజ్ఞేయా వైద్యపారగైః,

సంధికము, అంతకము, రుగ్దాహము, చిత్తవిభ్రమము, శీతాంగము, తాంద్రికము, కంఠకుబ్జము, కర్ణికము, భుగ్ననేత్రము, రక్తోష్ఠము, ప్రలాపము, జిహ్వకము, అభిన్యాసము లన సన్నిపాతములు ౧3 విధములు. వీనియందు సాధ్యములు ౬ అసాధ్యములు ౭ అని యెఱుంగవలయును.

మఱియు ౧. సంగములు శోభించియుండుట సంధిక యనియు, ౨. తంద్రవిడువకుండునది తాంద్రికయనియు, 3. పడ్చుచు వదరుచుండునది ప్రలాపమనియు, ౪. ఎల్లప్పుడు చిత్తవిభ్రమము గలిగియుండునది చిత్తవిభ్రమమనియు, ౫. నాలుక కఠినమై ద్రవములేక ముండ్లుబారియుండునది జిహ్వక మనియు, ౬. కర్ణమూలములయందు వాపుగలిగియుండునది కర్ణికమనియు, ౭. తలికె పగిలినొచ్చునది రుగ్దాహమనియు, ౮. కడుపులో కడుమంటగలిగి యుండునది యంతకమనియు, ౯. నేత్రములు గ్రుంకియుండునది భుగ్ననేత్ర

మనియు, ౧౦. మెడ కుదియబడియుండునది కంఠకుబ్జయనియు, ౧౧. రక్తము గ్రక్కుచుండునది రక్తష్ఠీవియనియు, ౧౨, శరీరమంతయు జల్లగ నుండునది శీతాంగమనియు, ౧౩. తెలివిలేక మైకముగనుండునది అభిన్యాస మనియు నెఱుఁగునది. ఈత్రయోదశవిధజ్వరములలోఁ బ్రత్యేకముగా గలిగి నపుడు సన్నిపాతవిషజ్వరముగా నెంచవలెను.

పై ౧౩ విధములు జీవసాధారమైన యాశయసంబంధమైన లక్షణములు. ఇట్టియాశయము లంటినరోగములు నసాధ్యములుగాను జీవావయవములందు గాయము వ్రణములు రోగములు గలిగినచో వానివానితీక్ష్ణసామాన్యములం దాలస్యశీఘ్రములుగా బ్రాణంబుల హరించును.

## సద్యోమరణచిహ్నములు

ప్రాణత్యాగకరమైన శ్వాసగలుగును. దీనికి ముందుగలిగియున్నగుర్తులు కనుపడకయుండును. రొప్పుగలుగును; మూలుగుట గలుగును. ముఖము నేత్రములు కళాహీనమగును. బొమ్మునగాని కడుపునగాని కదుమంటగలుగును. నేత్రములు గ్రుంకియుండుట, హీనస్వరముగలుగుట, తబ్బిబ్బుమాటలాడుట అభిన్యాసమను మైకము సంభవించును. ఇది శ్వాస కలుగకనే సంభవించును. కొందరు మైకముతోనే జీవము విడుతురు. అది దీపమారిపోవుటవలె విడిచివిడిచి కలుగుచుండును. సాధారణముగా నంతమున శ్వాసగలుగక జీవము విడువరు.

మఱియు కరపాదములందు నాభియందు శైత్య మంకురించి క్రమంబుగ నొడలంతయు నెఱయును. దల విసరు పుట్టును. లేక, తలవేలాడబడును, పొర్లాడును, కేకలువేయును, పొరలుచుండును, నాసికము చల్లనగును. జోరు చెమటగలుగును; నాడి మందగించుట, చపలముగనుండుట, శీతలాస్పదమయి నాడిగతి క్రమంబుగ హరించుట, అట్లు దీర్ఘశ్వాసతోనూపిరి త్రిప్పుకొనలేక తికమకలాడుచు లేచుచు గూర్చుండుచు నేమియుదోచక మెడలు నడుము నిలుపుకొనలేక జీవము బయట రాగలందులకు మిగుల నాయాసపడుచు, స్వేదము మిగుల స్రవింపుచు జాపుపెద్దయి తేలవేయుచుండును.

మఱియు నుదయమున టెంపరేచరు అనగా జ్వరోష్ణము దెలియపరచు నట్టిసాధనములో ౧౦౫ డిగ్రీలుండునపుడు అనగా జ్వర ముదయకాలమునఁ దగ్గుచుండుగదా, యట్టికాలమున విడుచుటగానక జ్వరము పూర్ణముగ నిండి యుండును. ౧౦౭ డిగ్రీలకు ఉష్ణము ప్రకోపించునపుడును శీతలాస్పదమై ౯౬-౯౫ డిగ్రీలకు ఉష్ణము హరించునపుడును సద్యోమరణచిహ్నములుగా నెంచవలెను.

అదియునుంగాక మొదటివారమున ౧౦౫ కు మించకుండగాను, రెండవవారమున ౧౦౪ కు మించుగాను, మూడవవారమున ౧౦౩ డిగ్రీలకు మించి జ్వరము విడిచియుండుకాలము దెలియబడకయు ననేక రోగములమార్పుతో మిగుల శ్రమజెందుచు, నతిదుర్బలమై నానాటికి శిథిలమగుచు పరులును నింటివారును సహింపజాలనిబాధను బొందుచుండుదకు చూచువారికిరోగి చచ్చుటే మేలని తోపింపజేయును.

జ్వరమున సమస్తాశయములం గలిగినరోగము లంతమున లంగ్స్ అనగా శ్వాసకోశములకు రోగము సంభవించును. అట్టిశ్వాసాశయముల రక్తవిభాగము యొక్క న్యూనాధిక్యములబట్టియే టెంపరేచరులో నుష్ణము హెచ్చు తక్కువ లగుట, దానిని రోగాకరమునుగా నెంచవలెను.

అలసినవానివలె శ్వాసము దీర్ఘముగానుండి, అట్టి శ్వాసకోశములరోగము తత్ స్థానమును గ్రమంబుగఁ జెడుపునకు గొనివచ్చి మిక్కిలి నశించుకాలమున మూర్ఛవచ్చుచు, జలువ క్రమ్మును. శ్లేష్మోద్రేకమగును. చెమట సంక్రమించును, స్ప్లీన్ లివర్ (యకృత్ ప్లీహములు) పెద్దవిగానుబ్బును రెప్పపాటు నిలుచును, కనుగ్రుడ్లు పెద్దవై తిరుగుచు వికృతాకారములై శ్వాసాయాసాదులులేక నీల్గుకొని నోరు విప్పుకొనుచు నచిరముగ పర్యవసించును.

మఱియుం గర్భాశయములు పూర్ణముగాఁ జెడిపోవునంతవరకు మూడు వారములు గావచ్చును. ఆద్యంతములు జ్వరమున గలుగురోగములమార్పు

న్యూనాధిక్యములతో సామాన్యగాఢ విష భేదములతో, నెంత చిరాచిర కాలము లందు నంతరాశముల జెఱచునో, యంత చిరాచిర కాలములందే జీవుడు శరీరము విడిచిపోవును.

రోగములకు విషమునకు సంబంధక్రమము

విషములు రెండువిధములు అనగా సర్పవృశ్చికములవంటివిషములు. వృశ్చికవిషము నంటినవానికి వానిబాధ దెలియునట్లును, సర్పవిషము నంటినవానికి వానిబాధ తెలియక స్మృతితప్పి మరణము జెందునట్లు ఈజ్వరములో తరుణకాలమున వేదనయుక్తముగాను, పురాణకాలమున వేదనరహితముగ నుండును. అఖిలామయములు పైరెండువిధములవిషములవలననే వ్యాపించుచుండునని యెఱుంగవలయు.

రోగాదులసంచారము

తనువును మూడుభాగములుగా భాగించి యూయూర్ధ్వాధోమధ్య భాగములలో రోగములు సంచరించుచుండును. పైమూడుభాగములలో రోగ మంటినపుడు తదనుగుణమైనగుణములు గానవచ్చును.

మఱియు శరీరార్థాంగభాగమును రోగము లాశ్రయించియుండును. శ్రీపరమేశ్వరుడు శరీరమును ద్విభాగములుగా భాగించి యంతయు నేకముగా గలిగినట్లు సృజించె. సమస్త బహిర్గతాంతర్గతావయవముల సంక్రమించునపుడు నాయంగమునకుగాని యొకపక్షమునకుగాని రోగము సంభవించును. అపుడు ఆయంగరోగమని పిలువంబడును.

బాహ్యాంతరద్వివిధరోగవిచారము

బాహ్యరోగములకు మూలము త్వక్కనబడును. వాని మూలంబుగ రసాదిధాతువులతో సంక్రమించి యాంతరరోగములు గలుగును. త్వక్ స్థానంబునజనించిన వ్యంగమ్ము కుష్ఠము గజ్జి విసర్పము మసూరికము వ్రణము గాయములు గుల్మము శోభయు మొదలైన బాహ్యరోగములు. వాని విషము త్వక్కునాశ్రయించి రక్తాది ధాతు మూలంబుగ నంతర్వ్యాపకమగును.

మఱియు గర్భస్థమైన దోషము తొలుత బహి ర్వ్యాపకమై శరీరము యొక్క త్వక్కు నాశ్రయించి, యవ్విషము ధాతువులం జేరి, యంతర్గత రోగములం గలియు నదియు నొకమతము.

## అంతరరోగములు

గర్భాశయమునందుగల యంత్రాశయము లందును, ధాతువులందును గలిగినవి యాంతర రోగములు. అవి ఛర్ది గ్రహణ్యా తిసారములు కాస శ్వాసలు నుదరరోగము జ్వరములు శోథయు నర్శ వ్యాధియుం గుల్మము విసర్పము మొదలయినవి.

మఱియుఁ బయిబాహ్యాంతరరోగముల రెంటికి నడుమ మధ్యమరోగము లని చెప్పంబడును. వెలుపలిరోగములు దాపలికిని, దాపలివి వెలుపలికింపోవుటకు సిరలు స్నాయువులు కండరములు మొదలయినవి రోగమార్గములని చెప్పబడును.

మఱియు బ్లాటింగ్ పేపరు అనఁగా అద్దుడుకాగిత మొకదానిగుణము తాను గ్రహించునట్టిది. ఒకదానికొకటి బహిర్గతాంతర్గతమధ్యమరోగముల జేర్చుకొనుచుండును. శిరస్సు హృదయము వస్తి మర్మములు నస్థిసంధులు నడుముపట్టు మొదలైనవి మధ్యమరోగములుగా జెప్పబడును.

మఱికొందరు బాహ్యాంతరములయిన ద్వివిధరోగమార్గములేగాని, మధ్యమరోగములుకూడ నాంతరరోగములని చెప్పుదురు.

జ్వరములో దోషాదులు నూర్ధ్వాధోమధ్యభాగాను గుణముగా లక్షణ ములఁ గలిగించుచుండును.

గర్భాశయములోని యంత్రాశయరోగములు హృదయరోగమున గలుగులక్షణములు గుండెమంటగాగాని నొప్పిగాగాని బరువుగాగాని యుండి యణచిపట్టినట్లుండును. జలుబు ముక్కుటగలుగును. ఊపిరి నీడ్చుకొనుట కసాధ్యముగ నుండును. కదలక మెదలక యుండును. గుండెనొప్పి; యానొప్పి గుండెదడ వెనుకవీపునకు డొక్కకు బారును. రోగముగలుగును. హృదయము రయిల్ ధ్వనివలె వినబడును.

## శ్వాసకోశరోగలక్షణము

ఊపిరితిత్తులయందు రోగము దగ్గుగలుగును. శ్వాస వడిగానడుచును. ముక్కునందు శ్వాస రావచ్చును. ఊపిరివిడుచుటలో పెద్దవారికి ౧౨ మొదలు ౧౮ వరకు వచ్చును. ఎంతబాలురుగనుండిన అంత వడిగా నూపిరివిడుతురు; ఊపిరివిడుచుటలో పూర్వముకంటె హెచ్చుతక్కువగ నుండునపుడు రోగము యొక్క గుర్తుగానుండును. ఊపిరి దీర్ఘముగా దీయలేకయుండును. గొంతు పొరబోయినట్లుండును. పిల్లులుకూసిన ట్లుండును. గొంతులో నుండ పెట్టినట్లుండును. నోట నీరూరును.

## సమస్తరోగప్రాప్తిలక్షణము

పంచభూతములు ధాతువులును సిరాదికండరములు మొదలయినవిగల శరీరమునందు నేయంగమున కంటినరోగ మాయంగమును వేదనజెంది నగాను ఆయంగము కొద్దిగొప్పలగుటగాని, చెమ్మగిలి ద్రవరూపంక్తముగనుండుటగాని కుష్కించిపోవుటగాని గలిగి, తుదను వ్రణముగాని గాయముగాని చెందును.

## యకృత్ రోగము

కార్యము:—అది పిత్తస్థానము, పైత్యరోగములకు మూలంబై యుండును. అందు కడుపునొచ్చును, పసరూరును, జీర్ణముతగ్గును, కడుపుబ్బును, గుల్మము గట్టును, అతిసారముగలుగును, జ్వరముగలుగు నుదరరోగము గలుగును.

## ఆంత్రజరోగము

పొట్టకు జీర్ణశక్తి హీనంబై నునుపుగలిగి యజీర్ణరోగము సంభవించును. పొట్టగాని పేగులు గాని నొప్పిగలుగును. లేక, ఆనాహరోగము గలుగును. జ్వర బల్లగలుగును, విరేచనములగును, మలబద్ధకరోగముగలుగును, క్రిములు పుట్టును

## కందనకాయరోగము

మూత్రము నూరజేయును; నొప్పిపుట్టును; ధాతునష్టము గావించును; శరీరమునకు శక్తిహీనమగును.

## అసాధ్య జ్వరలక్షణములు

జ్వర స్తీక్ష్ణోఽథవా శీత మథవాల్ప జ్వరోఽపివా,
నేత్రాంతా రక్తరహితా పాణిపాదనఖా స్తథా.
నేత్రే కాంతివిహీనే చ సాగరధ్వనినీ శ్రుతే,
స్వేదహీనజ్వర శ్చైవ హ్యథవా స్వేద ఉత్కటః.
ముఖే కాంతి స్తతో హీనా నేత్రే భుగ్నేఽథవా కృశే,
నాభి హృన్నాసికాపాద పాణిశైత్యం శిరోవ్యథా.
ఊర్ధ్వశ్వాసో ధనుర్వాతో హిక్కా సర్వాంగకంపనం,
శిరఃకంపోఽప్యపస్మారః కఫః కంఠంసమాగతః.
గంధస్వాదుం నజానాతి మలం కపిలవర్ణకం,
శిథిలా చపలాచ్చైవ నాడీ కుటిలసూక్ష్మతా.
ఆదౌ పిత్తగతిర్నాడీ తతో వాతగతి ర్భవేత్,
తతః శ్లేష్మగతిర్నాడీ చక్రవద్భ్రమతే ముహుః.
మందనాడీ భవేద్యస్య హ్యసాధ్యం భవతి ధ్రువం,
సరోగీ నిధనం యాతి విజ్ఞేయం వైద్యపారగైః.
సాధ్యాసాధ్యవిధిం జ్ఞాత్వా చికిత్సాం కురు పండిత.

శరీర మతితీవ్రజ్వరముగాను లేక శీతలముగాను నుండును. లేక స్వల్పముగాను, కనురెప్పలు రక్తములేకుండుట, పాదములు హస్తములు నఖములు తెలుపువారి రక్తములేకుండుట, నేత్రములు దృష్టిహీనముగనుండుట, చెవులలోన సముద్రపుధ్వని వినరాకుండుట చెమటలేనిజ్వరము గలుగుట, ఆరని చెమట గలుగుట, ముఖమున కాంతిలేకుండుట, నేత్రములు గుంతలయి క్రుంగియుండుట నేత్రములు కాంతిలేక కృశించి సూక్ష్మంబులై యుండుట, నాభి హృదయము నాసికము కాళ్లు చేతులు కడుచల్లనై యుండుట, కడుతీవ్రమైన శిరోరోగము గలుగుట, యూర్ధ్వశ్వాసముగలుగుట, ధనుర్వాతముగలుగుట, వెక్కిళ్లు గలుగుట, శరీరమంతయుం వణకుగలుగుట, తలవణకుగలిగి పొర్లుచుండుట, పట్టుట,

కులికెలోఁ గఫముకూడి యడ్డపడుట,పరిమళ ద్రవ్యములవాసన నాసికకు దెలియకుండుట, మలము కపిలవర్ణముగ వెడలుట, నాడిగతి మూడువేళ్లక్రింద మీటులేక స్థూలముగాగాని సూక్ష్మముగాగాని కుటిలమై వేగముగాగాని నడుచుట, త్రిదోషములు మూఁడును కలసి సూక్ష్మముగా గొంతసేపు స్థూలముగా గొంతసేపు నడుచుట, నాడిముందుగఁ బిత్తగతి వెనుక వాతగతి దానికి వెనుక శ్లేష్మగతి కలదై నడచుట, పలుమాఱు చక్రమువలె దిరుగుట, మందగతి నడచుట, యీవిధమైన నాడిగతియును, వైలక్షణములును సకలరోగములందును జ్వరములందును గలిగియుండిన నసాధ్యము గావున, నారోగి మరణము జెందును. అట్లగుటంజేసి సమస్తజ్వరములయు రోగములయు సాధ్యాసాధ్యత నెఱింగి, వైద్యవేత్తయగుపండితుడు చికిత్సజేయవలయును.

## ఔషధప్రయోగకాలము

క్షణాద్దోషాద్యవస్థాయాం కుర్యా ద్భేషజ యోగకృత్

దోషించినప్పుడే యౌషధం బీయవలయు.

## త్రిదోషసంచారము

అనిలో యాతి పిత్తేచ పిత్తం యాతి కఫాలయే,
కఫశ్చ కంఠమాయాతి దుర్లభం తస్య జీవితమ్.

నాభికి క్రిందిభాగముననుండువాతము ప్రకోపించి, నాభి క్రిందిభాగముననుండుపిత్తస్థానమును జెందును. అందువలన పిత్త ముద్రిక్తమై రొమ్మునందుండు శ్లేష్మస్థానమును జెందును. అందువలన శ్లేష్మము ప్రకోపించికులికె నడ్డగించును. దానివలన రోగి మరణము జెందును.

## అసాధ్యరోగచికిత్సావశ్యకత్వము

యావత్కంఠగతాః ప్రాణాః యావన్నశ్యతి చేంద్రియం,
తావచ్చికిత్సా కర్తవ్యా కాలస్య కుటిలా గతిః

ఈశ్వరేచ్ఛాకర్మగతుల నెఱుంగుట కెవ్వారికి నశక్యమగుటంజేసి ప్రాణములు కంఠగతంబగువరకును నింద్రియములు నశించువరకును, నసాధ్యరోగం కేనియుం జికిత్సం జేయవలయును.

దోషాగంతునిమిత్తేభ్యో రసమంత్రవిశారదౌ,
రక్షేతాం నృపతిం నిత్యం యత్నా ద్వైద్యపురోహితౌ.

యుక్తమైన ఔషధాదిస్వరూపములు, మంత్రములు వీనిని గుర్తెరిగిన వైద్యుడు, పురోహితుడు, వీరలు వాతాదిదోషములు ఆగంతుక మృత్యువులు. వీనివలన రాజును రక్షించవలయును. కాన వైద్యపురోహితులను రాజు స్వాధీనమం దుంచుకొనవలయును.

సద్వైద్యలక్షణము

వ్యాధే స్తత్వపరిజ్ఞానం వేదనాయాశ్చ నిగ్రహః,
ఏతద్వైద్యస్య వైద్యత్వం నవైద్యః ప్రభు రాయుషః.

వైద్యుడు రోగతత్వము నెఱింగి రోగమువలన జనించిన వేదనల శోషణచుటయందు సమర్థుండగునేగాని, ఆయువు నొసంగుటకు సమర్థుండు గాడు.

రాత్రౌ తాపం దివా శీతం వాతాతో నల్పజల్పకం,
కృష్ణజిహ్వాతిర క్తంవా శిరస్థాతుం నశక్యతే.

రాత్రి తాపముగలిగియుండుట, పగలు చల్లనైయుండుట, ధనుర్వాతము పుట్టుట, పెక్కుమాటలు, నాలుకనల్లనైగాని యెఱ్ఱనైగానియుండుట, లేచిన శిరస్సు నిలువకపోవుట యిట్టివిగలరోగి జీవించడు.

భుగ్న గ్రీవా తదానీలా మూర్ఛావాతః క్షణేక్షణే,
ఊర్ధ్వశ్వాసో భవేద్యస్య కఫకంఠో న జీవతి.

మెడ నిలువలేకయుండుట, కతికెలో పగిలియుండుట లేదా కంఠములో నల్లనైయుండుట, క్షణేక్షణే మూర్ఛరోగముగలుగుట, రొమ్ముపూవిరియుండుట,

పతికెలో శ్లేష్మముపడియుండుట ఈ లక్షణములు ఈ త్రివిధజ్వరములు రెండు గలి గినయెడల యమాలయమున కేగును.

అంగకంపో గతేర్భంగో ముఖే కుంకుమసన్నిభం,
ముఖే వారి చలద్వాయు స్సచ యాతి యమాలయమ్.

శరీరకంపముపుట్టినను నడవలేక సత్తువ క్షీణమైపోయినను ముఖ మెఱ్ఱనైయుండినను ముఖమున స్వేదము వాతమువలన చలనముగలిగియుండినను రోగి యమాలయమున కేగును.

చిరప్రవృద్ధో రోగస్తు భోజనేఽప్యసమర్థకః,
భగ్నగాత్రో భవేద్యస్తు నవైద్యోఽపి భిషగ్వరైః.

రోగికి మఱియు రోగములుపుట్టుచువచ్చినను, అన్నము తినకపోయినను శరీరముపగిలి పులిసీళ్ళుగారినను ఈలక్షణములు జ్వరములందుగాని రోగము లందుగాని గలిగెనేని వైద్యము చేయక మానవలెను.

క్షీణేంద్రియ స్స్వశాత్యార్థం శ్వాసశ్వాసోద్గమేన చ,
అంభో ద్విషయమేయస్య యస్య దీర్ఘస్వరాత్రకః.
తత్క్షవేగార్తరూక్షంచ తం హంతి జ్వరితం ధ్రువం,

నాడి చపలగతియు, కఠినగతియు, మందగతియు, వక్రగతియు, నతి సూక్ష్మగతియు, స్వస్థానమువిడుచుటయు గలిగెనేని బ్రతుకరని యెఱుంగ వలయును.

## చికిత్సక్రమము

ఔషధసహాయములేనివారు అశ్రాంతసన్నిపాతజ్వరములలో గొన్నిదేశ ములవారు 3, 2, ౧. లంఘనములుచేసి బాగుపడినది చూచియున్నాము. గాఢ విషమమార్గములుగనుండుజ్వరములలో లంఘనముజేసి స్వాధీనపరచుకొని పిదప లఘ్వాహారమునిచ్చుచు నౌషధచికిత్స నొసంగవలెను. విషౌషధముల నిచ్చుచు లంఘనము జేయుట కారాదు. ఈవిషజ్వరముపం దనేకరోగములు చేరుట సహ జముగావున వాని కనుగుణముగఁ జికిత్స చేయవలెను.

కాలకూటము, మహావాతవిధ్వంసి, సన్నిపాతభైరవి, మహాబాల సూర్యోదయము, తరుణార్కరసము, వాతవిధ్వంసి, రసభూపతి, దోషామృతము, స్వర్ణభూపతి, విషకోలాహలము, చింతామణి, అమృతరసాయనము మొదలగు నౌషధములను దగినయనుపానములతో నియ్యవలెను. ఉదకములో నౌషధమిచ్చుట అన్నిటికంటె శ్రేష్ఠము. ఇది మాయనుభవసిద్ధము. జ్వరములో పిత్తగుణము ప్రధానముగ గల్గిన కాలము వసంతగ్రీష్మఋతువులయందు చికిత్స స్వర్ణమాల్యవసంతము వసంతరాజము ఆనందభైరవి వైష్ణవీరసము ఇవి యియ్యవలెను. జ్వరములో నెమిడికెలును మలబద్ధతయు వాంతులును విరోచనములును దగ్గును నొప్పియు ప్రలాపము రక్తమూత్రము మొదలయినవాని కనుగుణముగ నౌషధములు ననుపానము నడుపవలెను.

మఱియు 'ఫినాసిటన్ అంటిపైరన్ మిటాసటన్ జేమ్సుపౌడర్' యివి యొక్కొక్కటి సలైన్ మిక్సరులో చిన్నపెద్దల ప్రమాణముల జ్వరకాలములో నీయవలెను. జ్వరములేనికాలంబున క్వొయినా యియ్యవలెను. జ్వరములోగల గుణములనుబట్టి యౌషధములను గూర్చవలెను. మఱియు నొకేవిధమైన యింగ్లీషౌధములను పలువిధములుగ వారివారి నేర్పుకొలంది వాడుదురు. మతభేదములచే చికిత్స లనేకములుగ నుండినను, రోగనిదానములు నంతభేదములుగ నుండజాలవు. ఈగ్రంథమునందు చికిత్సలజాడ చూపించుటయేగాని సవిస్తరముగా వ్రాయలేదు. ఇకమీదు వ్రాయబడును.

మఱియు భిషఙ్మణులగువారు తమతమ యొఱింగినచికిత్స లీగ్రంథమునందలి నిదానమును రోగమును సాధ్యాసాధ్యత్వములు నెఱింగి నడుపుదురని నమ్మెదను.

ఇది సన్నిపాతప్రకరణము

# పంచమ ప్రకరణము

## వాతాదిదోషస్వరూపనిరూపణప్రకరణ ప్రారంభము

శ్లో. ఆనంద మానందకరం ప్రసన్నం
జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం,
యోగీంద్రవంద్యం భవరోగభేషజం
శ్రీసద్గురుం నిత్యమహం నమామి.

శ్రీ జగన్నాయకుడు జగత్సృష్టికిమూలంబైన యన్నపానాదుల సమస్తజీవకోటికి జీవనము, జననము గలిగి యాయురారోగ్యబలవృద్ధికరముగ నుండునటుల సృజించెను. అవియే అత్యాహారములగుటవలననే జీవులకు రోగములై కడుబాధయును మరణము గలుగంజేయును. అట్టి మిథ్యాహారముల వలెనే మిథ్యాహారవిహారములవలన మనోవిహారములవలనను బైవిధములు గలుగును.

ఇట్టి ద్వివిధములైనయాదికారణములు పరిపరి విధములుగ నుండినను, వానిచే గలుగునని వాతపైత్యశ్లేష్మ దోషములు. తద్వారముగా భూతములును, ధాతువులనంటి సాయంగము వైషమ్యము జెందుటయే రోగస్వరూపము. శరీరమునందు బహిర్గతాంతర్గతావయవములను జెరపునది యిట్టిరోగమని దెలిసికొనుట కష్టతరము. రోగములు బహిరంతర్వ్యాపకములని ద్వివిధంబులు.

అందు నంతర్వ్యాపకము నసాధ్యముగాను, బహిర్వ్యాపకమును సాధ్యముగా నెఱుంగునది.

మనము భుజించుపదార్థభేదముల చెడుపువలనగాని, అత్యాహారముల వలనగాని, విహారములవలనగాని, విద్యాభ్యాసరాగద్వేష మనోవికాసములవలన గాని, ఆరోగ్యాలయమయిన తనువున శీతోష్ణవాతసమత్వముజెడి న్యూనాధికములగుట రోగప్రవేశమునకు మూలంబు. తద్రోగము బహువిధముల సంచరించుటకు వాతాదిదోషములు ముఖ్యంబులై యుండును.

జఠరాగ్నిమూలమున శరీరము రక్షింపబడుచున్నది. శరీరము చక్కగా నుండుటచేత జీవించియున్నాడు. కనుక సర్వప్రయత్నములచేత అగ్నిని శరీరమును రక్షించుకొనవలయును.

జాఠరాగ్ని సమస్తామయములకు మూలంబై యుండి మనయన్నపానాపథాదుల జీర్ణము జేయుటకును సాయాయవయవములకు బాపకపరచుచు తదాహారమున కనుగుణమ్ముగ నింద్రియపాటవము బలము ధైర్యసాహసములు

సమదోషసమాగ్నిస్తు సమధాతుమలక్రమః,
ప్రసన్నాత్మేంద్రియమనా స్స్వస్థ ఇత్యభిధీయతే.

మఱియు సమస్తరుగ్మతలందు నాకలి మిగుల బాగుగ నుండువరకు నసాధ్యము లేకుండును. జీవితకాలమువరకు రోగులుగ నుండువారికేనియు నాకలి మిక్కిలి బాగుగనుండువరకు జెడుపులేదు. ఏరుజములో నాకలి లేకుండునో యది యసాధ్యము.

అఖిలజీవులకు నాహారము సమస్తవృద్ధికరముగావున నది లేమిచే రోగప్రాబల్యము మరణముగలుగును. జ్వరము లేనిరోగములు కొన్ని సులభములు.

మఱియు నాహారమువలెనే నిద్రయు సమస్తజీవులకును సౌఖ్యకరముగావున, నిద్ర లేనిరోగము అసాధ్యము. అత్యాహారవిహారకారణదోషానుగుణముగ కాలదోషము సంక్రమించునపుడు రుజము గాఢముగ నేర్పడును.

మఱియు నాదికారణదోషము లనగా నత్యాహారవిహారభేదములు. తద్వారముగా త్రిదోషములు న్యూనాధికములయి సమస్తరోగోత్పత్తికిని వానిలో ప్రకోపమగుదోషములు నానావిధములుగ ప్రకోపించుటకును, సామాన్యగాఢవిషములుగా వ్యాపించుటకును, మరణమునకును మూలాధారంబై కారణంబులకెల్లం గారణంబులును, తత్కారణంబులకెల్లంగారణంబయిన రోగములుగా నగుచున్నవి. అవి కార్యకారణములకు మూలస్వరూపములయి యుండును. రుజము లసంఖ్యాతములుగనుండినను, వానిచేగలుగుఫలితము వాతపైత్యశ్లేష్మదోషములకంటె వేరుగానము.

## త్రిదోషస్వరూపనిరూపణము

వాతము = వాయువు; పైత్యము = ఉష్ణము; శ్లేష్మము = శీతలము మిథ్యాహారవిహారములవలన శరీరమునకు గలుగునట్టి శీతోష్ణవాతము లనునవియే. వాతపైత్య శ్లేష్మదోషములుగా బెద్దలు వ్యవహరింతురు. అట్టి శీతోష్ణవాతముల వలన దేహమున నేమి వికృతి గలుగుననగా ఉష్ణాధిక్యమువలన పిత్తరోగము లును, శీతలమువలన శ్లేష్మరోగములును, వాతాధిక్యమువలన వాతరోగములును సంఘటిల్లును. ఇట్టివికృతులవలన ననేకరోగములు సంఘటిల్లును. జ్వరములోగాని పెక్కువిధములుగ నుండినను పై త్రిదోషములకన్న వేరుగానము.

మఱియు వాతాదులు స్వప్రమాణముకంటె నధికముగగాని, స్వల్పముగగాని గలిసినపుడు రుజము సంభవించును. వాతాదిదోషములలో నొకటిగాని రెండుగాని మూడుగాని న్యూనాధికములగునపుడు వాతాధిక్యమువలన వాతరోగ మనియు, పిత్తాధిక్యమువలన పిత్తరోగమనియు, శ్లేష్మాధిక్యమువలన శ్లేష్మరోగమనియు జెప్పంబడును. ఒకజాతిదోషముగలసినపుడు ఏకదోషమనియు, రెండేసి దోషములుగలసినపుడు ద్వంద్వదోషమనియు, మూడుదోషములతోగూడినపుడు త్రిదోషరూపసన్నిపాతమనియు నెఱుంగవలయును. ఇటులనే రోగములలోజేరియుండు నేక ద్వి త్రి దోషములంగలసియుండు వాని నెఱింగి, సాధ్యాసాధ్యకష్టసాధ్యముల నిరూపించవలెను.

మఱియు వాతము పిత్తము శ్లేష్మము ఇవి ఏకదోషములుగాను, వాత పిత్త-వాతశ్లేష్మ-పిత్తశ్లేష్మములు. ఈ 3ను ద్వంద్వదోషములుగాను, వాత పిత్త శ్లేష్మములు త్రిదోషములు గూడినది సన్నిపాతముగాను నెఱుంగునది. ఈసప్తవిధ భేదములు సకలరోగజ్వరములందును గలుగును. రోగము జ్వరము బహులక్షణములుగ గూడియుండినను నానావిధములుగ మాఱుచుండినను ఏక ద్వి త్రిదోషములతో సామాన్యగాఢవిషమములుగా నెఱుంగవలయును.

పైత్యముష్ణేన బహుళం శ్లేష్మశ్శీతేన జాయతే,
వాతం బహుభవేద్వాయో ర్జ్వరశ్చైవం త్రిదోషజః,

మఱియు రుగ్మతసంభవించుటకు రోగసంజాతకారణమైన వాతాది దోషములసంయోగమువలనంగలుగు ఉపచయప్రకోప రూపమే ఆదికారణముగ నున్నది. ఆదికారణదోషానుగుణముగ వాతాదులు రోగములంజేరి స్థూల సూక్ష్మముగ బరిణమిల్లును. మిథ్యాహారకారణము దేని సంబంధమైనదో దాని కనుగుణముగఁ ద్రిదోషములు ప్రకోపించును. అనగా వాతపదార్థము భుజించుట, ఉష్ణపదార్థము భుజించుట, శీతపదార్థముగొనుట మొదలైనవాని కనుగుణముగ వాతపైత్య శ్లేష్మదోషములం ద్రిప్పకొనుచుండును.

జ్వరము వ్రణములు నేత్రకర్ణమేహనప్రసూతి మొదలైన యవయవరుజావళులందు ద్రిదోషములు గలసి నానావిధములుగా వ్యాపించుచు. అవి వేదన యుక్తముగాని, వేదనరహితముగాని, స్వల్పాధిక్యములతో నాలస్యశీఘ్రములుగా నవయవములందు రుజము గలిగించును. మఱియు విహారములవలన నంగవైషమ్యము గలుగు నటులనే వాతాదులవలనఁ బురాణకాలమునఁ దదంగహీనత బొందును. మిథ్యాహారవిహారములు రోగకరములుగ నుండుటయేగాక, స్వల్పాహారములవలనను రోగముగలదు. ఆయురారోగ్యాభివృద్ధియు నాహార విహారములవలననే గావున, నవి స్వల్పాధికములగుటచే త్రిదోషములు వైషమ్యముజెంది రోగసంభవము జేయును; ఈరెంటికి ననుకూలమైన మితాహారవిహారములు సర్వకాలసర్వావస్థలయందు నఖిలజీవులకు నాయురారోగ్యబలవృద్ధికరములుగా నెంచవలెను.

## సర్వరోగకారణన్యూనాధికవాతాదులస్వరూపము

మఱియు వాత పైత్య శ్లేష్మ దోషములు తారతమ్యములేక సమముగ నుండుటయు, నాయురారోగ్యబలదీప్తి వృద్ధికరముగను, అవియే దుష్కారణములవలన హెచ్చుతక్కువలగునప్పు డారోగ్యహానికరముగను, నుండును. వాతాదులు స్వప్రమాణముకంటె నధికముగాని స్వల్పముగాని గలిగినపుడు రుగ్మత గలుగంజేయును.

## శరీరారోగ్యానారోగ్య రక్తవిచారము

ధాతవ స్తన్మలాదోషా నాశయంత్యసమా స్తనుం,
సమా సుఖాయ విజ్ఞేయాః బలాయోపచయాయ చ.

రసాదిసప్తధాతువులు వానిమలములు వాతపిత్తశ్లేష్మంబులను దోషంబులు నివి వైకల్యము జెందెనేని, శరీరమును నశింపంజేయును. మఱియును నవి సుఖంబుగ నుండెనేని సుఖము, బలము, శరీరపుష్టి వీనిం గలుగజేయును.

గ్రం. వాయుః పిత్తం కఫోదోషా ధాతవశ్చ మలామతాః,
శరీరదూషణాద్దోషా ధాతవో దేహధారణాత్.

సర్వేంద్రియసర్వావయవములపాటవమునకును నాయురారోగ్యబలవృద్ధులకును రక్తము ముఖ్యముగ నున్నది. అది సమస్తరోగోత్పత్తికిని మూలంబై యుండును. శరీరాధారమగురక్త మారోగ్యస్థితి వ్యాపకముకంటె మందత్వవేగత్వములు గల్గినపుడు జాడ్యముయొక్కగుర్తుగా దెలిసికొనవలయును. రక్తము తీవ్రముగ బారుచున్నప్పుడు జ్వరముగాను; మందముగా బారుచున్నపుడు బలహీనమైన వాతాదిరోగములుగాను నూహించవలయును.

మఱియు రక్తవ్యాపకము శరీరోష్ణముచే బలచనగా బారుచుండును. శరీరమాద్యంతముగాని, ప్రత్యేకముగ నొక్కొకచోటగాని, యథాప్రకారముకంటె కదుపలచనగాగాని, చిక్కనగాగాని పారునపుడు తదంగమునకు రోగప్రాప్తియని యెఱుంగునది. మఱియు నేయంగమున ఘృతమువలె రక్తము పేరుకొనునో తదంగము పూర్ణముగఁ జెడినట్టు లెంచవలెను. ఎప్పుడు రక్తము పేరుకొనుట కారంభించునో యపుడు రోగసంభవముగాను, రక్తమునందు శీతోష్ణవాతములు గలిగి యాయుష్ణము హెచ్చుట తగ్గుటవలన రక్తమునందు మందశీఘ్రవ్యాపకత్వములు గలిగినపుడు రోగసంభవముగాను, నెఱుంగవలయును.

## జాఠరాగ్నివిచారము

అగ్నిమూలం బలం పుంసాం బలమూలం హి జీవనం,
తస్మాత్సర్వప్రయత్నేన బలమగ్నిం చ రక్షయేత్.

జఠరాగ్నిమూలమున శరీరము రక్షింపబడుచున్నది. శరీరము చక్కగా నుండుటచేత జీవించియున్నాడు. కనుక సర్వప్రయత్నములచేత అగ్నిని శరీరమును రక్షించుకొనవలయును.

జాఠరాగ్ని సమస్తామయములకు మూలంబై యుండి మనయన్నపానావధాదుల జీర్ణము జేయుటకును నాయాయవయవములకు బాపకపరచుచు తదాహారమున కనుగుణమ్ముగ నింద్రియపాటవము బలము ధైర్యసాహసములు

సమదోషసమాగ్నిస్తు సమధాతుమలక్రమః,
ప్రసన్నాత్మేంద్రియమనా స్స్వస్థ ఇత్యభిధీయతే.

మఱియు సమస్తరుగ్మతలందు నాకలి మిగుల బాగుగ నుండువరకు నసాధ్యము లేకుండును. జీవితకాలమువరకు రోగులుగ నుండువారికేనియు నాకలి మిక్కిలి బాగుగనుండువరకు జెడుపులేదు. ఏరుజములో నాకలి లేకుండునో యది యసాధ్యము.

అఖిలజీవులకు నాహారము సమస్తవృద్ధికరముగావున నది లేమిచే రోగప్రాబల్యము మరణముగలుగును. జ్వరము లేనిరోగములు కొన్ని సులభములు.

మఱియు నాహారమువలెనే నిద్రయు సమస్తజీవులకును సౌఖ్యకరముగావున, నిద్రలేనిరోగము అసాధ్యము. అత్యాహారవిహారకారణదోషానుగుణముగ కాలదోషము సంక్రమించునపుడు రుజము గాఢముగ నేర్పడును.

మఱియు నాదికారణదోషము లనగా నత్యాహారవిహారభేదములు. తద్వారముగా త్రిదోషములు న్యూనాధికములయి సమస్తరోగోత్పత్తికిని వానిలో ప్రకోపమగుదోషములు నానావిధములుగ ప్రకోపించుటకును, సామాన్యగాఢవిషములుగా వ్యాపించుటకును, మరణమునకును మూలాధారంబై కారణంబులకెల్లం గారణంబులును, తత్కారణంబులకెల్లంగారణంబయిన రోగములుగా నగుచున్నవి. అవి కార్యకారణములకు మూలస్వరూపములయి యుండును. రుజము లసంఖ్యాతములుగనుండినను, వానిచేగలుగుఫలితము వాతపైత్యశ్లేష్మదోషములకంటె వేరుగానము.

## త్రిదోషస్వరూపనిరూపణము

వాతము = వాయువు; పైత్యము = ఉష్ణము; శ్లేష్మము = శీతలము మిథ్యాహారవిహారములవలన శరీరమునకు గలుగునట్టి శీతోష్ణవాతము లనునవియే. వాతపైత్య శ్లేష్మదోషములుగా బెద్దలు వ్యవహరింతురు. అట్టి శీతోష్ణవాతముల వలన దేహమున నేమి వికృతి గలుగుననగా ఉష్ణాధిక్యమువలన పిత్తరోగములును, శీతలమువలన శ్లేష్మరోగములును, వాతాధిక్యమువలన వాతరోగములును సంఘటిల్లును. ఇట్టివికృతులవలన ననేకరోగములు సంఘటిల్లును. జ్వరములోగాని పెక్కువిధములుగ నుండినను పై త్రిదోషములకన్న వేరుగానము.

మఱియు వాతాదులు స్వప్రమాణముకంటె నధికముగాని, స్వల్పముగాని గలిగినపుడు రుజము సంభవించును. వాతాదిదోషములలో నొకటిగాని రెండుగాని మూడుగాని న్యూనాధికములగునపుడు వాతాధిక్యమువలన వాతరోగ మనియు, పిత్తాధిక్యమువలన పిత్తరోగమనియు, శ్లేష్మాధిక్యమువలన శ్లేష్మరోగమనియు జెప్పంబడును. ఒకజాతిదోషముగలసినపుడు ఏకదోషమనియు, రెండేసి దోషములుగలసినపుడు ద్వంద్వదోషమనియు, మూడుదోషములతోగూడినపుడు త్రిదోషరూపసన్నిపాతమనియు తెలియంగవలయును. ఇటులనే రోగములలో జేరియుండు నేక ద్వి త్రి దోషములంగలసియుండు వాని నెఱింగి, సాధ్యాసాధ్యకష్టసాధ్యముల నిరూపించవలెను.

మఱియు వాతము పిత్తము శ్లేష్మము ఇవి ఏకదోషములుగాను, వాతపిత్త-వాతశ్లేష్మ-పిత్తశ్లేష్మములు. ఈ 3 ను ద్వంద్వదోషములుగాను, వాత పిత్త శ్లేష్మములు త్రిదోషములు గూడినది సన్నిపాతముగాను తెలియంగునది. ఈ సప్తవిధ భేదములు సకలరోగజ్వరములందును గలుగును. రోగము జ్వరము బహులక్షణములుగ గూడియుండినను నానావిధములుగ మాఱుచుండినను ఏక ద్వి త్రిదోషములతో సామాన్యగాఢవిషమములుగా తెలియంగవలయును.

పైత్యముష్ణేన బహుళం శ్లేష్మశ్శీతేన జాయతే,
వాతం బహుభవేద్వాయో ర్జ్వరశ్చైవం త్రిదోషజః.

ఉష్ణముచేత దరుచుగ పైత్యమును, శీతముచేత శ్లేష్మమును, వాతమువల్ల వాయువును ఈరీతిగ త్రిదోషములచేత జ్వరము గలుగును.

మఱియు సర్వరోగంబులు వేఱునామంబులు గలిగియుండినను, బహులక్షణములతో వెలయుచుండినను, నీవాతాది దోషములే గలిగియుండును.

## వాతాదుల ఏక ద్వి త్రిదోషములవిచారము

౧. వాతము వృద్ధిజెంది పిత్తకఫములు సమముగనుండుట. ౨. వాతకఫములు సమముగనుండి పిత్తము వృద్ధిజెందుట. 3. వాతపిత్తములు సమముగనుండి శ్లేష్మము వృద్ధిజెందుట ఇవి ఏకదోషములు.

మఱియు వాతాదిదోషములసంసర్గముయొక్క తారతమ్యముభేదమువలన ౧. వాతపిత్తములు వృద్ధిజెంది కఫము సమముగనుండుట. ౨. వాతకఫములు వృద్ధిజెంది పిత్తము సమముగనుండుట. 3. పిత్తశ్లేష్మములు వృద్ధిజెంది వాతము సమముగనుండుట. ఇవిద్వంద్వదోషములు.

అదిగాక వాతాదిదోషములుసమత్వములేక ఏకోత్తరవృద్ధిగ నొకదానికంటె నొకటి ప్రకోపించుట. అనగా, వాతము వృద్ధముగ, పిత్తము వృద్ధతరముగ, శ్లేష్మము వృద్ధతమముగ, నుండుట. యిట్లు ౬ విధములు.

వాతము వృద్ధమై పిత్తము వృద్ధతరమై కఫము సమముగనుండుట యిట్లు ౬ భేదములు.

అంతేగాక దోషములు మూడును సమముగా వృద్ధిజెందియుండుట యొకటి. ఇటుల వాతాదిదోషము కార్యమునకు కారణములు బహుభేదములుగ నున్నవి. ఇట్టిబహుభేదములయిన వాతాదిదోషములు జ్వరములందును రోగములందును కారణభేదానుగుణముగ వ్యాపించుచుండును.

## వాతాదిక్షీణావస్థావిచారము

మఱియు వాతాదిదోషములు ప్రకోపించుటవలన వృద్ధియు, క్షయమువలన క్షీణతయును, జెందియుండును. అట్టి వృద్ధిక్షయములు బహుప్రకారములైన లక్షణభేదములతో రోగములు సంచరించుచుండును.

## వాతాదిదోషములయొక్క క్షీణావస్థావిచారము

౧. పిత్తకఫములు సమమై వాతము క్షీణముగనుండుట. ౨. వాతపిత్తములు క్షీణములై కఫము సమముగనుండుట. ౩. వాతము క్షీణమై, పిత్తము క్షీణతరమై కఫము సమముగనుండుట. ౪. వాతము క్షీణమై పిత్తకఫములు క్షీణతరములైయుండుట. ౫. వాతపిత్తములు క్షీణమై కఫము క్షీణతరమైయుండుట. ౬. వాత-పిత్త-కఫములు మూడును సమముగా క్షీణములైయుండుట. ౭. కఫము క్షీణమై పిత్తము క్షీణతరమై వాతము క్షీణతమమై యుండుట.

ఇట్లు వాతాదిదోషములు సమత్వక్షీణత్వములతో ఏక ద్వి త్రిదోషయుక్తముగ, శరీరతత్వభేదానుగుణముగ బహువిధములయిన లక్షణయుక్తములుగ రోగములై వ్యాపించును.

వాతాదిదోషములు వృద్ధిక్షయభేదములవలన రోగహేతువులగును. అదియెట్లనగా వాతాదిదోషములయొక్క సంసర్గము బహుప్రకారము. వానిలో స్వప్రమాణముకంటె నధికముగనుండును. దోషభేదములును క్షయావస్థను శెందియుండును. దోషభేదములును బహుసంఖ్యగలవిగ తెలియవలయును. ఇట్టి బహుభేదములును వానిలక్షణములును అష్టాంగహృదయ సూత్రస్థానగ్రంథమునందుఁ జూడగాఁ దెలియగలవు.

## సర్వరోగకారణత్వము

దోషా ఏవహి సర్వేషాం రోగాణామేవ కారణం,

సమస్తరోగములకు త్రిదోషములే ముఖ్యకారణము. అనగా త్రిదోషరహితముగ రోగం బేదియుం లేదని భావము.

## రోగస్వరూపములు

ఆదికారణములు అనగా మిథ్యాహారములవలన జనించునట్టి యజీర్ణాదిగుణములు, వానిలో వాతపైత్యశ్లేష్మదోషములు మిశ్రమమై యుత్పన్నంబగునవి శారీర రోగములనియు, నైజము లనియు, తదితరమిథ్యావిహారములవలన

జనించునవి యాగంతుకరోగములనియు తెలియంగవలయును. మఱియు మిథ్యాహారవిహారములవలననే మనోవిచారముగలిగి రోగోత్పత్తికి గారణములై యుండును. పైత్రివిధములందును బ్రారంభమున వాతాదిదోషములు వికలత్వము జెంది వేదనబొందించునవి నైజరోగములుగాను గాగలవు. చిత్తవైకల్యమువలన శిరస్సు, హృదయాద్యంగములు బలహీనములై రుగ్మతపాలగును. సమస్తరోగములు పైద్వివిధకారణములవ్యాపకములుగా గలవు. వానిలో నొక్కొకదానియం దనేకభేదములు బహువిధములుగా నున్నవి.

మఱియు నవయవములం జెడుపుజేయునపుడు నాయాయంగరోగములనిగాని; గుణములనుబట్టి వాతరోగములనియు, పైత్యరోగములనియు, శ్లేష్మరోగములనియు బిలువంబడును. శైత్యవాతమనియు, ఉష్ణవాతమనియు మేహవాతమనియు, శ్లేష్మవాతమనియు, ద్వంద్వములుగా వచింతురు.

మఱియు వాతాదిదోషములు ధాతువులతో మిశ్రమమైనప్పుడు, తద్ధాతునష్టరోగము జనించును. అట్లు సప్తధాతువులందు దేనిలో జేరు దోషము తదనుగుణమైనరోగముగా ఘటిల్లి, స్వల్పాధికత్వములతో వేదన జెందజేయును. ధాతువులం దొకదానికొకటి సాంక్రామికముగ సంచరించునపుడు క్రమముగా రుజము బలమైనదిగా గ్రహించవలయును. దోషములు ధాతువులంజేరునపుడు ఆయాధాతువులు తదనుగుణములైనలక్షణములు వేరు వేరుగా బహుప్రకారములు.

అదియునుంగాక నైజరోగము లనగా బ్రథమమున వాతాదిదోషములవలన శరీరేంద్రియములు ధాతువులు సమస్తావయవములు వీనినంటిన దోషము, వ్రణములు, రాజరోగములు, క్షుద్రరోగములం గలిగించి యంతర్బహిర్వ్యాపకములయి యాయంగము సాలస్య శీఘ్రగతులం జెడుపుజేయునవిగా తెలియంగునది.

## ఆగంతుకరోగములు

విహారాదికృత్యములవలన నంగవైకల్యముఁజెంది పిదప వాతాదిదోషములు మిశ్రములై వేదనగలుగఁజేయునది యాగంతుకరుగ్మతగా గ్రహించవలెను.

మఱియు నాగంతుకరుగ్మతలవలన దొలుత నంగము గాయము అనగా వైషమ్యముఁజెంది వెనుక వాతాదిదోషములు మిశ్రములై వేదనఁజెంది రోగమయినటులనే నైజరోగము త్రిదోషములవలన నవయవమునంటి పురాణమగు నాయంగము వైకల్యముఁజెందును.

మఱియు విహారాదికృత్యములు తనశక్తికిమించిన కార్యములు సాము, వ్యాయామము, వేటాడుట, సేద్యము, పరుగులిడుట, దాటుట, దుముకుట, విద్యాభ్యాసము, నగ్ని, వాయువు, విషమాశనము, భూతములు, మోహనము, ప్రసూతియు, తమతమస్వేచ్ఛాకృతాపరాధములవలన నంగములు వైషమ్యముఁబొందుట. అనగా నంగము గాయమగుట, గర్భమున జీవాశయములు జారలుట, శిరస్నాయువులు సంధులు సడలుట, మొదలైన గుర్తులుగలిగిన తదనంతరము, వాతాదిదోషములు మిశ్రములై యనేకభేదములయిన రుజలు గానవచ్చుచుండును. ఇవియే యాగంతుకరోగములుగ జెప్పఁబడును.

రోగములు అసంఖ్యాతములుగ నుండెనేని పైఁజెప్పిన నైజాగంతుకములలో జేరినవిగా నుండును.

ఇట్టి ద్వివిధమార్గములలో నానాభేదమైన తెగుళ్లకు ముందు వెనుకగా త్రిదోషములే మూలంబైయుండును. తద్ద్వారముగా బహువిధ సంచారములుగాను పరిపరివిధములయినరోగములుగాను నుండును.

మఱియు నైజాగంతుకములు రెండును, నైజంబాగంతుకముగాను ఆగంతుకంబు నైజముగాను రోగవిస్తీర్ణతకు వ్యాపకమగుచుండును. ఇట్టి నైజాగంతుకరోగములు శరీరంబునంజొచ్చి తెగులంటినయవయవము వైషమ్యమై

యందులో నొప్పి వాపుగలిగిగాని తద్రోగము శరీరమాంద్యము వేరొకవిధముగ గాని వ్యాపించి బాధించుచుండును.

నైజాగంతుకరోగంబు లాధారాధేయములతో నేకీభవించి తనువును శిథిలపరచుచు తద్ద్వారా మరణమవుటయే రోగస్వరూపము.

## కాయికమానసికరోగభేదములు

మఱల నయ్యవి కాయిక-మానసిక రోగభేదములు సకలరోగములకు వాతాదిదోషములు మూలమైనకారణములని చెప్పబడియుండునట్లుగా మానసిక రోగములకు రజస్తమోగుణములు రెండును దోషములుగానున్నవి.

మఱియు మనస్సు త్రిగుణములతో సాంక్రామికముగ గలిగియుండును. అవి రాజస-తామస-సాత్వికములను త్రిగుణములు. అవి సర్వత్ర సమముగ నుండక న్యూనాధికములుగ నుండును. అవి కార్యానుకూలముగఁ బ్రకోపించు చుండును. అట్టిగుణముల కనుగుణముగ రోగములు సంక్రమించుచుండును.

ఇట్టి మనస్సు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములతో కార్యానుకూలముగ వెలయుచుండును. త్రిగుణములలో నేది ప్రబలముగనుం డునో దానిస్వభావగుణముగలవాడని యెంచవలెను. దీర్ఘకాలానుభవానుగుణ ముగ శమదమాదిగుణములతో మెలగుచుండును.

ఇట్లు రోగము కాయికము మానసికము నని ద్వివిధంబు. అందు మాన సికములన మనోరోగములనియు, కాయికములన శరీరమునం బుట్టు నైజాగం తుకరోగములనియు జెప్పంబడును. అవి సమస్తరోగములందు నాధారాధేయ ములుగా నొకదానికొకటి సంబద్ధమై వ్యాపించి యుండును. మానసికరోగము లన మద మూర్ఛ సన్న్యాసిగ్రహభూతోన్మాదాపస్మారరాగద్వేష విషాదములు. కాయికములన శరీరమునం బ్రత్యవయవమునందును నేత్ర కర్ణ మేఢ్రయోని రోగములు, వ్రణములు గాయములు జ్వరములు మొదలైన నైజాగంతుక ములం గణింపరాని రోగజాలములు గలవు.

మఱియుం గాయిక రోగమున గలుగు వేదన మనస్సునకు దెలియుంట సహజంబై యుండునది మానసిక రోగము కాదు. అకస్మికముగాం బ్రారంభమున దుఃఖసంతోషాదులవలన మానసిక రోగము జనించి పిమ్మట శరీరరోగములగు సాధారాధేయములం బెనంగొని బహువిధములై ప్రాణిని వేధించును. అట్టి రాగరోగములం బెనంగొని నానావిధములుగ వ్యాపించునపుడు ద్వంద్వదోష మనియును, రెంటిలో నొకటితో వేదనబొందు నపు డేకదోషమనియు నెఱుంగవలయును. ఏరోగమునందుగాని చిత్తవైకల్యముగలిగియుండునది మనోరోగ మిశ్రముగా నెఱుంగవలయును. తద్రోగమున విషము సన్నిపాతమైనట్లు గ్రహించవలయును.

మఱియు మనోవిచారములవలనగలుగుభయము చింత-దుఃఖము-ఆలోచన-రాగాదులు రోగోత్పత్తికి మూలంబు. అట్టి మనఃకారణములవలన మేదోహృదాద్యంగములు రుగ్మతను జెందును. నైజాగంతుకములవలె సాంక్రామికములగును.

## రోగముల త్రివిధస్వరూపము

ప్రపంచమున నఖిలరోగములును సాతతిక-స్వాభావిక - సాంక్రామికము లని మూడువిధములు.

౧ సాతతికమనునది శీతోష్ణాజీర్ణాదికారణములవలన గలిగిన రుజము. సతతము వేదనయుక్తమయి చికిత్సచే బరిహరింపబడునది. ౨ ఐహికాముష్మిక దోషములవలన గలిగినరుగ్మత జీవితకాలమువరకు పీడించునది స్వాభావిక మని యెదరు. వ్యాప్యమైన పార్శ్వవాతము పీనసమూలము బొడ మధుమేహము కాసశ్వాస పరిణామశూల మూర్ఛ మొదలగురోగములు. ౩ అజీర్ణాదికారణములులేకనే సాంక్రామికముగ వ్యాపించునవి సాంక్రామికములు. మిథ్యాహార విహారములవలన గలుగునవిగావు. పశువులకు విషపుగాలి సోకుటవలన నరుకు రోగములు గలుగునటులనే, జనులకు నొక్కొకసమయమున నిష్కారణముగ

కొన్నిరోగములు సంభవించును. అవి మసూరికము విషూచి అహికజ్వరాదులు. ఈమూటియందనేక భేదములయినరుజములు పరిపరివిధములుగ వ్యాపించుచుండును.

## రోగములం దంతర్వ్యాపకములు

అనేకభేదములయిన సమస్తసైజాగంతుకరోగములు పైత్రివిధమార్గములుగ వ్యాపించుచుండును, వానిలో సమస్తమైనరోగములు సాహికాక్రాంతసన్నిపాతములుగాఁ బరిణమించును.

౧. ఏరోగముగాని యొకేపట్టుగ నిరంతరము వేధించుటగాని, ౨. కొంతసేపుండి కొంతసేపులేక యిటుల తిరిగి విడిచివిడిచి వేధించుటగాని, ౩. బహురోగాక్రితమై విషమముగగాని గలిగియుండును.

అఖిలరోగములు పైత్రివిధమార్గములకంటె భిన్నముగ గానరావు; సకలరోగములు వేరునామముల బొసగుచుండినను, అవి పైయాహికాక్రాంతసన్నిపాతముల త్రివిధములలో గలసియుండును.

మఱియు రోగము పైత్రివిధమార్గములందు నొకవిధమ్ముగా ననగా సక్రాంతమువలె నిరంతరము వేదనయుక్తముగనుండిన రోగము సాహికము వలె నప్పుడప్పుడు విడిచి విడిచి వేధించును; ఇటుల డిగి క్రమంబుగ నెమ్మదిగ వచ్చునది సాధ్యము.

౨. తొలుత సాహికమువలె నుండినరోగము క్రమముగ సక్రాంతసన్నిపాత్రములం జేరునది అసాధ్యము. ఇట్లు సాధ్యాసాధ్యములవరుస కనుగొనవలెను.

## సామాన్య తీక్ష్ణవిషమ భేదములు

మఱియు సమస్తామయములు సామాన్యతీక్ష్ణవిషమములం ద్రివిధమార్గములుగా వ్యాపించుచుండును. అవివేదనయుక్తముగ గలిగియుండును. వేదనరహితముగ గొన్నిగలవియయినను క్రూరమైనవిగా నెంచవలెను. సమస్తరోగములు గాఢముగ నుండునదియు, సామాన్యమైనదియుం విషమముగ నుండునదియుం

దరుణమైనదియుం బురాణమైనదియుంగా నెఱింగి తదనుగుణముగఁ జికిత్స గావించవలెను.

అఖిలామయములు జ్వరములవలె త్రిదోషాత్మకములు గావు. వాతాదు లొకయంగమునుగాని, యొకపార్శ్వమునుగాని స్థూలసూక్ష్మతలతో సిరాదిమూల ముగ నొకయంగమునుగాని, ధాతువులను భూతములనుగాని చెఱచునిమిత్తము గలిగెడురోగములుగా నెంచవలెను.

తనువునందు నొకయంగమునందు నొప్పి వ్రణము మొదలయినవి యొకభాగమున రోగముగలిగి వారివారి కర్మాధీనంబున సామాన్యగాఢ విషమ ములుగా నానాశ్రమముల బడంద్రోయును.

జ్వరము శరీరమాద్యంతము గలిగినరోగముగా గ్రహించవలెను. మఱియు వాతాదిదోషములు పరిపరివిధములుగా నాయారోగాశ్రితములయి బాధించు చుండును. అవిప్రకోపమువలనను క్షయమువలనను గుణభేదములు వేరు వేరుగా గలిగియుండును; అట్టివృద్ధిక్షయములు రోగముల తరుణపురాణ కాలములందు రోగములు భిన్నములయినను వాతాదిదోషములె సాధారణ తీక్ష్ణవిషమములుగ నుండును. అదియునుంగాక సమస్తామయము లుత్పత్తికి మూలకారణములయిన శీతోష్ణాజీర్ణాదులు స్వల్పాధికవిషమస్థితుల కనుగుణముగ త్రిదోషములు వృద్ధిక్షయములంగలసి నైజాగంతుకరుగ్మతలనుంగొని సామాన్య గాఢ విషమములుగాఁ బరిణమించుచుండును.

మఱియు నైహికాముష్మికదోషము లెంత సులభగాఢవిషమములుగ గూడియుండునో తదనుగుణముగ వాతాదులు ప్రకోపించి రోగములం జెంద జేసి యనేకరూపములుగా బ్రకోపించుటకును, తరుణమధ్యమపురాణకాలము లుగా వ్యాపించుటకును, జీవితకాలమువరకు వేధించుటకును, సద్యోవేదనయుక్త మునకును, రోగములమార్పులకును, సామాన్యగాఢ విషమత్వములనేక ద్విత్రి దోషయుక్తములుగ సంచరించుటకును, మరణమునకును, నాయాదికారణదోష బలముగా నెంచవలెను.

## ఉపచయప్రకోపలక్షణము

అదిగాక వాతాదిదోషమ్ము లుపచయప్రకోపములచే ద్వివిధంబులు. తద్దోషము నంటిన యంగమునందే గలుగునట్టి వృద్ధియుపచయ మనబడును. స్వస్థానమునుండి అన్యస్థలములకు సంచరించుట ప్రకోప మనబడును. ఈప్రకారముగ రుజములందు సామాన్యముగ నుండును.

## వాతాదిదోషముల ప్రకోపఋతుక్రమము

వర్షా శరదయో ర్వాయుః పిత్తం శిశిరచాతపే,
మధుహేమంతయో శ్లేష్మః ప్రకోపం యాతిదేహినామ్.

వర్షఋతువునందును శరదృతువునందును వాయువు ప్రకోపించును. శిశిరఋతువునందును గ్రీష్మఋతువునందును పైత్యము ప్రకోపించును. వసంతఋతువునందును హేమంతఋతువునందును, శ్లేష్మము ప్రకోపించును.

## త్రిదోషశమనఋతుక్రమము

గ్రీష్మే సంచయతే వాయుః ప్రావృట్కాలే ప్రకుప్యతి,
వర్షాసు చయతే పిత్తం శరత్కాలే ప్రకుప్యతి.
హేమంతే చయతే శ్లేష్మో వసంతేచ ప్రకుప్యతి,
ప్రాయేణ ప్రశమం యాతి స్వయమేవ సమీరణః.
శరత్కాలే వసంతేచ పిత్తం ప్రావృడృతౌ కఫః,

గ్రీష్మఋతువునందు వాతంబును, వర్షఋతువునందు పిత్తంబును, హేమంతఋతువునందు శ్లేష్మంబునుక్షీణించును. ప్రావృడృతువునందు వాతంబును, శరదృతువునందు పిత్తంబును, వసంతఋతువునందు శ్లేష్మంబును ప్రకోపించును. ఇటుల ప్రకోపించిన వాతపిత్తశ్లేష్మదోషములు క్రమంబుగ తదితరఋతువులయందు చికిత్సజేయకయే శాంతిజెందును.

## వాతాదిదోషకాలక్రమము

పూర్వాహ్ణే కుపితం శ్లేష్మం మధ్యాహ్నే చాతి పిత్తకం,
అపరాహ్ణే వాతకంచ పునఃపిత్తం నిశార్ధకే.

గ్రంథాంతరే:—

పునఃపిత్తం దినార్ధకే.

గ్రంథాంతరే:—

శ్లేష్మా ప్రాయస్తు పూర్వాహ్ణే ప్రదోషేచ ప్రవర్తతే,
పిత్తం ప్రాయస్తు మధ్యాహ్నే క్షపామధ్యే ప్రవర్తతే.
అపరాహ్ణేఽనిలః ప్రాయో నిశీథాంతే ప్రవర్తతే.

పగలు పూర్వాహ్ణకాలమందును ప్రదోషకాలమందును శ్లేష్మప్రాబల్యముగాను, మధ్యాహ్నకాలమందును అర్ధరాత్రియందును పైత్యప్రకోపముగాను, అపరాహ్ణకాలమందును అర్ధరాత్రాత్పరమందును వాతప్రకోపముగాను నుండును.

## బాల్యాద్యవస్థాభేదములు

కౌమారం యౌవనం వార్ధం ప్రాణినాం త్రివిధం వయః,
కఫపిత్తానిలప్రాయం క్రమతః ప్రకృతి స్త్రిధా.
ఆషోడశా ద్భవేద్బాలో వర్షాత్ క్షీరాన్నవర్ధకః,
మధ్యమం సప్తతిర్యావ త్తదూర్ధ్వం వృద్ధి రుచ్యతే.

తా. మనుజులకు కౌమారము, యౌవనము, వార్ధకము నని వయోవస్థలు 3 గలిగియుండును. అందులో కౌమారంబున శ్లేష్మప్రాయుండుగను, యౌవనమున పిత్తప్రాయుండుగను, వార్ధకంబున వాతప్రాయుండుగనుండును. కౌమారము పదియారువత్సరములవరకు నుండునుగాన, నక్కాలంబున క్షీరాన్నమును భక్షించవలయును. అందుకుపైన డెబ్బదివత్సరములవఱకు మధ్యముండనియు, దానికిబిదప వృద్ధుండనియు జెప్పంబడు.

బాల్య మాషోడశాద్వర్షా త్తతో మధ్యో౽ధిస ప్తతి,
వృద్ధ స్తదూర్ధ్వం విజ్ఞేయో వయో మానమితి త్రిధా.

తా. జన్మప్రభృతి ౧౬ సంవత్సరములపర్యంతము బాల్యము, ౧౭ సంవత్సరములు మొదలు ౭౦ వరకు మధ్యమవయస్సు, ౭౧ సంవత్సరము మొదలు జీవితకాలమువరకు వృద్ధత్వమనియు నెఱుంగవలయును.

మఱియుం బాల్యాద్యవస్థాభేద ప్రకారములుగా తెగులు నానావిధంబులు వ్యాపించుచుండును. అవస్థాత్రయభేదములచే నాయాయవస్థలయందు తెగులు వేరువేరుగా నుండును.

### వాతస్వరూపస్వభావగుణములు

పవన స్తేషు బలవా న్విభాగ కరణాన్మతః,
రజోగుణమయ స్సూక్ష్మ శ్శీతో రూక్షో లఘు శ్చలః.

వాయువు బలీయమయినదియు, భోజనముచేసిన పదార్థసారమును రక్తమును మలములును మొదలుగాగలవానిని వానిస్థానములకు పంపకము జేయుచుండునదియు, రజోగుణప్రధానమైనదియు, ననగా నితరసహాయములేకయే స్వాతంత్ర్యముగాఁ బ్రవర్తించునదియు, నొకప్పుడు చలువగాను నొకప్పుడుష్ణముగాను లఘువైనదిగాను చంచలముగాను నుండునవి వాతస్వభావగుణములు.

### పైత్యస్వరూపస్వభావగుణములు

పి త్తముష్ణం ద్రవం పీతం నీలం సత్త్వగుణో త్తరం,
కటుతి క్తరసం జ్ఞేయం విదగ్ధం చామ్లతాం వ్రజేత్.

పిత్తము ఉష్ణమే స్వభావముగలదియును, ద్రవముగను పీతవర్ణముగను నీలవర్ణముగను సత్త్వగుణప్రధానముగగలదియును, కారముగను చేదుగ నుండును. ఈరసమునకే యుష్ణపదార్థసంబంధమువలన జీర్ణస్థానముతప్పి పులుసగును.

గ్రంథాంతరే.—

పిత్తం వహ్ని ర్వహ్నిజం వా యదస్మా
త్పిత్తోద్రిక్త స్తీవ్రతృష్ణో బుభుక్షుః,
గౌరోష్ణాంగ స్తామ్రహస్తాంఘ్రివక్త్ర
శ్శూరో మానీ పింగకేశో ల్పరోమః.

పిత్తమే అగ్నియనిగాని, వహ్నివల్లఫుట్టినదనిగాని తెలియవలయును. ఏలయన అగ్నివల్ల గలుగునట్టిరోగమే పిత్తరోగము. అట్టిపిత్తరోగమునందు దాహము నాకలి శరీరమునకు గౌరవర్ణము ఇవి గలిగి ఉష్ణయుక్తమై చేతులు కాళ్లు ముఖము నెఱ్ఱబడి, శౌర్యము మానముగలిగి, కొంచెము వెండ్రుకలు కలిగి, రోమవెండ్రుకలు పచ్చనై యుండును.

## శ్లేష్మస్వరూపస్వభావగుణములు

కఫస్నిగ్ధో గురుశ్శ్వేతః పిచ్ఛిల శ్శీతల స్తథా,
తమోగుణాధిక స్స్వాదుర్విదగ్ధో లవణో భవేత్.

కఫము జిగటగను బరువుగను తెల్లగను నురుగుగలిగి చల్లగానుండును. తీపు రుచిగలిగియుండును. తమోగుణప్రధానంబుగనుండును. ఇట్టి శ్లేష్మమునకు విరుద్ధవస్తుసంయోగముచే లవణరసంబగును. లవణరసంబగునపుడే వ్యాధిరూపముగా బాధించును.

## మాసరోగక్రమము

మార్గే పౌషే తథామాఘే ఆషాఢే శ్రావణేపిచ,
భాద్రేమాసి చికిత్సజ్ఞై ర్వాతో రాజా ప్రకీర్తితః.
ఆశ్వినే కార్తికే మాసేవై శాఖజ్యేష్ఠయో ర్ధ్రువం,
సర్వశాస్త్రవిచారజ్ఞైః పిత్తం రాజా ప్రకీర్తితః.

ఫాల్గునే చైత్రమాసేచ జంతు పీడాకరో మతః,
శీతలాంబుసముద్భూత శ్లేష్మరాజా ప్రకీర్తితః.

మార్గశీర్షము పుష్యము మాఘము ఆషాఢము శ్రావణము భాద్రపదము ఈమాసంబులయందు వాయువు ప్రకోపించును. ఆశ్వయుజము కార్తికము వైశాఖము జ్యేష్ఠము ఈ మాసములయందు పిత్తము ప్రకోపించును. ఫాల్గునము చైత్రము ఈమాసంబులయందు శ్లేష్మము ప్రకోపించును. ఇట్లు సమస్త ప్రాణుల పీడించుచుండును.

## త్రిదోషములసంచారము

వాయుశ్చశల్యసంకృష్యః పైత్యర క్తగతి ర్భవేత్,
కఫశ్చ మాంసాధారస్స్యా త్త్రిగుణంతు యథాక్రమమ్.

వాయువు శల్యాధారముగను, పైత్యము రక్తాధారముగను, కఫము మాంసాధారముగను ఈమూడును యథాక్రమముగ నుండును.

## వాతస్థానములు

పక్వాశయకటీసక్థి శ్రోత్రాస్థిస్పర్శనేంద్రియం,
స్థానం వాతస్య తత్రాపి పక్వాదానం విశేషతః.

జీర్ణకోశము, పిఱుదులు, తొడలు, చెవులు, ఎముకలు, చర్మము అనునవి వాతమునకు స్థానములు. అయినను పక్వాశయంబుననే వాతం బధికముగ నుండుటంజేసి పక్వాశయమే వాతమునకు ముఖ్యస్థానము.

## అధానము

కటుతిక్తకషాయేతి రూక్షభోజనలంఘనైః,
అత్యాగాచ్చ భయోద్వేగా దుచ్చభాషణభోజనైః.
అతిజాగరణాచ్ఛోకశీతవాతాదిసేవనాత్,
వర్షాశీతాగమే చైవ కుపితో మారుతో భవేత్.

కారము, చేదు, వగరు, మిగుల వేడియన్నము, లంకణము, రాగ ద్వేషాదులవిడువమియు, భయోద్వేగంబును, గట్టిగా మాటలాడుటయు, సంభోగంబును, నతిజాగరణ, నతిశీతవాతాదులు దవులుటయుం వీనిచే వర్ష ర్తు హేమంతబుతుప్రారంభములందు వాయువు ప్రకోపించును. ఇవే వాతమునకు సాధానములు. అనఁగా వీనింజేపట్టివచ్చుననుట.

గ్రంథాంతరే:—

సంధారణాద్యశన జాగరణోచ్చభాషా
వ్యాయామయాన కటుతిక్త కషాయరూక్షైః,
చింతావ్యవాయ భయలంఘనశోకభీతై
ర్వాయు ప్రకోప ముపయాతి ఘనాగమే చ.

మూత్రాదులనుబంధించుట, భోజనం బొనర్చినతత్క్షణంబుననే మఱల భుజించుట, జాగరణముసేయుట, కంఠశోషముగల్గునట్లు మాటలాడుట, తిరిగి తిరిగి వేసరుట, గుఱ్ఱము మొదలగువాని నెక్కుట, కారము చేదు వగరు మందము గలపదార్థముల భుజించుట, చింతించుట, అతిమైథునం బొనర్చుట, భయపడుట, ఉపవాసముసేయుట, రోదనంబొనర్చుట, దిగులుపడుట వీనిచే వాయువు ప్రకోపించును. మఱియు వర్షించునపుడును వాయువు ప్రకోపించి యుండును.

**వాయుకర్మములు**

త్వగ్రూక్షజంఘాదవరోధశూలా
శ్యామత్వమంగేఽప్యపచేష్టభంగః,
ఉష్ణత్వశీతత్వఖరత్వదాహా
హ్యేతాని కర్మాణి వదంతితజ్జ్ఞాః.

చర్మమువేడి, పిక్కలచచ్చు, నొప్పి, శరీరము నల్లబడుట, చేష్టారాహిత్యము, వేడిమి, చలువ, గఱుసు, తపన యివి వాయులక్షణములు.

గ్రంథాంతరే:—

పారుష్యసంకోచనతోదశూలా
శ్యామత్వమంగవ్యథచేష్టభావాః,
స్తబ్ధిత్వశీతత్వఖరత్వశోషాః
కర్మాణివాయోః ప్రవదంతి తద్జ్ఞాః.

శరీరము బిగబట్టియుండుట, కడుపులో వ్యథగలుగుట, కడుపునొచ్చుట, శరీరము నలుపుగలిగియుండుట, కాళ్లుచేతులునొచ్చుట, శరీరము కంపముగలుగుట, ఇటుఅటు చలింపనేరక మొద్దువలెనుండుట, శీతలముగలుగుట, శరీరము ముండ్లుబారియుండుట, వాపుగలుగుట ఇట్టిలక్షణములు దోషయుక్తమగు వాత ప్రకోపంబున గలుగునని యెఱుంగవలయును.

## వాతప్రశాంతి

స్నిగ్ధోష్ణస్థిరవృష్యభోజ్యలవణస్వాద్వమ్లతైలాతప,
స్నానాభ్యంజనవస్తిమాంసమదిరాసంవాహనోన్మర్దనైః.
స్నేహస్వేదనిరూహకైశ్చ శయనై స్త్రీవోపనాహాదిభిః,
పానాహారవిహారభేషజమిదం వాయుం ప్రశాంతిం నయేత్.

మృదువుగనుండుపదార్థములు; ఉష్ణపదార్థములు; బలకరములగుద్రవ్యంబులు; ఉద్దులచే జేయబడినపదార్థములు; ఉప్పుపదార్థములు; మధురపదార్థములు; పులుసుగల పదార్థములు; నూనెపదార్థములు; మాంసము వీనిని భుజించుటచేతను; ఎండకాచుకొనుట, స్నానంబొనర్చుట, అభ్యంగనము చేసికొనుట, వస్తికర్మ, మిగులగాలిలేని స్థలంబులపరుండుట, మద్యపానంబొనర్చుట, శరీరంబును మర్దించుట, తోముట, నూనె నెయ్యి యివిమొదలగుతైలంబుల పానము చేయుంట, లేక లేపనంబొనర్చుట, చెమటకారునట్లు చేయుంట, నిరూహవస్తికర్మచేయుంట, ఏకాంతస్థలంబున నిద్రించుట, పాలుద్రాగుట, విహారంబొన

ర్చుట, ఇట్టికార్యంబు లొనర్చిన దోషయుక్తమగు వాతరోగము శమనంబు జెందును.

## పిత్తస్థానములు

నాభి రామాశయ స్స్వేదో లసికారుధిరం రసః,
దృక్స్పర్శనంచ పిత్తస్య నాభిరత్ర విశేషతః.

నాభిస్థానము ఆమాశయము చెమట చొంగ రక్తము రసధాతువు శీతోష్ణజ్ఞానసహిత నేత్రములు అనునవి పిత్తమునకు స్థానములు. అయినను పిత్తం బధికముగ నాభికి పైభాగమున నుండునది గనుక ముఖ్యస్థానమదియే యనఁబడును.

## ఆదానము

కట్వామ్ల మద్యలవణోష్ణ విదాహితీక్ష్ణైః
క్రోధాతపానలపరిశ్రమశుష్కశాకైః,
క్షారా దజీర్ణ విషమాశన భోజనైశ్చ
పిత్తం ప్రకోపముపయాతి ఘనాత్యయే చ.

కారము పులుసు తీపు ఉప్పు ఉష్ణపదార్థములు మిరపకాయలు ఇంగువ శుష్కశాకములయినతీక్ష్ణవస్తువులు వీనిని విశేషముగ భక్షించుటచేతను, అకాలంబున మిగులభుజించుట విశేషముగ మద్యపానంబొనర్చుట ఆగ్రహించుట ఎండలోనుండుట మిగులశ్రమపడుట నిప్పుసెగయందుండుట ఈమొదలగు కార్యంబు లొనర్చుటచేత పిత్తము ప్రకోపించును. మఱియు వరాకాలాంత్యంబునను సాధారణముగ పిత్తము ప్రకోపించియుండును.

## పైత్యలక్షణము

పురీషచ్ఛర్దిశ్చ విదాహరాగ
ద్వేషత్వరక్లేశనినాదకాయం,

ప్రలాప మూర్ఛా భ్రమశోషదాహాః
పైత్త్యాని కర్మాణి వదంతి తజ్జ్ఞాః

గ్రంథాంతరే:—
పరిభ్రమస్వేదవిదాహరాగౌ
వైగంధ్యసంక్లేదవిపాదకోపాః,
ప్రలాపమూర్ఛాభ్రమపీతభావా
న్పిత్తస్య కర్మాణి వదంతి తజ్జ్ఞాః.

శరీరము దిరుగుట చెమట అతిదాహము వస్తువులయందుప్రేమ దుర్గంధము కోపము ప్రలాపము మూర్ఛ భ్రాంతి పసుపువర్ణము ఇవిగలుగుట శరీర మార్ద్రముగనుండుట ఇట్టిలక్షణములు దోషయుక్తమగు పిత్తప్రకోపంబున గలుగునని యెఱుంగవలయును.

### — పైత్త్యప్రశాంతి —

స్నిగ్ధస్వాదు కషాయశీతపవన చ్ఛాయానిశావ్యంజనం,
జ్యోత్స్నాభూగృహవారియంత్రజలజస్త్రీగాత్రసంస్పర్శనం
సర్పిః క్షీర విరేక సేకరుధిరస్రావ ప్రలేపాదికం,
పానాహారవిహారభేషజ మిదం పిత్తం ప్రశాంతిం నయేత్.

మృదువగుపదార్థములు మధురపదార్థములు వగరుపదార్థములు శీతలపదార్థములు ఇవిభుజించుట, చల్లనిగాలి చల్లనినీడ వీనియందుండుట, రాత్రులయందు గాలిలోనుండుట, మురబ్బాలు లేహములు వీనిని భుజించుట, వెన్నెలలో బరుండుట, నేలమాడుగులందువసించుట, జలయంత్రముల సమీపమునం దుండుట, యౌవనస్త్రీ సమాలింగనం బొనర్చుట, పాలు నెయ్యి యివి ద్రాగుట, విరేచనమునకుఁ బుచ్చుకొనుట, శరీరమునందలి దోషరక్తమునుదీయుట, చందనము నలందికొనుట, వింజామరలు పట్టివేళ్లవిసనకఱ్ఱలు వీనిచే విసరుకొనుట,

శీతోదకాదుల పానంబొనర్చుట, పిత్తహరమగుపదార్థములు భుజించుట, విహరించుట ఇట్టికార్యంబు లొనర్చిన దోషయుక్తమగుపిత్తరోగము శమనంబు నొందును.

### శ్లేష్మస్థానములు

ఉరఃకణ్ఠశ్శిరః క్లోమా పర్వాణ్యామాశయో రసః,
మేదోఘ్రాణంచ జిహ్వాచ కఫస్య సుతరామురః.

హృదయము కంఠము శిరము మెదడు సంధులు బొడ్డుకుపైనుండెడి ఆమాశయస్థానమందుండు రసము క్రొవ్వు నాసికము నాలుకఅనునవి శ్లేష్మస్థానములు. అయినను శ్లేష్మం బధికముగ హృదయమందేయుండును గనుక హృదయమే ముఖ్యస్థాన మనబడును.

### ఆదానము

స్వప్నాద్దివా మధురశీతలమత్స్యమాంసైః
గుర్వమ్లపిచ్ఛిలతిలేక్షు పయోవికారైః,
స్నిగ్ధాతితృప్తిలవణోదక పానభక్ష్యై
శ్లేష్మా ప్రకోప ముపయాతి తథా వసంతే.

పగలు నిద్రించుటచేతను, మధురపదార్థములు శీతలపదార్థములు మత్స్య మాంసము మందపదార్థములు పులుసు జిగటపదార్థములు వీనిభుజించుటచేతను, కడుపునిండినపిదప నధికముగ భుజించుటచేతను, ఉప్పు ఉదకము వీనినధికముగ సేవించుటచేతను, పాలుత్రాగినపిదప నీరుత్రాగుటచేతను, శ్లేష్మము ప్రకోపించును. మఱియు వసంతఋతువునందు సాధారణముగ శ్లేష్మప్రకోపముగలిగియుండును.

### శ్లేష్మలక్షణములు

మూకత్వశీతత్వజడత్వకండూస్నేహో క్తదేహా స్తిమిరత్వనిద్రాః

ఉత్సర్గవిణ్మూత్రరతిప్రియాశ్చకఫస్య చిహ్నాని వదంతి తజ్ఞాః.

గ్రంథాంతరే:—

శ్వేతత్వశీతత్వగురుత్వకండూస్నేహప్రసేకస్తిమితావలేపాః
ఉత్సేదసంధాన చిరక్రియాశ్చకఫస్య కర్మాణి వదంతి తజ్ఞాః.

శరీరమునకు తెలుపువర్ణము, శీతలము బరువు దురద ఇవిగలిగియుండుట, శరీరము జిగటగనుండుట, చెమటపడియుంట, స్తిమితముగనుండుట, చలిబట్టుట, కార్యములందాలస్యముగనుండుట ఇట్టి లక్షణములు దోషయుక్తమగు శ్లేష్మ రోగంబునం గలిగియుండును.

## శ్లేష్మప్రశాంతి

రూక్షక్షారకషాయ తిక్తకటుక వ్యాయామనిష్ఠీవనం
స్త్రీసేవా ధ్వనియుద్ధజాగర జలక్రీడా పదాఘాతనమ్,
ధూమస్తాప శిరో విరేకవమనం స్వేదోపవాసాదికం
పానాహారవిహార భేషజమిదం శ్లేష్మాశమం గచ్ఛతి.

ఉష్ణపదార్థము ఉప్పుపదార్థము వగరుపదార్థము చేదుపదార్థము కారము ఇవిభుజించుట, తిరుగుట, మాటిమాటికి నుమియుంట, స్త్రీసంభోగంబొనర్చుట, త్రోవనడుచుట, కుస్తీసేయుంట, జాగరణసేయుట, జలక్రీడనాడుట, మాటి మాటికి గూర్చుండిలేచుట, పొగగ్రహించుట, ఒత్తడము వేసికొనుట, నస్యము సేయుంట, వమనంబొనర్చుట, (చెమటగలుగునటుల సేయుంట, ఉపవాసముగావిం చుట, ఉష్ణోదకాదులపానం బొనర్చుట, శ్లేష్మహారపదార్థములభుజించుట, విహ రించుట ఇట్టి కార్యంబు లొనర్చిన దోషయుక్తమగు శ్లేష్మరోగము శమనంబు నొందును.

## రోగ గణనసంఖ్య

అశీతివాతరోగములును చతుర్వింశతిపైత్యరోగములును వింశతి శ్లేష్మ రోగములును క్షయ పాండు శోభ కామిలా ఛర్ది మూర్ఛా కాసశ్వాసారుచి హిక్కారోగములును మేహరోగభేదములును మూత్రాఘాతాకృఛ్రాశ్మరి రోగములును గ్రహణ్యాతిసారరోగములును ఆనాహ ఉదావర్త విద్రధి గుల్మ యకృత్ ప్లీహ మహోదరరోగములును తృష్ణా దాహ హృద్రోగ విషూచ్యాలక మసూరికరోగములును అగ్నిమాంద్యాజీర్ణరోగములును కుష్ఠ విసర్పి విస్ఫోటకరోగములును అర్శోపదంశ మేఢ్ర భగంధర అండవృద్ధి రోగములును వంధ్యార్తవ ఋతుభేదయోనిరోగములును గర్భిణీరోగములును నేత్రకర్ణజిహ్వా నాసాశిరోరోగభేదములును స్థౌల్యమేదోవృద్ధిరోగములును పరిణామశూల మహాశూలలును ఉన్మాదాపస్మారరోగములును వ్రణభేదములును సూతికారోగ భేదములును బాలరోగములును ఇట్టి యనేకరోగభేదము లసంఖ్యాతములై వెలయుచుండును.

ఇట్టు లొక్కొకయవయవము నంటినరోగం బయ్యంగమున కేదో వైకల్యము గలిగించినట్లు సూచించుచున్నది. తద్ద్వారముగా నారోగవిషము శరీరమాద్యంతము వ్యాపించుచుండును.

## రోగసామాన్యము

పైరోగముల ప్రత్యేకనిదానములను చింతామణి, బాహటము, బసవ రాజీయము, మొదలయిన గ్రంథములం జూడగా దెలియగలదు. పైరోగా దులు సూక్ష్మవేదనయుక్తముగ నుండునదియును, శరీరబలముకన్న నే రుగ్మత గాని స్వల్పముగనుండునది సాధారణముగాను, ఆహారబలము బాహుబలము మనోబలము దైవబలము తగ్గకుండువరకు సామాన్యముగాను నుండును.

మఱియుం జ్వరము లేకుండునట్టిరుజము సామాన్యము. ఏరోగమునందు నిద్రాహారములు చక్కగా నుండువరకును పెక్కులుపద్రవము లేకుండువరకును;

సమస్తేంద్రియపాటవము పూర్ణముగ నుండువరకు సామాన్యమనియు, రోగో త్పత్తికారణము స్వల్పదోషమాయెనేని రోగసామాన్యముగాను, రుగ్మత యందుగల వాతాదిదోషములు స్వల్పదోషముగనుండునదియును, ఎప్పటి కప్పుడు నివారణమగునదియును, విడిచి వచ్చునట్టిదియును, వాతాద్యేకదోష ముగ నుండునదియు సామాన్యముగా గ్రహించవలయును.

## గాఢరోగభేదములు

వైరోగాదులు కారణానుగుణముగ సామాన్యగాఢములుగా సంభవిల్లును. శరీరబలముకంటె రోగోపద్రవము లధికమాయెనేని రోగములందు వాతాదులు ఏక ద్వి త్రిదోషయుక్త తీక్ష్ణములైన రోగములు గాఢములుగా నుండును. మఱియు రోగికి మఱిమఱి రోగాలు పుట్టుచువచ్చినను, నిద్రాహారములు తగ్గుచువచ్చినది యును, రోగము సావకాశముగ విడిచివిడిచి వేధించుచుండినది వెంబడివెంబడిగ గాని, యెడపడకగాని యేర్పడునది అసాధ్యము. ఇట్టిరోగములందు మహాతీవ్ర మైన జ్వరముగలిగినను, అధికోపద్రవముగ లక్షణము లధికమాయెనేని అసా ధ్యము. ఔషధమునకు విరోధముగనుండునట్టి రోగ మసాధ్యము. ఏరోగము సామాన్యముగాగాని, గాఢముగాగాని, తరుణకాలమున గడపి పురాణమున శోఫాతిసారములపరునకు గొనివచ్చునట్టి దసాధ్యము. అదియునుంగాక యొక లేప సామాన్యముగ గనుపడి, కొంతకాలములేకుండి, తిరిగి రెండవ లేపగలుగు నపుడు గాఢమై అసాధ్యముగా గలుగును. అదియె అంతమున విషస్వరూపమై తద్గుణములు గలసి మరణమును బొందించును.

## విషగుణములు

ఇట్లు సమస్తరోగములు ప్రారంభములోగాని కొంతపఱకు ననుభవమైన పిదపగాని విషముగ సంక్రమించును. ఇంద్రియములు వికలత్వముజెందుచో నానావిధములుగనుండును. పట్టరానిబలము గలిగియుండును. పిచ్చివానివలె సంభాషించును. తనలోదాను గొణుగుకొనును. ఒకప్పుడులెట్టును, నవ్వును,

ఏడ్చును, వెక్కిరించును, కేకలు వేయును, పాడును; ఒకటియడిగిన మఱియొకటి చెప్పును, స్వయముగా వదరుచుండును, పులకరించును. మతిభ్రమ గలుగును, బట్టలిడ్చును, ప్రేళ్లతో చిత్రముగ బుఱుకుచుండును. ప్రపంచజ్ఞానమెఱుగ రాకుండును. దృష్టికి గోచరింపనిది తనకుగానవచ్చునట్టు లదిగో యిదిగో యని ప్రలాపించుచుండును. భయమునొందును. ముఖ్యముగ మనస్సుస్థిమితములేక పరిపరివిధములుగ నుండును. ఇవియే విషగుణములుగా గ్రహించవలెను.

ఈ మొదలైన గుర్తులు ఏరోగములో నిట్టు గానవచ్చునో, యది విషాశ్రిత మగునట్టు లెఱుంగునది.

## అష్టాంగచికిత్సవిచారము

బృహదభిధానే:—శల్యాద్యష్టాంగకే ఆయుర్వేదే యథా:—శల్యం, శాలాక్యం, కాయచికిత్సా, భూతవిద్యా, కౌమారభృత్యం, అగదతంత్రం, రసాయనతంత్రం వాజీకరణతంత్రమితి.

## శల్యమ్

వివిధతృణ కాష్ఠ పాషాణ పాంశు లోహాలోష్ఠాస్థి వాల నఖపూయాస్రావాంతర్గర్భ శల్యోద్ధరణార్థం, యంత్రశస్త్రక్షారాగ్ని ప్రణిధాన వ్రణ వినిశ్చయార్థంచ.

## శాలాక్యమ్

ఊర్ధ్వజత్రుగతానాం రోగాణాం శ్రవణనయనవదన ఘ్రాణాది సంశ్రితానాం వ్యాధీనా ముపశమనార్థమ్.

## కాయచికిత్సా

సర్వాంగసంసృతానాం వ్యాధీనాం జ్వరాతిసారరక్తపిత్తశోషోన్మాదాపస్మార కుష్ఠ మేహాదీనా ముపశమనార్థమ్

### భూతవిద్యా

దేవాసురగంధర్వయక్షరక్షః పితృపిశాచనాగ గ్రహాద్యుపసృష్టచేతసాం శాంతి కర్మ బలిహరణ గ్రహోపశమనార్థమ్.

### కౌమారభృత్యమ్

కుమార భరణ ధాత్రీక్షీరదోష సంశోధనార్థం, దుష్ట స్తన్య గ్రహస ముత్థానాం చ వ్యాధీనా ముపశమనార్థమ్.

### అగదతంత్రమ్

సర్ప కీట లూత వృశ్చికమూషికాది దష్టవిష వ్యంజనార్థం, వివిధ విషసంయోగ విషోపహతోప శమనార్థమ్.

### రసాయనతంత్రమ్

వయస్థాపన మాయుర్మేధా బలకరం రోగ ప్రహారణ సమర్థంచ.

### వాజీకరణతంత్రమ్

అల్పదుష్ట విశుష్క క్షీణ రేతసా మాప్యాయనం ప్రసాదోపచయ జననిమిత్తం ప్రహర్ష జననార్థంచ, ఏవం, సుశ్రుతః, కర్మమ్.

ఇది వాతాదిదోషస్వరూపనిరూపణ ప్రకరణము.

---

## షష్ఠ ప్రకరణము

### మేహాజ్వరప్రకరణము

మేహాజ్వరములు కొన్నిగలవని వచింతురు. పాండుశోభాతిసారంబులును, కాసశ్వాసక్షయాదులును, వీనియుపద్రవకాలమున గలుగునట్టిజ్వరశేష ములకు మేహాజ్వరములని పేరు.

సమస్తామయములు జ్వరముతోఁగూడి నూతనమున నిదియని దలంచుచుఁ, బురాణమునఁ బైరోగామయముహరించినను జ్వరాద్యుపద్రవము హరించి తచ్ఛేషము నిలిచి దారుణముజేయునటుల వచ్చుచుండుదానిని మేహాజ్వరమని వక్కాణింతురు.

మఱియు జ్వరములలో నేజ్వరము దీర్ఘకాలమువఱకు వ్యాపించి యుపద్రవములేక పురాణకాలమున శేషించి స్వల్పముగ వచ్చుచుండునో, దానిని యౌవనవృద్ధాప్యదశలయందుండు వారియందుగలిగినపుడు, మేహాజ్వరమునుగా బలుకుదురు. బాల్యమందుండు వారికివచ్చినచో నది మేహాజ్వరము గాదందురు.

ఇందులో ముఖ్యాభిప్రాయము వ్రాయబడును. మేహామన మేహానము అనగా పురుషునియొక్క మర్మస్థానము. ఇట్టిస్త్రీ పురుషులమర్మస్థానములవలన గలుగునట్టిరోగములు మేహారోగము లని యెఱుంగవలయును.

మేహః = మేహానం తస్మా దుత్పన్నోరోగః = మేహారోగః అని మధ్యమపదలోపసమాసమున దీనియర్థము. ఉభయమేహాములవలన గలుగు వానిని మేహారోగముగా గ్రహించవలయును. తద్రోగములచే జనించు జ్వరములను మేహాజ్వరములుగా నెఱుంగవలయును.

మఱియు నట్టిరోగములం బెనంగొని యుపద్రవములేక శేషించి దారుణముగ గాచుదానిని మేహాజ్వరమని యెఱుంగునది.

మఱియు నిట్టి సుఖసంకటమైనరోగములతో బహుపీడితుడై తచ్ఛేషము శరీరమున నిమిడి సుఖముగనుండుట సహజము. అట్టివానికిఁబొందుశోభాతిసార జ్వరరోగాదులు మూడినప్పుడు మేహాపొందు జ్వరరోగములుగా గ్రహించవలయును.

మేహాద్యుపద్రవరుజములతోఁ జిరకాలము శ్రమంజెంది, తచ్ఛేషము శరీరమునఁటియుండి విరుద్ధకార్యముగాని వస్తువుగాని సంధిల్లినపుడు శరీరము

నంటియున్న రుజము తిరిగియున్నట్టు అప్పుడప్పుడు గానుపించుచుండును. లేక, రోగశేషము దేహమునంటి వేదనరహితమై స్వాభావికముగ దేహము నంటి యుండును. మేహస్వరూప మెట్టిదనగా, నాగంతుకరోగములలో జేరునవిగా నెఱుంగవలయును. వ్యాయామాభిఘాతాదికృత్యములం గలుగునవి.

ఆగంతుకము శారీరము అని రోగములు ద్వివిధమార్గములు. మిథ్యాహారములవలన గలుగునవి శారీరమునకు నైజమైనరోగములనియు, వ్యాయామము అభిఘాతము మొదలయిన విహారకృత్యములవలన గలుగునవి యాగంతుక రోగములనియుం, బూర్వమే చెప్పంబడియున్నవి.

మఱియుం మేహరోగములు విహారకృత్యములవలన గలుగునవిగావున, నాగంతుకరోగములలో జేరునవిగా గ్రహించవలయును. ౧. స్త్రీపురుషసంపర్కమువలన నుభయులయంగములు వైషమ్యమును జెందుట, తద్ద్వారముగ శుక్లశోణితములు నశించుట. స్త్రీపురుషమేహములందుఁ దొలుతఁ బుండువంటి రోగములు తదంగములందు ఘటించినవెనుక, వాతాదిదోషములవలన వేదనయుక్తమై, తద్దోషము దేహమాద్యంతము రక్తాదిధాతువులందు మిశ్రమమై పరిపరివిధములయిన రుజములు సంప్రాప్తించును.

ఉభయమేహములవలన సుష్ఠాతిశయమై తదంగములందు బుండువంటి యామయములుగలిగి తొలుత సంభవించి తద్ద్వారముగ శుక్లశోణితములనంటి ధాతువులం జెరుపునట్టి నానావికారములయినరోగములు సంఘటించును. నొప్పి యొకేవిధమైనదిగనుండినను దనువునకంటిన రోగములు నానావిధపీడాకరములుగా నుండును.

## మేహరోగోత్పత్తి విధము

ఉష్ణద్రవ్యా ణ్యపథ్యాని హ్యుష్ణవీర్యం చ జాయతే,
వీర్యేణ తేన మేహశ్చ మేహరోగ స్స ఉచ్యతే.

మేహోఽపి వీర్యనాశశ్చ చికిత్సాం కురుతే భిషక్,
పూర్ణచంద్రోదయం పేయం క్షీణరేతోహరం పరమ్.

ఉష్ణద్రవ్యముల చేతను శరీరాపథ్యముల చేతను ఉష్ణము వీర్యమునకు సోకి యుష్ణవీర్యమగును. పై ఉష్ణవీర్యముచేత బుట్టబడినరోగమే మేహరోగమని చెప్పబడును. దీనిచేతనే వీర్యనష్టమవును గనుక వీర్యవృద్ధి క్రియలనే చేయవలెను. ఇందుకు పూర్ణచంద్రోదయము పుచ్చుకొన్నయెడల వీర్యవృద్ధియగును.

ఇట్టి మేహోద్యుపద్రవములు రెండువిధములుగ గలుగును. ౧. పసిమి. ౨. ఉపదంశము అనగా కొరుకు.

౧. పసిమిరోగమువలన వింశతి మేహములు సంభవించును. పసిమికి మూత్రమువచ్చునపుడు మంట నొప్పిగలుగును. పురాణమయినను మంట నొప్పి లేకుండును. దీనిని తొలుతనే హరింపజేయవలెను. అది పురాణమై శరీరమున జీర్ణమయినయెడల ననేకరోగములలోనికి గొనివచ్చును. దీనితోగూడ గజ్జలసంధియందు వడిసెగడ్డలు లేచును. శేఫ్రము వాచును. నొప్పిగలుగును. నొప్పివిశేషమగుకొలది జ్వరముగలుగును. ప్రారంభముతోకూడ జ్వరము సంక్రమించును. పైసెగ సంకటము పాతది గానుగాను, వేరురోగములకు ద్రిష్టికొనును. అవి అండరోగము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, భగంధరములు, మధుమేహాది ౨౦ మేహములు, కీళ్లనొప్పులు, ధాతునష్టము మొదలగునవి.

౨. ఉపదంశమువలన గలుగునవియేవనగా:—— మేహనములు కొరుకు తినువంటిరోగము అది గుదమును చీములుబట్టినట్టుగా నాయంగమునుబట్టును. తొలుత నొప్పి మేహనమువాపు, చీముద్రవించుట గలుగును. అది నిశ్శేషముగ హరించుదనుక ఔషధసేవ పథ్యముతో జరిపించవలెను. ఈరోగము మిగుల చెడుదిగ నుండును. అంగమును త్వరలో చెడుపుజేయును. అదివేగమే రక్తమును చెడుపుజేసి, తదితరరోగముల గొనివచ్చును.

కురుపురోగములు పొడలు చట్టలు సవ్వాయిరోగము నొప్పులు బొటీలు కుష్ఠువు మొదలైనవి ౨౦ విధములుగా వ్యాపించును.

ఈ రెండువిధములలో మార్గము కనుపరచితిని. దేశకాలతత్వభేదములచే నిన్నివిధములని చెప్పుటకుకాదు. బుద్ధిమంతులు పైమార్గములబట్టి గ్రహించవలెను.

మఱియు నీరోగముగలవారు పథ్యముగ నుండవలెను. ఏకారణమువలన సంభవించినదో, అది రోగము నిశ్శేషముగ హరించువరకు లేకుండవలెను. పైరెండువిధములు జీర్ణమైనచో నానారోగములు గొనివచ్చును. అదియుంతుంగాక పైరెండువిధములు నొకేతూరిగ సంభవించును. అప్పుడు జ్వరముకూడ నుండును. రోగములు గాఢముగ నుండుచు గావున, నప్పటప్పటిరోగముబట్టి సులభత్వగాఢత్వాద్యనుగుణముగా ద్వంద్వజాతులనెఱింగి చికిత్సజేయవలెను.

ఉపదంశరోగములవరుసకు, రసము శ్రేష్ఠము. భల్లాతకి నారసింహలేహ్యము నూగుదోసమాత్రలు మొదలగునవి మంచివి. పసిమికి చందనపు అత్తరు, చల్వమిర్యాలతో జేరినఔషధములు, గుగ్గిలముతో జేరినవిగా నిప్పించవలెను. తత్త్వము రోగస్వభావము నెఱింగి తదనుగుణముగ కల్పించి యియ్యవలెను.

ఇది మేహజ్వరనిరూపణప్రకరణము.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారి
'వావిళ్ల'ప్రెస్సున ముద్రితము.—1952

# వైద్యగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అజీర్ణమంజరి | ... | 0 | 6 |
| అనుపానమంజరి | ... | 0 | 12 |
| కాలజ్ఞానము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| వైద్యశతశ్లోకి ,, | ... | 0 | 8 |
| రావణకుమారతంత్రము ,, | ... | 0 | 8 |
| దేహతత్త్వనిర్ణయము ,, | ... | 0 | 6 |
| రాజమార్తాండము ,, | ... | 0 | 12 |
| లోలంబరాజీయము, సద్వైద్యజీవనము | ... | 0 | 12 |
| వస్తుగుణమహోదధి, తెనుగువచనము | ... | 10 | 0 |
| షడ్రసనిఘంటువు, అభిధానరత్నమాల | ... | 1 | 0 |
| నాడీజ్ఞానము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| మసూచికము (Small-pox) | ... | 0 | 4 |
| సహదేవపశువైద్యశాస్త్రము ,, | ... | 0 | 8 |
| శ్రీనాథపణ్డితవిరచిత పరహితసంహిత, సాధారణకాణ్డము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | ... | 8 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | ... | 6 | 0 |
| డిటో శారీరనిదానస్థానములు | ... | 4 | 0 |
| డిటో ఉత్తరస్థానము | ... | 6 | 0 |
| ఇలాజుల్ గుర్బా, యూనానివైద్యము | ... | 5 | 0 |
| చరకసంహిత, సూత్రస్థానము | ... | 8 | 0 |
| ,, శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు | ... | 6 | 0 |
| ,, చికిత్సాస్థానము | ... | 10 | 0 |
| ,, సిద్ధి-కల్పస్థానములు | ... | 4 | 0 |
| వైద్యచింతామణి, ఆంధ్రతాత్పర్యసహితము, రెండుసంపుటములు | | 16 | 0 |
| భేషజకల్పము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| దేశీయవైద్యవిజ్ఞానము, తెనుగువచనము | ... | 1 | 8 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| గదనిగ్రహము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 4 | 0 |
| ఘృతతరంగము " | ... | 1 | 4 |
| చికిత్సాసారము " | ... | 2 | 8 |
| బసవరాజీయము " | ... | 12 | 0 |
| చారుచర్య, భోజరాజకృతము, ఆంధ్రపద్యలఘుటీకలతో | ... | 0 | 6 |
| రసరత్నాకరము, ఆంధ్రతాత్పర్యము | ... | 8 | 0 |
| వృక్షాయుర్వేదము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| శార్ఙ్గధరకృతత్రిశతి " | ... | 0 | 12 |
| సుశ్రుతశారీరము " | ... | 3 | 0 |
| సర్వౌషధిగుణకల్పకము, తాత్పర్యసహితము | ... | 3 | 0 |
| సూతికాచికిత్స, డా॥ వరదప్పనాయుండుగారిది | ... | అచ్చు | |
| రసప్రదీపిక, పద్యకావ్యము, ఆంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| విషవైద్యచింతామణి, తెనుగువచనము | ... | | " |
| మాధవనిదానము, ఆంధ్రవ్యాఖ్యానము | ... | 6 | 0 |
| సుశ్రుతసంహిత, (పూర్తి) అన్నిభాగములు | | అచ్చు అగుచున్నవి | |

## జ్యోతిషగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| ఆఱువది (గత)సంవత్సరములపంచాంగము 1867-1927 | | అచ్చు | |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 1 | 0 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 2 | 8 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుగు | ... | 0 | 8 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 4 |